ఆంధ్ర సచిత్ర వారపత్రిక

21-27, జూ 5, '85

రూ. 2/-



రెండు కొత్త సీరియల్ నవలలు

**సుస్రుత నర్సింగ్ హోమ్**

★

**ముసురు వెలిసింది**

ప్రారంభం!

# నెస్టమ్ బేబీ సిరియల్
# ప్రారంభించేందుకు ఆదర్శప్రాయమైనది
# పెరుగుదలకు ఆదర్శప్రాయమైనది

**నెస్టమ్, పాలు-పూర్తి పోషక విలువలున్న ఆహారం.**

మీ బాబు సుమారు 4 నెల్లవాడయేసరికి, కావాలి పాలతోపాటు మనఆహారం పాపాయికి తేలిగ్గా జీర్ణమయేట్టు, ప్రత్యేక శ్రద్ధతో తయారయిన నెస్టమ్ బేబీ సిరియల్ ని పెట్టడం ప్రారంభించండి.

ముందుగా మరిగించి పెట్టిన గోరువెచ్చటి పాలతో కలపండి. ఇక, పూర్తి పోషక విలువలున్న ఆహారం సిద్ధమవుతుంది.

పాపాయి ఆరోగ్యంగా, చలాకీగా పెరిగేందుకు తోడ్పడుతుంది.

**నెస్టమ్‌తో వివిధ వంటలు పాపాయి ఆహారంలో బోలెడన్ని రకాలు**

మీ పాపాయి ఎదుగుతున్న కొద్దీ కొత్త రకాలు రుచి చూపించండి.

ఉడికించిన కూరముక్కలూ, పండ్ల ముక్కలూ, పప్పు-[illegible] నెస్టమ్‌తో కలిపి పెట్టండి. బాబు, కుటుంబంలో వారు తినే ఆహారాన్ని తీసుకోవడం నేర్చుకునేందుకు ఇది తోడ్పడుతుంది.

## నెస్టమ్®
## రైస్

ఇనుము-విటమిన్లతో కూడినది
పాలలో కలపండి.




**ఉచితం**
మీ బాబు, తన ఆహారంలో, కొత్త రుచులను కోరుతాడు అందుకని—మీ ఉచిత నెస్టమ్ వంటల పుస్తకం కోసం రాయండి.
నెస్టమ్

SAA/FSL/N/3800 TEL


BHASKAR

## ముఖచిత్రం

ఆ వె చిలిపి కనుల తోడ – చిన్నారి శ్రీదేవి
సొగసు మీరె నెంతో – చుక్క నొసట
వాలు రేవి జూడ వయ్యార మొలికించె
ఆంధ్రపత్రికందు అట్టబొమ్మ

అల్లుమల్లు భగవతి, విశాఖపట్నం

* * *

మా అభిమాన నాయకుడు యువ డైనమిక్ హీరో, నేటి సినీ రంగములో ఎదురులేని మొనగాడు, ఎన్నటికీ ప్రేక్షకుల హృదయాలలో చిరంజీవిగా నిలిచిన చిరంజీవి గారి ముఖచిత్రము వేసినందుకు చాలా థ్యాంక్స్

ఎం సునీత, అనసూయ, కమలాపురము

## కథలు

మీనాక్షీ శేషాద్రి ముఖచిత్రం గల సంచికలో 'ఈశ్వర అల్లా తేరేనామ్ కథ చాలా బాగుంది

సింగం దత్తాత్రేయమూర్తి, ఒంగోలు

* * *

12–18, ఏప్రిల్, 85 లో వెలువడిన శ్రీమతి కాకాని కమలగారి కథ 'బాధ్యత' చాల బాగుంది ' యింటికి పెద్ద కుమారుడు అయి పుట్టడం కన్న అడవిలో మ్రాను అయి పుట్టడం' అన్న సామెత రామంకు సరిపోయింది ఈ కథలో రచయిత్రిగారు మనిషి చస్తే ఎంత ఖర్చులు, కొడుకు పుట్టితే ఎంత ఖర్చులు అనే బాధ్యతను రాబడి తక్కువ, ఖర్చులు ఎక్కువ వారికి బాగ తెలియచేసినారు రచయిత్రి గారికి నా ధన్యవాదాలు

ఎస్ వి వెంకటరావు, ఆదోని

## సీరియల్స్

ఆరె పద్మజాచౌదరిగారి మౌనవిపంచిలో ప్రభాత పాత్రను చాలా ఉన్నతంగా తీర్చిదిద్దిన రచయిత్రి గార్కి నా అభినందనలు కృష్ణచైతన్య పాత్ర చాలా గంభీరంగాను బాధాకరంగాను ఉంది ఈ సీరియల్ నవల నవలాలోకంలో ఆణిముత్యం అవుతుంది

అలాగే రాగసంధ్య సీరియల్ నవల బావుంది పడమట సంధ్యారాగం సీరియల్ నవల మొదటి రెండు మూడు వారాలు బాగోలేదు ఇప్పుడు ఆసక్తికరంగా ఉంది

ఎం శ్రీనివాస్, నెట్నూరు (కర్నాటక)

## తణుకులో "తిలక్ సాహితీ సంస్థ"

కవితా సతి నొసట నిత్యరస గంగాధర తిలకంగా భాసించి, వయస్సు సగం తీరకముందే అంతరించిన




ప్రజా కవిగా నభస్సు సగం చేరకముందే అస్తమించిన ప్రభాకవిగా శ్రీశ్రీ వంటి మహాకవి చేత స్మరింపబడిన కవికులతిలకుడు స్వర్గీయ దేవరకొండ బాలగంగాధర తిలక్ తాను జీవించిన కాలంలో సమకాలికులకన్నా ఎంత ముందుకు పురోగమించాడో కాలం గడిచిన కొద్దీ మరీ మరీ రుజువవుతోంది

ఏ సాహితీరంగంలో అయినా, తిలక్‌వంటి బావుకులు, క్రాంతదర్శులు, కావ్యస్రష్టలు అరుదుగానే సంభవిస్తారు కవితారహస్యం కవికే తెలుసుననీ కాళిదాసుకూ పెద్దన్నకూ, కృష్ణశాస్త్రికీ, శ్రీశ్రీకీ మాత్రమే తెలిసిందనీ చెప్పిన తిలక్ కూడా ఆ పట్టికలో చేరవలసినవాడే కవితా రహస్యం తెలిసిన తిలక్‌నుంచి ఆ రహస్యం తెలుసుకోవడానికి నూతన తరాలకు అవకాశం ఎంతో ఉంది ఆ అవకాశాలను జ్ఞాపకం చేయవలసిన అవసరం కూడా ఎంతో ఉంది

అందుకే తిలక్ సాహిత్యాధ్యయన సంస్థ నొకదాన్ని తిలక్ జన్మస్థలమూ ఆవాస నగరమూ అయిన తణుకులో నెలకొల్పదలిచాము తాత్కాలికంగా దీన్ని "తిలక్ సాహితీ సంస్థ" అంటున్నాము ఈ సంస్థ ద్వారా మేము సాధించదలచిన లక్ష్యాలు స్థూలంగా ఏమిటంటే– 1 ఏడాది కొకమారు తిలక్ సాహిత్యంపై పరిశోధనాత్మకంగా ఉండే ఒక ఉపన్యాసాన్ని ఏర్పాటు చేయడం 2 తిలక్ సాహిత్యం పై యువతరానికి ఆసక్తిని పెంచే కార్యక్రమాలను నిర్వహించడం, 3 తిలక్ సాహిత్యం పై వెలువడే వ్యాసాలనూ పరిశోధనలనూ సేకరించి, ఒక సమగ్ర సూచికను ప్రచురించడం , 4 వచన కవిత్వానికి తిలక్ రూపొందించిన లక్ష్యాలను బట్టి లక్షణాలను తయారుచేసే కృషిని ప్రోత్సహించడం, 5 యూనివర్శిటీలలో తిలక్ కవితా పీఠాలనూ తిలక్ సాహిత్యాధ్యయనాన్నీ పెంపొందించడానికి ఆయా విశ్వవిద్యాలయాల ఆచార్యులను సంప్రదించడం వంటివి

తణుకులో ఈ సంస్థను నెలకొల్పడానికి తగు సూచనలనూ, అభిప్రాయాలనూ సలహాలనూ రచయితలు, కవులు , పరిశోధకులు శ్రీ డి బి రామారావు, అడ్వకేట్, తణుకు–534211 అనే చిరునామాకు అందజేయవలసిందిగా నిర్వాహకులు కోరుతున్నారు ☐


**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

శుక్రవారం 21-27 జూన్ 1985
శ్రీ క్రోధన నామ సం ఆషాఢ శు తదియ

సంపుటము 77 : సంచిక 42

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-00 |
| ఆరు మాసాల చందా | రు. | 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. | 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# యూరప్‌ని సంఘటితం చేసిన యుద్ధం!

జర్మన్‌లపై విజయాన్ని సాధించినందుకు వారు 40 వ వార్షికోత్సవాలని జరుపుకుంటున్నారు అయితే ఆ యుద్ధం మొదట యూరోప్‌లోనే ముగిసింది కాబట్టి వాటి అవసరం అంతగా ఉందనిపించదు పశ్చిమ దేశాలలో యుద్ధం ముగిసిన 6 నెలలకి తూర్పున యుద్ధం పరిసమాప్తి అయిన మూడు నెలల అనంతరం యూరోప్‌కి వెళ్లిన మొదటి విడత 300 మంది విద్యార్థులలో నేను కూడా ఒకడిని 1945 లో నేను ఇంగ్లాండు వెళ్లాను సైనికులని తిరిగి స్వదేశానికి తీసుకు వెళుతున్న ఒక ఓడలో మేము బొంబాయి నించి బయలుదేరాము అందులో 300 మంది ఉన్న మా విద్యార్థులే మామూలు పౌరులు. మిగిలిన వారందరూ దూర ప్రాచ్యం నించి తిరిగి స్వదేశానికి వెళుతున్న సైనికులే క్రిక్కిరిసిన ఆ ఓడలో వాళ్లు నాలుగు వేల మందికి పైగా ఉండి ఉంటారు. నవంబరు నెల చలిలో, మంచు కురుస్తున్న ఓ ఉదయాన మేము సౌతాంప్టన్ చేరుకుని అక్కడి నించి ఓ ప్రత్యేక రైలులో లండన్‌కి తరలించబడ్డాము

ఆ పగలంతా తినడానికి కొన్ని గట్టిగా ఉన్న బిస్కట్లు, కొద్దికప్పుల టీ తప్ప మరేమీ మాకు దొరకలేదు లండన్ చేరిన తర్వాత మాకు తెలిసింది ఆ ప్రాంతమంతా కరువు తాండవిస్తున్న సంగతి. ఒక రెస్టారెంటులో మాకు పచ్చి పచ్చిగా ఉన్న ఉడకబెట్టిన చేపలని సగం ఉడికిన బంగాళాదుంపలని, చాలా పల్చగా ఉన్న రొట్టెకి వెన్న పూసి ఇచ్చారు వాటి ఖరీదు మనకి ఇక్కడ ఒక రూపాయితో సమానంగా ఉంటుంది అయినా పర్వాలేదనిపించింది రాజారామన్న అప్పుడు నాతోనే ఉన్నారు తర్వాత కూడా మేమిద్దరం సౌత్ కెన్సింగ్టన్‌లో ఒకావిడ ఇంట్లో కలిసి అద్దెకి ఉన్నాము మేము కొనగలిగినవి ఆపిల్స్ ఒక్కటే అనిపించింది వాటినే తిని బతకాలని నిర్ణయించుకున్నాము మధ్య లండన్‌లోని భవనాలలో సగం బాంబుల దాడికి ధ్వంసమైనాయి బకింగ్‌హాం పాలెస్ చుట్టూ పెద్ద పెద్ద గోతులు పడ్డాయి వీధులలో ముష్టివారు ఏదైనాసరే అమ్మడానికి సిద్ధంగా ఉన్నారు ఒకటి లేదా రెండు మద్యంసీసాలకి పాత బట్టలు, ఫర్నిచర్, బూట్లు మొదలైనవి విక్రయిస్తున్నారు ఆరు వారాలకి ఒకసారి కంటే ఎక్కువ తడవలు స్నానం చెయ్యరాదని మాకు చెప్పారు

ఆ ఖండంలో పరిస్థితులు చాలా దారుణంగా ఉన్నాయి జర్మన్‌లు పారిస్‌ని ముట్టుకోలేదు తిండి పెద్ద సమస్య కాకపోయినా మిగతావన్నీ సమస్యలే పికాసో, వాన్ గోగ్‌ల వంటి చిత్రకారులు వేసిన అసలైన చిత్రాలని మా మిత్రుడు ఒకరు కొన్ని చాక్లెట్ బార్‌లు ఇచ్చి కొనుక్కున్నాడు జర్మనీలో ఒక సిగరెట్టు పెట్టె ఖరీదు పెడితే పెద్ద మహల్‌లో ఉండి ఆయా ఋతువులలో తయారయ్యే మద్యాన్ని సేవించవచ్చు నేను ఉన్న ఒక హోటల్ నూరెంబర్గ్‌కి అట్టే దూరం ఉండదు అది హిట్లర్ సైన్యంలోని ఒక నాజీ కల్నల్‌ది. అక్కడే నాజీలపై విచారణ జరుగుతున్నది. ఆయన మా సదుపాయాల సంగతి అంతగా పట్టించుకునేవాడు కాదు. కళాశాలలు,




కర్మాగారాలు, రైల్వేస్టేషన్‌లు బాంబుల దెబ్బకి నేలమట్టం అయినాయి కానీ రోడ్లు మాత్రం శుభ్రంగా, చెక్కు చెదరకుండా ఉన్నాయి కొన్ని రైళ్లే నడిచినా అవి సరిగ్గా సమయానికే నడుస్తున్నాయి అప్పుడు నాకు మొత్తం జాతీయ ఉత్పత్తి మొదలైన వాటి గురించి తెలియదు కానీ యూరోప్‌లోని చాలా దేశాలలో సగటు తలసరి ఆదాయం ప్రస్తుతం మనదేశంలో తలసరి ఆదాయంకంటే తక్కువేనని మాత్రం చెప్పగలను ఇంగ్లాండులో అప్పుడు నెలకి రు 300 పెడితే టైపిస్టు దొరికేవాడు నెలకి ఒక కార్మికుడు రు 400 ఇంటికి తీసుకు వెళ్లేవాడు

నేను 50 వ దశకం పూర్వార్ధంలో తిరిగి వచ్చాను అప్పటి నుంచీ కొద్ది సంవత్సరాలకి ఒకసారైన యూరోప్ ముఖ్యంగా నా రెండో స్వగ్రామం లాంటి ఇంగ్లండ్, వెళ్లి వస్తూనే ఉన్నాను యుద్ధం అయిపోయిన తర్వాత పది ఏళ్ల లోగానే యూరోప్ అభివృద్ధి చెందటానికి తన సర్వశక్తులూ కేంద్రీకరించింది అన్నిచోట్లా కొత్త కర్మాగారాలు వెలిశాయి బాంబు దాడికి గురైన ప్రాంతాలలో సరికొత్త గృహసముదాయాలు నిర్మింపబడ్డాయి ప్రతి సంవత్సరమూ లండన్‌లో కొత్త నాటకాలు ప్రదర్శింపబడేవి కొత్త చలనచిత్రాలు ఎన్నో తయారయ్యేవి కొత్త రచయితలు కొత్త కళాకారుల ఆవిర్భావం జరిగింది సంస్కృతి వెల్లివిరుస్తున్నదనడానికి నిదర్శనంగా లండన్‌లోని సోహోలో ఒక చదరపు మైలు విస్తీర్ణంలో పుస్తకాలు, ముద్రిత చిత్రాలు కళాకేంద్రాలతో నిండి ఉండేది అక్కడ మరింకేవీ కనిపించేవి కావు పారిస్, బాన్‌లలో ఒక కొత్త నాటకాన్ని చూడటానికి వారాల తరబడి వేచి ఉండాల్సి వచ్చేది ఆర్థిక పరంగా యూరోప్‌ది పైచెయ్యిగా ఉండి ఉండకపోవచ్చు అక్కడ ఉన్న లక్షలాది కార్మికులు కష్టాలలో ఉండి ఉండవచ్చు కాని అది ఒక అద్భుతమైన ఖండంగా ఉంది అక్కడ ఒక కొత్త నాటకరచయితకి లేదా ఒక కొత్త నవలకి కూడా ఒక కొత్త ఎలక్ట్రానిక్ సాధనానికి, లేదా రాజకీయాలలో ఒక కొత్త ముఖానికి లభించినంత ప్రచారం పత్రికల పతాకశీర్షికలలో లభిస్తుంది

యూరోప్ దానిని ఎలా సాధించ గలిగింది? యుద్ధం ముగిసిన తర్వాత యూరోపియన్ నాయకులు యుద్ధానంతరం ప్రపంచంపై దృష్టిని సారించారు ఇంగ్లీషు వారిగా, ఫ్రెంచివారిగా, లేదా జర్మన్‌లుగా వారికి అంతగా భవిష్యత్తు లేదని తెలుసుకుని కొత్త ప్రపంచంలో దిగజారి పోకుండా వుండటానికి కలసికట్టుగా ఉండాలనుకున్నారు హిట్లర్ రంగంలోకి వచ్చే వరకూ సంయుక్త యూరోప్ అన్నది అస్పష్టమైన ఆలోచనే మొట్టమొదట దానిని నాశనం చెయ్యడం ద్వారా హిట్లర్ యూరోప్‌ని సంఘటితం చేశాడు హిట్లర్ తర్వాత యూరోపియన్‌లకి పునర్నిర్మాణం తేలిక అయింది బొగ్గు, ఉక్కు ఉత్పత్తి చేసే జాతిగా ఫ్రెంచివారు, జర్మన్‌లు దగ్గరైనారు అనంతరం కామన్ మార్కెట్ ద్వారా నెమ్మదిగా

( 8 వ పేజీ చూడండి )

# పంజాబు రాజకీయాల రంగుల రాట్నం

శిరోమణి అకాలీదళ్‌లో సిక్కు మతానికి చెందిన వారు తప్ప ఇతరులు చేరటానికి వీలులేదుట. 1947లో పాకిస్తాన్ అవతరించిన తరువాత



శ్రీమతి ఇందిరా గాంధి

భారతదేశానికి వచ్చిన పంజాబులో శిరోమణి అకాలీదళ్ సిక్కుల పార్టీగా అభివృద్ధి చెందటంలో నిజానికి వింతలేదు. 1946 ఎన్నికలలోనే శి. అ. ద. సిక్కులకోసం కేటాయించిన 33 సీట్లలో 23 గెలుచుకోగలిగింది. మిగలా 10 కాంగ్రెసు గెలుచుకుంది ఈ ఎన్నికలలో కాంగ్రెసుకి మొత్తంమీద 51 సీట్లు వచ్చాయి.

అంటే, కాంగ్రెసుకి 51, శి. అ ద.కి 23 అన్నమాట! ఈ రాజకీయ పక్షం 1946 లోనే కాంగ్రెసు గెలుచుకున్న స్థానాలలో సగం కూడా గెలుచుకోలేకపోయింది.

అంతేకాదు, అకాలీలలోని నాగోకె వర్గం వారు కాంగ్రెసు వారు ఏర్పరచిన ప్రభుత్వానికి మద్దతు ఇచ్చారు. వారిలో ఒకరు మంత్రివర్గంలో చేరారు.

1948లో మాస్టర్ తారాసింగ్ కాంగ్రెసుతో తమకి కుదరదని ప్రకటించటంతో అప్పటి అకాలీ నాయకులు తమ పార్టీ శాసన సభ్యులని కాంగ్రెసు పార్టీలో చేరిపొమ్మని ఆదేశం ఇచ్చారు. ఒక సంవత్సరంలో వారందరూ అలాగే చేరారు.

కాంగ్రెసులోనూ, అకాలీదళ్‌లోనూ కూడా విభేదాలు అధికంగా ఉండేవి. 1949లో అప్పటి ముఖ్యమంత్రి గోపీచంద్ భార్గవ పదవీచ్యుతు లయ్యారు. భీమ్‌సేన్ సచార్ ఆయన స్థానంలోకి వచ్చారు. శి. అ. ద. వారు భార్గవ, సచార్‌లకి ఇద్దరికీ మార్చి మార్చి తమ బాసటని ఇచ్చేవారు.

1950లో అకాలీ నాయకులు తమ పార్టీ నుంచి కాంగ్రెసులోకి వెళ్ళిన శాసనసభ్యులని తిరిగి వచ్చెయ్యమన్నారు. 22 మందిలో ఒక్కరే ఒకరు వీరి ఆదేశాన్ని పాటించారు.

ఏది ఎలాగ ఉన్నప్పటికీ పంజాబులో రాజకీయాలు బాగా అస్థిమితంగా ఉండేవి. గోపీచంద్ భార్గవ వర్గం క్రమంగా తన బలాన్ని కోల్పోయింది.

ఇంతలో అకాలీల నాయకుడుగా మాస్టర్ తారాసింగ్ బలపడటం మొదలుపెట్టారు. ఆయన "పంజాబీ సుబా" కావాలని 1948లోనే అడిగారు. పంజాబీ సుబాలో సిక్కులదే పయి చెయ్యిగా ఉండాలని ఆయన అన్నారు.

1952 ఎన్నికల ప్రచారంలో అకాలీల పార్టీ పంజాబీ భాషకల రాష్ట్రం కావాలన్న నినాదానికి ప్రాధాన్యం ఇచ్చారు.

ఆ ఎన్నికలలో ఫలితాలు ఇలాగ ఉన్నాయి:

| పార్టీ | గెలిచిన స్థానాలు | పడిన ఓట్లు (లక్షలు) | ఓట్ల శాతం |
|---|---|---|---|
| కాంగ్రెసు | 122 | 22. 07 | 34. 8 |
| అ. ద. | 033 | 09. 28 | 14. 7 |
| కమ్యూనిస్టు పార్టీ | 006 | 03. 38 | 05. 3 |
| జనసంఘం | 002 | 03. 15 | 02. 3 |
| స్వతంత్రులు ఇతరులు | 023 | 27.24 | 42.9 |
| మొత్తం | 186 | 65.12 | 100.0 |

సిక్కులు హిందువులు కారంటూనే అకాలీ నాయకులు తమ మతానికి చెందిన "సిక్కు" వారికి సదుపాయాలు కావాలని కోరి వాటిని



శ్రీ జైల్ సింగ్

తెచ్చుకున్నారు.

1954లో అకాలీలు శిరోమణి గురుద్వారా ప్రబంధక కమిటీ ఎన్నికలలో గెలిచారు. 1955లో పంజాబీ సుబా కోసం వారు ఒక ఉద్యమాన్ని లేవదీశారు.

రాష్ట్ర పునర్నిర్మాణ సంఘంవారు పంజాబు, హిమాచల్‌ప్రదేశ్, కొన్ని వాయవ్య ప్రాంతాలు కలిపి ఒకరాష్ట్రంగా రూపొందాలని సూచించారు. అకాలీలు ఈ సూచనని తిరస్కరించారు. మాస్టర్ తారాసింగ్‌తో పండిత నెహ్రూ మంతనాలు జరిపి ఒక ఒప్పందానికి వచ్చారు. దాని అంశాలు ఇవి.

1. వాయవ్య ప్రాంతాలు పంజాబులో కలుస్తాయి కాని హి. ప్ర. వేరుగా ఉంటుంది.

2. పంజాబులో రెండు ప్రాంతాలు ఉంటాయి-- హింది, పంజాబీ ప్రాంతాలు.

3. పంజాబీ మాట్లాడే వారి శాతాన్ని ఒక ప్రాంతంలో పెంచేందుకు కాంగ్రా జిల్లాని హిందీ ప్రాంతంలో చేరుస్తారు.

4. శాసనసభలో ప్రాంతీయ సంఘాలు ఉంటాయి.

1956 అక్టోబరులో అకాలీదళ్ వారు తాము కాంగ్రెసులో చేరగలమంటూ ఒక తీర్మానం చేశారు. మాస్టర్ తారాసింగ్ దూరంగాఉండిపోయి నప్పటికీ రెండవసారి అకాలీలు కాంగ్రెసులో



కె. నే. భింద్రనవాలే

చేరారు.

ఈ కలయిక ఎంతోకాలం నిలబడలేదు. రెండవ ఎన్నికలలో టిక్కెట్ల పంపకంలో పేచీలు వచ్చాయి. అకాలీలకి కాంగ్రెసువారు 26 స్థానాలు వదిలారు. అయినా చాలదని మాస్టర్ తారాసింగ్ 15మంది అభ్యర్థులని వేరే నిలబెట్టారు.

154 స్థానాలలో కాంగ్రెసుకి 120 వచ్చాయి.

మాస్టర్ తారాసింగ్ నిలబెట్టిన 15 మందీ ఓడిపోయారు.

కాంగ్రెసు టిక్కెట్లు ఇచ్చిన 26 మంది మంది అకాలీలూ గెలిచారు.

మామూలు ఎన్నికలలో వారి బలం ఎలా ఉన్నప్పటికీ గురుద్వారా ఎన్నికలలో అకాలీలే ఘనంగా గెలుస్తూ వచ్చారు. 1960 ఎన్నికలలో వారికి 140లో 136 స్థానాలు వచ్చాయి. ఈ బలాన్ని ఆధారంగా తీసుకుని మాస్టర్ తారాసింగ్ గురుద్వారా ప్రబంధక్ కమిటీ అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చేసి రాజకీయాలలోకి దూకారు.

ఈయనకి ప్రతాప్‌సింగ్ కయిరాన్‌కి పడేది కాదు. కొంతకాలం పాటు పోట్లాడి చివరికి మాస్టర్ తారాసింగ్, ప్రభుత్వంవారు ఒక విచారణ సంఘం నియమిస్తే చాలునని, తన ఉద్యమాన్ని విరమించుకున్నారు.

విచారణ సంఘంలో సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తి దాస్, బొంబాయిలో ప్రధాన న్యాయమూర్తిగా ఉన్న డాక్టర్ సి.పి. రామస్వామి అయ్యర్ సభ్యులు. వీరు తమ నివేదికలో సిక్కులు వివక్షకి గురికావటం లేదని తేల్చారు.



శ్రీ లోంగోవాల్

మాస్టర్ తారాసింగ్ ఉద్యమం రెండు ఉద్యమాలు విఫలం కావటంతో ఆయన అనుచరులే ఆయనకి ఎదురు తిరిగి ఆయనని తొలగించారు. సంత్ ఫతేసింగ్ ఆయన స్థానం లోకి వచ్చారు.

1962 ఎన్నికలలో ఫలితాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

| పార్టీ | గెలిచిన స్థానాలు | పడిన(లక్షల) వోట్లు | వోట్లశాతం |
|---|---|---|---|
| కాంగ్రెసు | 90 | 29.44 | 43.8 |
| అకాలీదళ్ | 19 | 7.90 | 11.7 |
| క. పా. | 09 | 4.94 | 07.3 |
| జ. సం. | 08 | 6.94 | 09.5 |
| ఇతరులు | 28 | 18.6 | 27.7 |
| మొత్తం | 154 | 672.70 | 100.0 |

ఇవి రాష్ట్రం మొత్తంమీద ఫలితాలు. పంజాబులో రెండు ప్రాంతాలు ఉన్నాయి. పంజాబీ, హిందీ. వాటిలో కాంగ్రెసు, జనసంఘం అకాలీదళ్ బలాలు ఈ విధంగా ఉన్నాయి:

| | పంజాబీ ప్రాంతం | | | హిందీ ప్రాంతం | | |
|---|---|---|---|---|---|---|
| | స్థానాలు | వోట్లు | శాతం | స్థానాలు | వోట్లు | శాతం |
| కాంగ్రెసు | 51 | 18.10 | 45.8 | 39 | 11.36 | 40.9 |
| అకాలీలు | 19 | 07.80 | 19.8 | – | 00.10 | 00.4 |
| జ. సం. | 04 | 03.00 | 07.7 | 4 | 03.37 | 12.1 |



శ్రీ తోహ్రా

ఈ లెక్కలని బట్టి అకాలీల బలం యొక్క లోతు ఎంత ఉందో గ్రహించవచ్చు.

గురుద్వారా ఎన్నికలలో మాస్టర్ తారాసింగ్, సంత్ ఫతేసింగ్‌ల మధ్య పోటీ తీవ్రం అవుతూ వచ్చింది. వీటిలో చివరికి మాస్టర్ తారాసింగే అపజయం పొందారు.

1965లో భారతదేశం, పాకిస్తాన్ యుద్ధం చెలరేగింది. అది ముగిసిన తరువాత పంజాబు సమస్య పరిశీలన మొదలు పెట్టారు. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీయుతులు యశ్వంత్‌రావు చవాన్, మహావీర త్యాగీలు.

ఏవేవో వాగ్వివాదాలు చెలరేగాయి కాని 9–3–1966 నాడు కాంగ్రెసు అధిష్ఠాన వర్గం వారు "పంజాబీ సుబా" ఏర్పాటు చెయ్యాలని నిర్ణయించారు.

పంజాబు, హర్యానా రాష్ట్రాలు 1–11–1961 నాడు అవతరించాయి, వాటి రెంటికీ ఆధునిక నగరం చండీఘర్ రాజధానిగా ఉండి పోయింది.

1967 ఎన్నికలు జరిగాయి. అప్పటికి ప్రతాప్‌సింగ్ కయిరాన్ లేరు. అకాలీదళ్‌లో పోటీ మాస్టర్ తారాసింగ్, సంత్‌ఫతే సింగ్‌ల మధ్య కొనసాగుతూనే వచ్చింది. రెండు అకాలీదళాలు పోటీ చేశాయి. ఎన్నికల ఫలితాలు ఇవి:

| పార్టీ | స్థానాలు | వోట్లశాతం |
|---|---|---|
| కాంగ్రెసు | 48 | 37.4 |
| అకాలీ (సంత్) | 24 | 20.5 |
| అకాలీ (మాస్టర్) | 02 | 04.5 |
| జ. సం. | 09 | 09.4 |
| క. పా. | 05 | 04.4 |
| క. పా. (మా) | 03 | 03.3 |
| ఇతరులు | 13 | 23.1 |
| మొత్తం | 104 | 100 |



శ్రీ వాజపేయి

53 మంది సభ్యులుకల ఈ ఐ. సం. 17 మందికి మంత్రివర్గంలో స్థానాలు ఇచ్చింది. పార్టీ మార్పిడుల ద్వారా ఐ. సం. బలం 53 నుంచి 60కి పెరిగింది.

ఇది ఎంతోకాలం నిలవలేదు.

అకాలీల మధ్య పేచీలు ప్రభుత్వం పతనానికి దారితీశాయి. కాంగ్రెసు వారి మద్దతుతో శ్రీ గిల్ యొక్క చీలిక అకాలీ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకుంది.

1967 నవంబరులో మాస్టర్ తారాసింగ్ మరణించారు.

అకాలీలూ, జనసంఘం వారు కలిసి పని చెయ్యటం ప్రారంభించారు.

మధ్యంతరంగా ఎన్నికలు జరిగాయి (1969 మే నెలలో) వాటి ఫలితాలు ఈ కింద చూపబడిన విధంగా ఉన్నాయి.



శ్రీ బాదల్

| పార్టీ | స్థానాలు | లక్షల వోట్లు | వోట్ల శాతం |
|---|---|---|---|
| కాంగ్రెసు | 38 | 18. 35 | 39. 3 |
| అకాలీ | 43 | 13. 82 | 29. 6 |
| క. పా | 03 | 2. 11 | 04. 5 |
| క. పా. (మా) | 02 | 1. 44 | 03. 1 |
| జ. సం | 08 | 4. 12 | 08. 8 |
| ఇతరులు | 09 | 6.86 | 14.7 |

మాస్టర్ తారాసింగ్ వర్గం బలహీనం అయినట్లు తేలిపోయింది.

కాంగ్రెసువారు ప్రభుత్వాన్ని ఏర్పరచలేమని అన్నారు.

ఇతర పార్టీలు కలిసి ఐక్య సంఘటన లేదా మిశ్రమ ప్రభుత్వాన్ని నిర్మించుకున్నారు.

ఇందులో అకాలీదళ్, జనసంఘం, కమ్యూనిస్టు పార్టీలూ ఉన్నాయి.

ఇంతదాకా ఇచ్చిన లెక్కలనిబట్టి ఒక పరిణామాన్ని గమనించవచ్చు. అకాలీదళ్ ఎప్పుడూ కాంగ్రెసు కన్నా తక్కువ వోటులే తెచ్చుకున్నప్పటికీ క్రమంగా ఆ పార్టీ బలం పెరుగుతూ వచ్చింది.

పెరుగుతూ వచ్చింది కాని చీలికలు కూడా పెరిగాయి, అకాలీలలో మతాభిమానం అధికంగా కలవారిదే పయి చెయ్యిగా ఉండటం మొదలు పెట్టింది.

అకాలీలూ, జన సంఘం వారూ కలిసి శ్రీ గుర్నామ్‌సింగ్ న్యాయకత్వం కింద మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసుకో గలిగారు. అయితే, ఈ మంత్రి వర్గం పడిపోయి శ్రీ ప్రకాష్‌సింగ్ బాదల్ ముఖ్యమంత్రి అయ్యారు. జన సంఘం వారు కూడా అకాలీలతో పేచీలు పెట్టుకున్నారు. శ్రీ బాదల్ మంత్రివర్గం పడిపోయేదేకానీ కాంగ్రెసు వారే దానిని రక్షించారు.

శ్రీ బాదల్ తమ వైఖరిని మార్చుకున్నారు కాంగ్రెసుతో పొత్తు మంచిదని అనటం ప్రారంభించారు.

1971 లోకసభ ఎన్నికలలో అకాలీలు బాగా అపజయాలు పొందారు.

1971 జూన్ నెలలో రాష్ట్రపతి పంజాబు శాసనసభని రద్దు చేశారు. [ఇంకా ఉంది]

— సూరి

# న్యూఢిల్లీ లేఖ.....

( 5 వపేజీ తరువాయి)

రాజకీయంగా సంఘటితమైన యూరోపుకు అంకురార్పణ చేశారు. భాషా పరమైన, తదితర భేదాలు ఏవో అప్పుడప్పుడు తల ఎత్తినా భారత జాతి ఒకటిగా ఎలా ఉన్నదో అలాగే యూరోప్ కూడా క్రమక్రమంగా ఒకే జాతిగా ఉండవచ్చు. ఆ భావన యూరోపును అవాళ్టి స్థితికి తీసుకురాగలిగింది. అమెరికా,రష్యాలతో సమానంగా కాకపోయినా దాదాపుగా శక్తివంతంగా రూపొందగలిగింది. ఇదంతా 40 సంవత్సరాల తక్కువ వ్యవధిలోనే సాధించబడింది.

ఇప్పుడు ఆంగ్లేయుడెవరైనా పర్మిట్ లేకుండానే ఫ్రాన్స్‌లో పని చెయ్యవచ్చు. అలాగే ఇటాలియను ఎవరైనా జర్మనీలో కానీ, నెదర్లాండ్స్‌లో గాని పని చేసే వీలు ఉంది. వాళ్ళకి నచ్చినప్పుడు తనిఖీ కూడా ఉండదు. సగం ఇంగ్లీషు సగం ఫ్రెంచి కలిపి మాట్లాడతారు. ఆ విధంగా వారంతా యూరోపియన్‌లుగానే కనబడతారు. మనకి ఇక్కడ హిందీ తప్పించి ఏ జాతీయ భాషా లేనట్లే అక్కడ యూరోపియన భాష అంటూ ఏదీ లేదు. కానీ భారతీయులని ఏదైతే సంఘటితంగా ఉంచగలుగుతున్నదో అదే యూరోపియనులని కూడా ఐక్యంగా ఉంచగలుగుతున్నది. పురాతన సంస్కృతికి సంబంధించిన వాసనలు ఇంకా అందరికీ ఉండటం చేతనే అది జరుగుతున్నది. అదే క్రైస్తవ మత సంప్రదాయాల విలువలపై ఆధారపడిన సంస్కృతి. అదే,మన హిందూ సంస్కృతి రాగ్యవారిని కూడా సంఘటితం చేసింది. దాని ఆత్మ వారిని ఒక త్రాటి మీద నడిపిస్తున్నది. యూరోపియన్ జాతికి మూలం మత సంబంధమైనదనుకుంటాను. అందువల్లనే తురుష్కులు, అల్జీరియనులు అక్కడ అక్కడ శతాబ్దాలుగా ఉంటున్నా వారి పరిస్థితి ఇంకా పొరుగున వచ్చి చేరినవాళ్ళలాగే ఉన్నది. జాతి జీవన విధానానికి కేవలంగా మతం పని చేస్తుందే తప్ప సంకుచితమైన ప్రయోజనం కోసం కాదు. ఈ వాస్తవాన్ని వారు విస్మరించకపోవడం వల్లనే యూరోపు అభివృద్ధి చెందింది. మనం మతరహిత విధానం అనే ఊహలో పడిపోయి ఆ సత్యాన్ని విస్మరిస్తున్నాము. మనకి మనమే శత్రువులుగా తయారవడానికి కారణం కూడా అదే. □




"నాకు ఇంచుమించుగా
ఆడది కోరుకునేవన్నీ ఉన్నాయి.
అయితేనేం, అడక్కుండానే
మరింత దొరుకుతోందంటే
ఎందుకు కాదనాలి?"

## 'మోర్' డిటర్జెంట్ సబ్బు

'మోర్' కొనండి మీ రూపాయికి మరింత విలువ రాబట్టండి.

మరింత తెలుపు. మరింత మెరుపు.
మీ రూపాయికి మరింత తెలుపు చేసే శక్తి.

'మోర్' ధర మరే మంచి డిటర్జెంట్
సబ్బుకన్న కొద్దిగానే ఎక్కువ. అయితేనేం,
ఇది సైజులో రెండింతలు పెద్దది
దీంతో మరి రెండింతలు బట్టలు
ఉతికే వీలు వుంది!

**రెట్టింపు సైజు: అయినా ధర కేవలం**
**రూ.3.25 పైసలే (పన్నులు అదనం)**

Trikaya BL 2 SS TEL

# వ్యక్తిగతం

అకాలీ మితవాద నాయకుడిగా చెప్పబడుతున్న సంత్ హర్ చంద్ సింగ్ లోంగోవాల్ ఇటీవల తమ అధ్యక్ష పదవికి రాజీనామా చేశారన్న వార్తలు వచ్చాయి అకాలీదళ్‌లో తలఎత్తిన తీవ్రమైన పేచీల కారణంగానే ఆయన తమ పదవికి రాజీనామా చేశారని అన్నారు తీవ్రవాదులు తమ నాయకుడిగా కీ శే బింద్రన్‌వాలె తండ్రి, ఎనభై ఏళ్ళు దాటిన వృద్ధుడు అయిన శ్రీ జోగీందర్ సింగ్‌ని నిలబెట్టే ప్రయత్నం చేశారు కానీ శ్రీ లోంగోవాల్ కాస్త తెలివిగా వ్యవహరించి ఆయన ధాటిని నిరోధించారనే చెప్పవచ్చు ఇటీవల జరిగిన సమావేశంలో జిల్లాల అధ్యక్షులు, ఇతర ప్రాంతాల అకాలీదళ్ విభాగాల అధ్యక్షులు సంత్ లోంగోవాల్ నాయకత్వాన్ని వాంఛిస్తూ తీర్మానించారు ఆయన తమ రాజీనామాని ఉపసంహరించుకోవాలని పట్టుబట్టారు వారి కోరికని మన్నించగలమని శ్రీ లోంగోవాల్ అన్నారు శ్రీ తోహ్రా, శ్రీ బాదల్‌లని కూడా తమ పదవులకి రాజీనామా చెయ్యవద్దని వారు కోరారట □



మార్లిన్ చారెల్ (40) అసలు పేరు ఏంజెలా మైట్స్ పశ్చిమ జర్మనీలోని హాంబర్గ్ పరిసర ప్రాంతానికి చెందిన ఈమె పొడుగాటి తన కాళ్ల ద్వారా బాగా పేరు పొందింది ఈమె తండ్రి మొదట ప్రభుత్వోద్యోగి అయినా తర్వాత దానిని వదిలిపెట్టి సర్కస్ కంపెనీలో చేరి కుమార్తెతో పాటు పారిస్,కెయిరో,హాంబర్గ్ బీరుట్ మొదలైన ప్రాంతాలు పర్యటించాడు అప్పుడే ఈమె నృత్య జీవితానికి నాంది పలికింది తర్వాత అంతర్జాతీయ నటి అయిందీమె ఈమె స్టేజీమీద పాటపాడుతూచేసే 'లిడో' నృత్యం పారిస్‌లో ఎన్నో సంవత్సరాలపాటు ప్రత్యేక ఆకర్షణగా ఉండేది ఇప్పుడీమె తన భర్త, కుమార్తెతో నైస్ అనే చోట నివసిస్తున్నది ప్రస్తుతం నృత్యాలలో అంతగా పాల్గొనడం లేదు కానీ ఆమె మరో విచిత్రమైన విషయాన్ని వెల్లడించింది ఈ 'పొడుగు కాళ్ల సుందరి' తాను రూప కల్పనచేసి తయారు చేసిన పొడుగాటి కాడలు గల అందమైన గాజు గ్లాసులని ప్రదర్శించింది □

# వారఫలం

## 21-6-1985 శుక్రవారం మొదలు
## 27-6-1985 గురువారం వరకు

★ **మేషం :** అయినదేదో అయింది. అలస్యం చేయకుండా వ్యాపారం చేయండి క్రయ విక్రయాలలో మెలకువ ప్రదర్శించుట అవసరం. అయినదానికి కాని దానికి వేదన పడరాదు ధనాదాయంలో స్వల్ప మార్పుంటుంది స్త్రీలకు. ధనలబ్ధి, వృత్తియందభివృద్ధి, ఆరోగ్యాభివృద్ధి

★ **వృషభం :** నూతనాంశాలు గ్రహిస్తారు నూతన మిత్రుల కలిసికొనే అగత్యం కూడా ఏర్పడుతుంది ఏదో మేలు వారివలన పొందనున్నారు మిత్రుల్లో ఒకానొకరిని గూర్చి ఆవేదనకరమైన వార్త వింటారు స్త్రీలకు నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి అమూల్య వస్తుసేకరణ కవకాశం కూడ గలదు

★ **మిథునం :** నూతన వ్యాపారానికి కొందరు గావించే యత్నాలు సానుకూలమవుతాయి కృషికి తగిన ఫలితం పొందనున్నారు ఎంతో కాలంగా చేతికందవలసిన ద్రవ్యం అందుతుంది కుటుంబ కలతకు ఆస్కారమున్నది, జాగ్రత్త!స్త్రీలకు సంప గౌరవం, ఆనందం, అధికాదాయం

★ **కర్కాటకం :** ఏ విషయంలో ఎలా ప్రవర్తించాలో తెలిసి మెలగండి ఆదాయమందభివృద్ధి లేకున్నా అవసరాలు తీరేటంత మాత్రమైనా అందుతుంది పరాయివారికి సాయం చేయటం మేలేగాని సొంత పనులు కట్టిపెట్టి యత్నించటం మేలుగాదుగా! స్త్రీలకు: కళా సాహితీ రంగానుభవం గలవారికి అవకాశాలుంటాయి

★ **సింహం :** వారమంతా మీకు ఉపయోగదాయకమే వైజ్ఞానికంగా బాగా మేలు కనిపిస్తుంది కళారంగాన ప్రతిభ యినుమడించుటకు యిదే సమయం. స్త్రీలకు : నూతన మిత్రగోష్ఠి. ఆరోగ్యమందభివృద్ధి.

★ **కన్య :** ఈ వారం మీ స్థితియందు అంతో యింతో మెరుగు కనిపిస్తుంది. మాటకు విలువ పెరుగుతుంది పదిమందిలో వ్యవహారరీత్యా 'సెబాస్' అనిపించుకొంటారు. వృత్తియందు ప్రగతి ఏర్పడుతుంది. స్త్రీలకు : ఆశించినంతటి ప్రయోజనం కనిపించక పోయినా అవసరాలకు యిబ్బందిలేదు

★ **తుల :** నూతనాంశాలు గ్రహించగలవారం, అవి ధనదాయకాలు కాగలవు మాట మంచితనంతో కొన్ని వ్యవహారాలు సవరించుకొంటారు కళాప్రావీణ్యత గలవారికి మంచి సమయం స్త్రీలకు వస్తుసేకరణకు అనుకూలదినం, ఇష్టసిద్ధి

★ **వృశ్చికం :** మాటలతోనే మన్నన లందగలిగేది ధనాదాయానికి మాటలే కారణాలు, వృత్తియందు అధికాదాయానికి అనుకూలం. మీరా ఉద్యోగరీత్యా గావించిన యత్నాలు సుముఖంగా నెరవేరగలవని తాత్పర్యం స్త్రీలకు ఏనాడో రావలసిన 'ప్రమోషన్' ఈనాడో ఈ వారమో లభ్యం కాగలదు

★ **ధనుస్సు :** శుక్రవారం మీరు యత్నించి నెరవేర్చుకోవాలని వ్యవహారాలుండవు ఉద్యోగ యత్నాలు కూడ అనుకూలదాయకం కాగలవు ఏమయినా అప్రయత్న లాభం చేకూరగలదని కూడ చెప్పవచ్చు స్త్రీలకు శుభ కార్యానుకూలత, ద్రవ్యాదాయం గలవారం

★ **మకరం :** అధికారమందు మీకు అభివృద్ధి, వృత్తియందు సదవకాశం. ఆరోగ్యమందు కించిత్తు వృద్ధి, దీర్ఘ వ్యాధులతో సతమతమయ్యే వారికి కొంత హాయి చిక్కుటయందు ఆక్షేపణలేదు స్త్రీలకు : ఎంతో కాలంగా అందని వర్తమానం అందటం, చిన్న ఉద్యోగమందున్న వారికి కొంత అనుకూలం

★ **కుంభం :** శ్రద్ధా సక్తులతో మీ కార్యాలు చక్కబెట్టుకోవాలి ఒక వైపు సహాయం చేసేవారిలాగు కనిపిస్తూ అపకారం చేసేవారిని గమనించాలి సుఖశాంతులు, కుటుంబానందానికి అవకాశముంటుంది. గ్రహించండి. చుట్టుప్రక్క గొడవలను గమనించి మెలగటం శ్రేయం. స్త్రీలకు : అపనిందలు కొందరకు, మనశ్శాంతి లోపించుట కొందరకు చెప్పదగిన వారం.

★ **మీనం :** సులభంగా ఒకానొక వ్యవహారం సానుకూలం కాగలదు. ఒకటి రెండు ఉద్యోగాలకై యత్నించారుగా! శ్రమ మాత్రమే మిగులుతుందని, భవిష్యత్తులో తప్పక మేలున్నదని, సాటివారికన్నా మిన్నగా వ్యాపారం. జరుపుకో గలుగుతారని గ్రహించాలి. స్త్రీలకు : అన్ని విధాలా, అన్ని రంగాలలో అవకాశాలు, పెద్దల, ధనవంతుల, ప్రభుత్వాదరణకు అవకాశం గల వారంగా గ్రహించాలి.

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి

# అమిత తెలుపు - అత్యంత పొదుపు

# చెక్

## డిటర్జెంట్ సబ్బు




ACIL 0727 84 Tel

షా వాలెస్
వారి హామీతో







“శాస్త్రీయమైన పరిశోధనలు తెలియ
చేస్తున్నాయి సాధారణమైన సబ్బులకంటే-
చెక్‌తో రెట్టింపు బట్టలు ఎక్కువ తెల్లగా
ఉతకవచ్చునని”



“ఇది నిజమే “ఎన్నో బట్టలు” ఎంతో
శుభ్రము చెక్-నా-అమిత తెలుపు
అత్యంత పొదుపు నిచ్చే డిటర్జెంట్
సబ్బు”

## కొత్త సీరియల్ ప్రారంభం!

# సుశ్రుత నర్సింగ్ హోమ్

డాక్టర్ కె.రవీంద్రబాబు



### "మీరు ఈ హోటల్లోనే వుంటున్నారా?"

[illegible] రవి. అప్పు[illegible] తలపు[illegible] "మీరు యీ ఫ్లోర్[illegible]న్నారా! ఉదయం మీటింగ్‌లో [illegible]సు చూస్తున్నా" అన్నాడు.



"అమ్మయ్య! మీ పరధ్యాన్నపు చూపులు చూచి నన్ను గుర్తుపడ్తారో లేదో అని భయపడ్డా! నా రూమ్‌కు రండి కాఫీ తాగుదురుగాని!" అంటూ 313 రూమ్‌కు దారి తీసిందామె!

"అరె! నా రూమ్ పక్కనే వున్నారు మీరు! నిన్నటి నుండి ఆ విషయమే తెలియ లేదు! మీ పేరు ఇందువదన కదూ?"

"అవును! ఇందు అని పిలుస్తారంతా! మీ పేరు చెప్పక్కర్లేదు ప్రఖ్యాత రచయిత రవి అని తెలుస్తుంది.. మీ నవలలమీద ఫోటో చూసిన వారికెవరికైనా!"



సాయంత్రం మీటింగ్‌కు వెళ్తారా?

ఈ మూడుపూటలూ మీటింగ్‌లకు వెళ్ళి విసుగు పుట్టిపోయింది రచయితల్లో యింత వింత వ్యక్తు లుంటారని అనుకో లేదు! ఎవరికి వారు సొంత దబ్బా కొట్టుకోవడమే సరిపోయింది లేకపోతే మీటింగుకు రాని పాప్యులర్ రచయితను తూర్పార పట్టారు. అంతకుమించి నాకు యీ మహాసభకు వచ్చినందుకు ప్రయోజనం కనపడలేదు

నిర్మొహమాటంగా మాట్లాడాను క్షమించండి!

అంటూ బేరర్ తెచ్చి యిచ్చిన కాఫీ కప్పు రవి ముందు పెట్టింది

మీరు అన్నదాంట్లో నిజం లేకపోలేదు రచయితలలో ఎక్కువ మంది సమీపం నుంచి చూడటానికి వింత వ్యక్తుల్లా అగుపిస్తారు ఎక్కువ మంది ప్రతిదానికి ఆర్భాటం చేసి హైరానాపడిపోయే సున్నిత మనస్తత్వం కలిగి

వుంటారు అతి చిన్న విషయాలకు ప్రతిస్పదించే రచయిత మామూలు మనిషిలా వుండలేడని అనుకోకూడదేమో?"

నిజమేనండోయి! కాని అంత మందిని ఒక్కసారిగా చూసేసరికి నాకు ఏదో గాభరా వేసింది కాని యీ మహాసభ వలన కలిగిన సాహిత్య ప్రయోజనం ఏమిటో నాకు బోధపడకుండా వున్నది!

"ప్రత్యేకమైన సాహిత్య ప్రయోజనం ఏమీ వుండదు ఒకరి అభిప్రాయాలు మరొకరు తెలిసికోవడం, రచయితల మధ్య సాన్నిహిత్యం పెరగటం తప్ప పోనీయండి ! సాయంత్రం సెషన్‌కు వేళ అవుతున్నట్టుంది మీ సమయాన్ని వృధా చేస్తున్నానేమో? వస్తా!"

"ఆగండి రవిగారూ! నాకు మీటింగ్‌కు వెళ్ళాలని లేదు అసలే మహాసభకు ఎందుకు వచ్చానా అని బాధ పడుతున్నాను తిరిగి విజయవాడ వెళ్దామా అంటే ఎల్లుండి రాత్రి దాకా బస్సులో టికెట్లు దొరకలేదు! అప్పటివరకు ఏం చేయాలో పాలు పోకుండా వున్నది హైద్రాబాదులో నాకు తెలిసిన వాళ్ళెవరూ లేరు!

అలాగా! నిజానికి నాకూ మీటింగ్‌కు వెళ్ళాలని లేదు నా స్నేహితుడు మురళిని కల్సుకోవచ్చు అనే ఆశతో ఇక్కడకు వచ్చాను తీరా చూస్తే వాడు రానేలేదు గుంటూరు వెళదాం అంటే ఎల్లుండి రాత్రి వరకూ రైల్లో గాని









# శుశ్రుత నర్సింగ్‌హోమ్

బస్సులో గాని రిజర్వేషన్ లేదన్నారు రైల్లో వెళ్ళిపోవచ్చు గాని రద్దీలో ప్రయాణం చేసి ఇంటికి వెళ్ళేసరికి శరీరం మనసూ డస్సిపోయి వుంటాయి రేపు ఎల్లుండి విశ్రాంతిగా గడపి ఎల్లుండి రాత్రికి వెళదామనుకున్నాను '

"అలాగా! ఎల్లుండి రాత్రి గుంటూరు వెళ్ళే బస్సులోనే నాకు టికెట్ దొరికింది తిరుగు ప్రయాణం ఒకే బస్సులో చేయాలి! ప్రఖ్యాత రచయిత రవితో కలిసి ఒకే బస్సులో ప్రయాణం చేసానని చెప్పుకోవచ్చు!

"మీరంటున్నంత గొప్పవాడినేమీ గాను ఇందువదన గారూ! సారీ ఇందూగారూ! మీరు మాత్రం తక్కువ తిన్నారా! ఆంధ్రదేశంలో ప్రతి యింటా మీ పేరు మారుమోగిపోతూ వున్నది! మీటింగ్‌కు వెళ్ళటం లేదు కాబట్టి కాసేపు అలా హుసేన్‌సాగర్ వైపుగా వెళదాం? ఏమంటారు?"

"నేను అందామనుకున్న మాటే మీరూ అన్నారు! పదండి వెళదాం!"

'ఉండండి! ఇప్పుడే రూమ్‌కు వెళ్ళి వస్తా" అంటూ 314 రూమ్‌లోకి వెళ్ళి సూట్‌కేస్ నుండి పర్స్ తీసికొని జేబులో పెట్టుకుని తిరిగి వచ్చాడురవి

అదేమిటండోయ్! వంటరిగా వొచ్చారే? రూమ్‌కు వెళతానంటే మీ శ్రీమతిని కూడా తీసుకు వస్తారనుకున్నాను!"

"భలే వారండీ! కూడా తీసుకు రావటానికి 'శ్రీమతి' ఏమైనా సూట్‌కేస్‌లో పట్టే వస్తువా?

'ఆ! అంటే మీకింకా వివాహం కాలేదా? సంసార జీవితంలోని మధురిమలు చక్కగా చిత్రించే మీ నవలలు చదివి మీరు వివాహితులనుకున్నాను!"

సమాధానంగా చిరునవ్వు నవ్వుతూ "అందరూ అలాగే అనుకుంటారు రచయిత తన నవలల్లో వ్రాసిన విషయాలన్నీ అతని స్వానుభవాలు అనుకుంటే పొరపాటు రచయితది కాదు"

హుసేన్‌సాగర్ టాంక్‌బండ్ మీద చల్లగాలికి కబుర్లు చెప్పుకుంటూ గడిపిన రవి, ఇందు ఆ తర్వాత సాలార్‌జంగ్ మ్యూజియం, గోల్కొండ ఫోర్టు, చార్‌మినార్, పబ్లిక్‌గార్డెన్స్ చూస్తూ రెండు రోజులు గడిపి ఒకే బస్సులో తిరుగు ప్రయాణం చేసారు బస్సు విజయవాడలో ఆగగానే రవి-

"ఇందూ, ఇదిగో నా కార్డు! మీరు యీ ఆదివారం గుంటూరు వచ్చి నా ఆతిధ్యం స్వీకరిస్తే సంతోషిస్తాను అన్నాడు

అలాగే! మీకు వీలు కలిగినప్పుడు విజయవాడ వచ్చి నాచేతి వంట రుచి చూడాలని నా కోరిక అంటూ తన అడ్రెస్ కాయితం మీద వ్రాసి యిచ్చింది ఇందు

రెండు రోజుల క్రితం రవి ఎవరు అంటే వొక మంచి రచయిత అని జవాబు చెప్పి వుండేది ఈ నిముషాన రవి ఎవరు అని ఎవరయినా అడిగితే జవాబు చెప్పటానికి ఇందు మనసు తడబాటు పడిపోతుంది ఈ రెండు రోజుల సాన్నిహిత్యం ఇద్దరినీ ఆత్మీయులుగా మార్చి వేసింది ఒకే అభిరుచి గల రెండు యువ హృదయాలు దగ్గరవటానికి ఎంతో కాలం-అవసరం లేదన్న విషయం అనుభవ పూర్వకంగా తెలుసుకున్నది ఇందు

లబ్బీపేటలో తమ యింటి ముందు రిక్షా దిగి సూట్‌కేస్ చేతబుచ్చుకుని లోపలకు వెళుతూ అప్రయత్నంగా అరచేతిలో వున్న కార్డు వంక చూచిందామె డా రవి యంయస్ శుశ్రుత నర్సింగ్‌హోమ్ బ్రాడీపేట – గుంటూరు అని వుంది కార్డు మీద!

అప్పటివరకు రవి వొక ప్రఖ్యాత రచయిత అని మాత్రమే తెలుసామెకు! ఆయన సర్జన్ అని, నర్సింగ్‌హోమ్ నడుపుతున్నాడని తెలియగానే క్షణం సేపు ఆశ్చర్యపోయింది! రవి నవల లన్నింటిని చదివి వుందామె ఎక్కడా రచయిత పరిచయంలో ఆయన సర్జన్ అని వ్రాయలేదు రెండు రోజుల పాటు హైద్రాబాద్ అంతా తిరిగి అరమరిక లేకుండా ఎన్నో విషయాలు చర్చించుకుని, ఎంతో సన్నిహితులమయాము అని అనుకుంటూ ఇప్పుడు అకస్మికంగా రవి సర్జను అని తెలిసికోగానే ఆమె మనసులో ఏదో బెరుకు క్షణకాలం కదులాడింది

ఇందు కాలేజీలో చదివేప్పుడే రచనలు చేసింది ఆమె రచనలు చదివి స్నేహం చేయాలని వచ్చిన విద్యార్థులు ఎందరో వుండేవారు నిజానికి గర్ల్స్ స్టూడెంట్సులో ఏ వరకూ అంతమంది స్నేహితులుండే వారు కారు! యం ఏ అవగానే విజయవాడ కాలేజిలో లెక్చరర్‌గా వుద్యోగం వచ్చింది లబ్బీపేటలో యిల్లు తీసుకొని కాలేజీకి వెళ్ళి వస్తున్నది ఒక రచయిత్రిగా ఆమె స్నేహం కోరి వచ్చే లెక్చరర్లు, స్టూడెంట్సు, ఇతరులు అనేకమంది వున్నారు కాని రవితో మాట్లాడేటప్పుడు ఆమె హృదయం పొందిన అనుభూతి మరెవరితో మాట్లాడేటప్పుడూ పొందలేదు!

తన రచనలలో ఎన్నో ప్రణయ సన్నివేశాలను చిత్రించిన ఇందు తన దాకా వచ్చేసరికి తబ్బిబ్బు పడిపోసాగింది! రవి గురించి తన మనసులో చెలరేగే ఆలోచనలను ఆమె ఏమాత్రమూ అదుపు చేయలేకుండా వున్నది ఆమె ఎంత ప్రయత్నం చేస్తే అవి అంతగా విజృంభించి ఆమెను ముంచెత్తుతున్నవి "నేను రవిని ప్రేమిస్తున్నానా? అని తనను తాను ప్రశ్నించుకుంటే ఆమెకు సూటిగా సమాధానం రావడంలేదు

'ఎందుకు ప్రేమించరాదు?" అని మరొక ప్రశ్న ఎదురవుతున్నది తను ప్రేమించబడే వ్యక్తికి ఏ అర్హతలు కావాలని ఇన్నాళ్ళు అనుకుంటూ వుందో అవన్నీ రవిలో కనపడ్డాయామెకు. అంతకు మించి మరెన్నో లక్షణాలు వున్నాయి అతనిలో! రచయితగా అతను తనకంటే లబ్ధ ప్రతిష్టుడు వ్యక్తిగా వున్నత భావాలు, ఆదర్శాలు కలవాడు భావ ప్రకంపనలకు స్పందించే సున్నితమైన హృదయం కలవాడు! తన అనుభవంలో ఆమెకు ఎంతో మంది రచయితలు వ్యక్తిగతంగా తెలుసు చాలామంది రచయితలు తమ రచనలలో వ్యక్తం చేసే మహోన్నత భావాలకు తగినట్లు ప్రవర్తించరు రచనలు వేరు వ్యక్తులు వేరు

# దావణగెరే

## ఫ్యాషన్ వస్త్రములు



స్టార్ లైట్ టైరీన్* కాటన్ ఫ్యాబ్రిక్స్‌లో
స్టైలుగా మరియు సుఖముగా ఉండండి.

ది దావణగెరే కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగెరే 577 002.

షోరూములు :
కావేరి భవన్, బెంగుళూరు-560 009.
దాజీబాన్ పేట్, హుబ్లి-580 020.
చిత్రదుర్గ రోడ్, దావణగెరే-577 002.

*టెరీన్ — [illegible] రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు
THOMAS/8402-B/TEL

# శుశ్రుత నర్సింగ్‌హోమ్

అన్నట్టు ప్రవర్తిస్తారు వారు! అంతేకాదు కొంతమంది రచయితలు లోకంలో ఉండే చెడు అలవాట్లన్నిటికీ బానిసలై చాలా అల్ప వ్యక్తులలా ప్రవర్తిస్తారు అన్నీ చవిచూస్తేగాని మంచి రచనలు వ్రాయలేం! అనే వారి నడవడి ఆమెలో ఏవగింపు కలిగించేది! కాని రవి విషయంలో మాత్రం ఇందుకు భిన్నంగా వున్నదని గమనించిందామె రెండు రోజులలో ఏ వ్యక్తినీ పూర్తిగా అర్థం చేసుకోలేని మాట నిజమే గాని ఎందుకనో రవి రచనలలో వ్యక్తం చేసిన భావాలకంటే వ్యక్తిగతంగా అతనెంతో వున్నతుడు అనే భావం ఆమె మనసులో బలపడ సాగింది

ఒక రచయితగా అతనంటే తన మనసులో అదివరకే వున్న గౌరవ భావానికి, వ్యక్తిగా అతనంటే కలిగిన సద్భావం, తన భావాలను సరిగా అర్థం చేసికోగల సున్నిత సంస్కార హృదయుడిగా అతనంటే స్నేహ భావం తోడయి వొక అనిర్వచనీయమైన భావపరంపరను ఆమె మనసులో రగిలించింది

'ప్రేమంటే ఇదేనా?' 'ఏమో?' ఆమె మనసు సమాధానం దొరకని ప్రశ్నలతో నిండిపోయింది!

ముందు గది తాళం తీసుకుని లోపల అడుగుపెట్టింది ఇందు నాలుగు రోజులుగా పేరుకుపోయిన దుమ్ము ధూళితోపాటు పోస్ట్‌మాన్ పడవేసిన వుత్తరాలు కూడా ఎదురయ్యాయి చంద్రహాస్ దస్తూరి వున్న కవరు చించి చదువసాగింది

ఇందూ,

కడుపు నొప్పి బాధ భరించలేక డాక్టర్ రవిగారి నర్సింగ్‌హోమ్‌లో జేరాను వాంతులవుతున్నాయి వాటి వెంట రక్తం పడింది డాక్టరు గారు రక్తం ఎక్కించారు వారం రోజులు మిల్క్ డ్రిప్ పెడ్తారు మందులు వాడుతున్నారు బహుశ ఆపరేషన్ చేస్తారేమో? ఏమైనా నాకు కొంతకాలం నర్సింగ్‌హోమ్ నివాసం తప్పదు

కడుపునొప్పి ఎక్కువై నీరసంగా పడిపోయినప్పుడు నాకు నువ్వే గుర్తొచ్చావు! ఆపత్కాలంలో ఆత్మీయులు గుర్తొస్తారంటారు! కొంచెం వోపికగానే యీ ఉత్తరం వ్రాస్తున్నాను

డాక్టర్ రవిగారి శుశ్రుత నర్సింగ్‌హోమ్ (బ్రాడీపేట)లో వున్నది

నీ
చంద్రహాస్

చంద్రకు ప్రమాదమైన జబ్బు చేసింది లేకపోతే తనకలా వుత్తరం వ్రాయడు! పాపం చంద్ర! అతనితో తనకు పరిచయమైన తీరు తలచుకుంటే ఇందుకు నవ్వు వచ్చింది

చంద్ర తను బి ఏ లో క్లాస్‌మేట్సు తను కాలేజీలో అడుగు పెట్టిన దగ్గర్నుండి అతని రెండు కళ్ళూ గుచ్చి గుచ్చి తనవంక చూస్తుండేవి సన్నగా విజిల్‌వేస్తూ చెడు అర్థం వచ్చే మాటలు తనవంక రువ్వుతూ చూపులతో తన్ను వెన్నాడే చంద్ర అంటే తనకెందుకో మొదటి నుండి కోపంకంటే జాలికలిగేది నిజానికి చంద్ర అతని స్నేహితులు మరికొందరు ఆడపిల్లలను నఖశిఖ పర్యంతం చూడటానికి, అప్రయత్నంగా అశ్లీల పదాలు వారిపై రువ్వడానికి, కాలేజీ వదిలాక వారి వెంటపడి వేధించటానికి అలవాటు పడిపోయారు వాళ్ళు కాలేజీలో చేరింది చదువుకోటానికా లేక ఇల్లా ఆడపిల్లల వెంటపడి అల్లరి చేయటానికా అని కూడా అనుకొనేది తను

వళ్ళు కనపడే దుస్తులు వేసుకుని వయ్యారంగా వచ్చే అమ్మాయిలను చూచి వారు వికారపు చేష్టలు చేస్తే కొంత అర్థం వున్నది కాని బుద్ధిగా చదువుకునే అమ్మాయిలను వేధించే వారిని చూస్తే జుగుప్స కలిగేది

నిజానికి తన దుస్తులలోగాని, ప్రవర్తనలోగాని వారిని కవ్వించే విధంగా కనబడుతున్నానా అని తనను తాను ప్రశ్నించుకుంది ఇందు తను ఏ విధంగాను వారిని ఆకర్షించటానికి ప్రయత్నించడంలేదు లోపం తనదికాదు! అందుకే అతను ఎన్ని పైత్యప్రకోపపు పనులు చేసినా లక్ష్యపెట్టక వూరుకున్నది

ఒక రోజు ఆలస్యమైనదని కాలేజికి హడావిడిగా నడిచి వస్తున్నది గేటుదాటగానే బాణంలా రివ్వున దూసుకువచ్చి కవరొకటి తన చేతిలో పుస్తకాల మీదుంచి వెళ్ళిపోయాడు చంద్ర క్లాసుకు వెళ్ళే హడావిడిలో కవరు విషయం పట్టించుకోలేదు బెంచి మీద తన పుస్తకాల మధ్య వున్న కవరును బయటకులాగి చదివింది కొంటె కోణంగి మణి అంతే! ఆ వుత్తరం ఆ చేత ఆ చేతపడి క్లాసంతా సర్క్యులేట్ అయింది ఇంటర్వల్‌లో ఆ వుత్తరంలోని విషయం బ్లాక్‌బోర్డ్ మీదకెక్కింది అబ్బాయిలు, మణి నాయకత్వంలో అమ్మాయిలలో కొంతమంది గంగవెర్రులెత్తినట్టు ప్రవర్తించసాగారు తర్వాత క్లాసులో పాఠం వినలేదెవరూ! ఎవరెస్టు శిఖరాన్నధిరోహించినట్టు విజయగర్వంతో చంద్ర ముఖం వెలిగిపోయింది

హృదయేందిరా,

నాలుగు నెలలుగా నీ నామమే జపిస్తూ నీ రూపమే తలచుకుంటూ, నీ విషయమే ఆలోచిస్తూ పిచ్చివాడినయి పోయాను పుణ్యకాలంలో అయితే నా 'తపస్సు' సిద్ధించి యీపాటికి నేను కోరుకున్నదేదో నాకు లభ్యమై వుండేది

ఈ మాడరన్ కలి కాలంలో కష్టం ఎక్కువ ఫలితం తక్కువ! నీకోసమై తపించి పోతున్న నీ భక్తుడిని కనికరించాలంటే ఆకుపచ్చ జార్జెట్ చీరకట్టుకుని, తలలో గులాబి తురుముకుని ఈ రోజు సాయంత్రం అయిదింటికి మా రూమ్‌కు రావాలి

అప్పుడు ఎందుకులే!

వుంటా,
ఎవరో నీకు తెలుసు

నాలుగున్నరకు కాలేజి అవగానే స్నేహితురాలు చంప నడిగింది "చంద్రహాస్ రూమ్ ఎక్కడే? అని

'ఎందుకు? కొంపతీసి అతని రూమ్‌కు వెళ్ళవుగదా! రేపీపాటికి కాలేజి గోడలన్నీ కరాబయి పోతాయి!

"చూస్తూ వుండు!" అంటూనే ఇంటికి వెళ్ళింది ఇందు సరిగా అయిదు గంటలకు చంద్రహాస్ రూమ్ ముందు రిక్షా ఆగింది అందులోంచి ఆకుపచ్చ జార్జెట్ చీరకట్టుకుని, తలలో గులాబి తురుముకొని నవ్వు ముఖంతో దిగింది ఇందు!

మధ్యాన్నం జరిగిన విషయం కాలేజి అంతా తెలిసిపోవడంతో చుట్టు పక్కల రూములలోని స్టూడెంట్సందరూ ఆశ్చర్యంగా గుమిగూడారు

గది మెట్లు ఎక్కి లోపలకు వచ్చి హలో చంద్రహాస్‌గారు! మీరు ఏ టైమ్‌కు ఎలా రమ్మన్నారో అలా వచ్చాను" అని నవ్వుతూ అంటున్న ఇందూను చూడగానే చంద్రహాస నిలువు నీరుగారిపోయాడు

ఉదయం ఆకతాయి తనానికి జులాయి పనిచేసాడుగాని తీరా ఇందు ఎదురుగా వచ్చి నుల్చునేసరికి తబ్బిబ్బయిపోయాడు క్షణంసేపు నివ్వెర పోయినాక అతని లోపల అణగారిపోయి వున్న సంస్కారం హెచ్చరించింది కాబోలు-

రండి! ఇందువదనగారూ! మా రూమ్‌లో కుర్చీలేదు, ట్రంకుపెట్టె మీద కూర్చోండి" అన్నాడు

అతను చెప్పినట్టు ట్రంకుపెట్టెమీద కూర్చుంది ఇంతలో ఇరుగు పొరుగు ఇళ్ళనుండి వచ్చిన అబ్బాయిలు అమ్మాయిలు ఆమె చుట్టూ గుమిగూడారు. అందులో వొక అమ్మాయి 'మీరు ప్రేమకిరణం నవలా రచయిత్రి ఇందుగదూ!" అంది

ఇందు అవునన్నట్టు తలవూపగానే సంతోషంగా వొకరి నొకరు నెట్టుకుంటూ జేరారు ముందుగా పలకరించిన అమ్మాయి "వుండండి కాఫీ తీసుకువస్తాను' అంటూ బయల్దేరింది ఆ అమ్మాయి వెంట మరి కొంతమంది

# "భగవానువాచ"

ఏల్చూరి విజయ రాఘవరావు

ఆ రోజున
ఆ వూళ్ళో
ఆలయంలో ఆరాధన
మంత్రిగారి వుద్ఘాటన.

ఆలకించిన బాల గోపాలం
ఏచ్చుల విడిగా విరగబడినా
ఊరి పెద్దలుగా వూరేగే
వుస్తాదులకే ప్రవేశం

గోవుల్లా నమ్రతతో
పూవుల దండలు పంపిన
గోముఖ వ్యాఘ్రాలెన్నో!
(కొల్లలు . కొల్లలు. కొల్లలు .!!)

తరాలుగా సమాజం
నరాలు పిండి దక్కించిన
'నల్ల' ధనం కట్టలన్నీ
నరులకంట పడకుండా
వరాలపై వరాలడిగి–
'మండీ'లో కరువైనా
'హుండీ'లో తల వాల్చాయి.

"అనుకున్న ముహూర్తానికి
ఆలస్యం జరిగిం"దని
అంగారక గ్రహంలా
అందర్నీ రుడిపిస్తూ
(ముఖ్యవక్త, దుఃఖహర్త,
మార్గదర్శి, కార్యకర్త.)
మడిగట్టిన మంత్రిగారు
మేళ తాళాదులతో
మెట్లన్నీ స్వయం ఎక్కి
మూల విరాట్ ప్రతిమమీద
బంగారు కిరీటంతో
సింగారం చేశారు.

భక్తులర్పించుకున్న
భుక్తులతో సహా, తీర్థ
ప్రసాదాలు స్వీకరించి,
వుపస్థిత మహారథులా
వూరికి చేసిన మేలును
వివరంగా శ్లాఘిస్తూ
వుపన్యాసమిచ్చారు.

గర్భ గుడి ప్రాంగణం
ఘంటారవ ప్రతిధ్వనులు
వేయి 'లైట్ల' 'ఫెళ' 'ఫెళ'లో
వెన్నెల్లా 'ధళ' 'ధళ'లు

కానీ!!
సాష్టాంగపడిన
"కార్యకర్త" గుండెల్లో
చిరకాలం పేరుకున్న
చీకటి మబ్బులు మాత్రం
తరలే సూచనలు లేవు!

మందహాస భరితమై
సుందర వదనం చెక్కిన
మూల విగ్రహం కూడా
మూగ బొమ్మలా కదలదు!

దూరంగా –
బీదవాళ్ళ
దుశ్శకునం నిరసిస్తూ
మందలుగా పయనించిన
మంత్రిగారి సిబ్బందీ

గుంపుల్లో, కదలలేక
గంపలాగ, రోడ్డుమధ్య
గుడిగోడల సరిహద్దున
కూలబడిన ముసలివాడి
చెవిలో ఎవరో (!) కవిలా
గుట్టుగ, తీయని బాసలు
'గుస' 'గుస' లాడారప్పుడు

"వెలుగులో చీకటి మోసే
వ్యక్తుల వలలోంచి దాటి,
చీకటిలో వెలుగులు వెదజల్లే
భక్తుల దేశం
రా నేస్తం, రా పోదాం,
నాతో భువి నుండి దివికి."

నేను కాపీ తెస్తాను' అంటే 'నేనుతెస్తాను' అంటూ పోటీలు పడి అవతలకు వెళ్ళారు

అప్పటికి తెప్పరిల్లిన చంద్రహాస్ పరిగెత్తుకుని వెళ్ళి ఎదురుగా వున్న కిళ్ళీషాపునుండి గోల్డ్‌స్పాట్ తెచ్చియిచ్చాడు నవ్వుతూ గోల్డ్‌స్పాట్ తాగుతున్న ఇందును చూసాక అతని మనసు కుదటపడింది

ఇంతలో బిలబిలమంటూ కాఫీ కప్పులతో ప్రత్యక్షమయారు అమ్మాయిలు

"అక్కా! కాఫీ తాగు అంటూ తొందర చేస్తున్న వారందరినీ నవ్వుతూ సమాధాన పరచింది

"నేను ఒక్కదాన్ని ఇన్ని కప్పుల కాఫీ ఎలా తాగుతాను? ఇక్కడ వున్న అన్నయ్య లందరకూ కాఫీ ఇవ్వండి అంటూ గదిలో నిలబడివున్న వారికి కాఫీ యిప్పించింది

ఇంతలో ఆటో గ్రాఫ్ పుస్తకాలు తీసుకుని ఎగబడ్డారు ఇందు చుట్టూ వోపికగా అన్ని పుస్తకాలలోను సంతకాలు పెట్టి "వస్తానండి చంద్రహాస్‌గారూ!" అంటూ రెండు చేతులు జోడించి నమస్కరించి వెళ్ళిపోబోయింది ఇందు

గదిమెట్లు దిగి బజారున నడుస్తూ వెళుతుంటే వెంబడే విషన్న వదనంతో తలదించుకు వస్తూ చంద్ర కనబడ్డాడు కుతూహలంతో చూస్తూ వుండిపోయిన ఇతర విద్యార్థులు గుడ్లప్పజెప్పి అలానే చూస్తూ వుండిపోయారు!

చంద్ర ఇందువెంట ఆమె ఇంటివరకూ నడచివచ్చాడు ఇంటికి రాగానే లోపలకు రండి అంటూ ఆహ్వానించి కాపీ కప్పు తెచ్చి అతని కిచ్చింది

చంద్ర వంచిన తల ఎత్తలేదు!

ఐయామ్ సో సారి ఇందువదనా! పొద్దున నేను చేసిన పనికి సిగ్గుపడుతున్నాను పరీక్ష ఫీజు కట్టటానికి డబ్బులేదు! ఇలా నీకు లెటరు వ్రాస్తే ఫీజు కడతానని రాకేష్ అన్నాడు అందువలన నేను అలాటి అప్రాచ్యపు పని చేయవలసి వచ్చింది" మాటలు తడబడుతుంటే చంద్ర కళ్ళనుండి నీళ్ళు కార సాగాయి

డబ్బు తెచ్చి చంద్ర చేతిలో వుంచింది ఇందు

'ఇదేమిటండోయ్?

'బహుశ ఇక రాకేష్ మీకు పరీక్ష ఫీజు కట్టడు! మీరు యీ డబ్బుతో ఫీజు చెల్లించండి మరలా మీ దగ్గర డబ్బున్నప్పుడు తెచ్చి యిద్దరుగాని అంటూ బలవంతంగా అతని చేతిలో వుంచింది

"మీరు నిజంగా !"

"నేను మీలాటి మనిషినే! అలా అని రాకేష్, మీరు, ఆడపిల్లలను అల్లరిచేసే ఇతర అబ్బాయిలు ఎందుకనుకోరు?!"

సమాధానంగా చంద్ర కనులనుండి జల జల నీరు కారింది అప్పట్నుంచీ చంద్ర ఇందుకు ఒక ఆత్మీయుడైన స్నేహితునిగా మసలుకో సాగాడు!

(ఇంకా ఉంది)

# ప్రశ్నావళి

కె. రమాలక్ష్మి

ఎస్. జి. ఎన్. కలకత్తా.

★ నేటి సమాజంలో విద్యా విధానం, లంచగొండితనంపై మీ అభిప్రాయం?

● రెండూ – ప్రక్షాళించవలసిన స్థితిని దాటిపోయాయి నేటి విద్యా విధానం ఎంత నిరుపయోగంగా తయారైందో – మన నిరుద్యోగులు చెప్తున్నారు లంచం ఎంత బలవత్తరమై పోయిందో – అధికారులు చెప్తున్నారు సామాన్య మానవుడు యీ రెండిటికీ దాసుడే

బి. ఆర్ పెనమకుదురు.

★ ప్రియుడు తన ప్రేయసికి గులాబి పువ్వే ఎందుకిస్తాడు?

● జీవిత పుష్పానికి అందం సువాసనే కాదు– ము ంటాయి సుమా అని కాబోలు!

పి కె. బి. బళ్ళారి.

★ వ్యభిచార మహిళలకు మీరిచ్చే సలహా ఏమిటి సిస్టర్?

● రక్షణ కల్పించి ఆదుకొంటే – అంతే చాలు బురదలో కాలేస్తే కడుక్కోడం తేలికే కాని వ్యభిచారంలోకి దిగాక బయట పడడం అంత సులభం కాదని– బయటపడనివ్వని పరిస్థితులు కల్పిస్తున్నారని– వార్తలు వినలేదా? వీటి నుండీ –రక్షణ కావాలి వారికి

ఎం వి. ఎల్. పొద్దుటూరు.

★ దేవుడు ఒకడే– అన్ని మతాలు ఒకటే అని అంటారు కదా? మరి క్రైస్తవులు బొట్టు పెట్టుకోవచ్చు కద

● సరదా వేస్తే పెట్టుకునే దానికింత ధర్మసందేహం దేనికయ్యా?

కె. ఎస్. డి. రేచర్ల.

★ ఆడదానికి దేనికైనా ఏడుపు వస్తుంది మగవాడికి ఏడుపు రాదు – ఎందుకని?

● ఎవరు చెప్పారు – మగవాడికి ఏడుపు రాదని? భోరున ఏడవాలని వున్నా 'ఛీ మగవాడివి ఏడుస్తావా?' అని కసిరిన చిన్ననాటి పెద్దలని తలుచుకుని దుఃఖాన్ని గుండెల్లోనే దాచుకుంటారు – మగవారు పౌరుషం అడ్డొచ్చి ఏడవలేరంతే ఏడుపు రాక కాదు

ఎస్. ఎస్. ఆర్. కాశీబుగ్గ.

★ అద్దె కోసం యిల్లడిగితే మీ వర్ణ మేమిటి అని అడుగుతారెందుకని?

● ఏం లేదు. చేపలు తినని వాడికి చేపలు తినే వారుగొస్తే బాధపడాలని! అంచేత వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్ విషయాలు తెలుసుకోవడం మంచిది – వర్ణం ఏదైతేనేం?!

సి. బి. ఆర్. మద్రాసు.

★ నా వయసు 26 ఇంకా పెళ్ళి కాలేదు తెలిసీ తెలియనితనంతో ప్రేమించి తెలిసిన తరువాత బాధపడటం కంటే పెళ్ళయిన తరువాత భార్యని ప్రేమించడం భర్త యొక్క కర్తవ్యం అని తలచుచున్నాను మీరేమంటారు?

● గుడ్ బోయ్!!

కె. ఎమ్. బి. భీమవరం.

★ మీ ఆడది నవల చదివి ఈ ప్రశ్న రాస్తున్నాను కోటనందూరు ప్రేమకు మారు పేరు మీ అభిప్రాయం?

● పిచ్చికి మారు పేరు నేను చూసినది, నేను వూహించినది – నేనెరిగినది కోటనందూరు యిప్పుడు లేదక్కడ!

ఎమ్. డి. బి. మర్రిపాడు.

★ రాజకీయ నాయకులంతా తెల్ల బట్ట వేసుకుంటారు ఎందువలన?

● మనసు పొరల నున్న నలుపుటూహలు కప్పుకు పోతాయని ఆశ

★ మీరు జీవితంలో మరిచి పోలేని సంఘటన ఏమిటి?

● నేను ఎంత ఆనందాన్నిచ్చినదైనా, ఎంత దుఃఖాన్ని బాధని కల్గించినదైనా – మరిచిపోడానికే ప్రయత్నిస్తాను వేదాంతిని కాదు కాని వేదాంత దృక్పథం అలవరచుకున్నాను – విషయ పరిజ్ఞానం పట్ల, సంఘటనలను బేరీజు వేయడం పట్ల

సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి.

★ పార్టీల ఎన్నికల ప్రణాళికలు తెలుసుకుని ఓటు హక్కు నుపయోగించుకునే వారి శాతం ఎంత ఉంటుంది?

● అదే వుంటే ఎవరూ గెలవరు. మనవాళ్ళు అక్షరాశ్యుల మీద అందుకే ఆధారపడరు మూక వారికి శ్రీరామరక్ష. అందుకే ఏటా నిరక్షరాశ్యుల సంఖ్యా పెరుగుతుందే గాని తరగదు తరిగించాలని ప్రయత్నం చేస్తున్నట్టు – వచ్చే ఎన్నికల దాకా నటించడమే – ప్రజాస్వామ్యం!

★ మీ పొద్దు తిరుగుడు పువ్వు 85లో నేనా పూస్తుందా?

● వాన రాకడా ప్రాణం పోకడా ఎవరు చెప్పగలరు నాయనా?!

★ నేటి 'కార్తీక సమారాధనలు'పై మీ అభిప్రాయం?

● అంటే ఏమిటి?!

★ నేడు రూపాయి విలువ ఎంత వుంది?

● చెప్పడానికి సిగ్గుగా వుంది!

ఎస్. కె. జెంషెడ్‌పూరు.

★ ప్రశ్నావళిలో చచ్చు జవాబులు యివ్వడం తప్పించి మీ కింకేం పనీ పాటా లేదా? ఏదో స్త్రీ జాతిని వెనకేసుకురావడం?

● ఇంకా విద్యార్థివి కుమార్, ఇప్పుడే యిలా వుంటే ఇక మనిషివయ్యాక ఎలా ప్రవర్తిస్తావో – వూహించడానికే భయంగా వుంది నీ చెల్లెళ్ళకి, అక్కలకి, అమ్మకి, నీ రాబోయే భార్యకి– కనబోయే ఆడపిల్లలకి– యివే నా సానుభూతి యిప్పుడే అందుకో అప్పటి దాకా నేనుండక పోవచ్చు! □



# అందుకు కావలసిందల్లా, నిశ్చింతగా ఉండే మనసు, నియమితమైన ఆహారం!



అవును, పాపకు స్తన్యపానం చేయించడానికి యోగ్యంగా అవడానికోసం కావల్సింది సూటిగా చెప్పాలంటే అది, వీలైనంత వరకు ప్రశాంతమైన మనస్సుతో ఉండండి. మరి మీరు తీసుకునే ఆహారంలో ఎటువంటి పదార్థాలుండాలంటే, దాంతో మీ శరీరంలో, పాపకోసం ఎక్కువగా పాలు పడేలా ఉండాలి.

**చితీ-చింతా రెండు ఒక్కటే**

చింత అన్నది మీకే కాదు, మీ పాపకి కూడా హానికరం కావచ్చు. చింతించడం వలన మీలో ఉదాసీనత, ఆవేదన, అస్వస్థతగా ఉందనిపించడం—అంతేకాదు మీలోని పాలు ఎండిపోవచ్చు.

మీకే గనక ఆరోగ్య విషయంలో ఏదైనా సమస్య గనక వుంటే, దిగులుపడి చతికిలబడి పోవద్దు కొంచెం ధైర్యంగా మెలగండి. మీ డాక్టరు దగ్గరికి వెళ్ళి మీ సమస్య ఏమిటో చెప్పండి ఆయన మీ సమస్యని తప్పకుండా అర్థం చేసుకుంటారు ఎందువల్లనంటే ఆయన మీ డాక్టరు గనక—ఆయనపైన పూర్తిగా నమ్మకాన్ని ఉంచవచ్చును.

**పుష్టికరమైన ఆహారాన్ని తీసుకోవడం మొదలెట్టండి**

పుష్టికరమైన ఆహారాన్ని గూర్చి తెలుసుకోవడానికి గ్రంథాలేవీ చదవనూ అక్కర్లేదు కేలరీ చార్టులు చూడనూ అక్కర్లేదు. మీ పాపయొక్క వృద్ధి వికాసాల కోసం ఎక్కువగా ప్రోటీన్లు కావాలనుకుందాం ప్రోటీన్లు శరీర నిర్మాణం చేసే ద్రవ్యం, అవి పాలు, కోడిగుడ్లు, మాంసం వీటిలో వుంటాయి. మరైతే మీరు ప్రోటీన్లు సమృద్ధిగా వున్న పదార్థాలను తినాలి మీకు అటువంటి పదార్థాలలో ఎంత ఎక్కువలో ప్రోటీన్లు లభిస్తే, మీ పాపకు మీ పాలలోంచి అంత ఎక్కువగా ప్రోటీన్లు లభ్యమవుతాయి. మరి ఒక్క విషయం గుర్తుంచుకోండి మీ ఆహారంలో కార్బోహైడ్రేట్లు అవసరమైన దాని కన్న ఎక్కువగా ఉండకూడదు ఎందుకంటే అందువల్ల మీ పాల యొక్క ప్రమాణంపై దాని గుణాలపైనా దుష్ప్రభావం పడవచ్చు. ఆ రకమైన జాగ్రత్త, అటువంటి తిన్ననైన, సూటియైన ఉపాయాలు మీ పాపకు సరియైన ప్రకారంగా స్తన్యపానం చేయించడానికి సహాయకరంగా ఉంటాయి.

అయితే దైవవశాత్తు మీ ఆరోగ్యం విషయంలో పెద్ద సమస్య గనక వస్తే, అటువంటి పరిస్థితిలో చాలా బాగా ఆలోచించి, మీ పాపకు ఎటువంటి ఆహారం యివ్వాలంటే మరి తల్లిపాల తర్వాత అన్నిటికన్న ఉత్తమంగా ఎంచబడుతూన్న దాన్ని

**స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే**

అమూల్‌స్ప్రే, పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు, దాంతోబాటే, తేలికగా అరగగలిగే కార్బోహైడ్రేట్లు, సరియైన సంతులిత రూపంలో అత్యావశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది మొదటిగానే పేస్టులా తయారు చేయవలసిన అవసరం ఉండదు

**పొదుపు**

అమూల్‌స్ప్రే డబ్బాలలో దొరికే శిశుఆహారాలన్నిటికన్న పొదుపైనది. ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన— "శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు

**జాగ్రత్త పడటం**

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ, సీసాని, ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమే ఖచ్చితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి.

**ఉచితం! అమూల్ బేబీ పుస్తకంలో**

ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి అవి గర్భధారణ, ప్రసవానికి ముందర జాగ్రత్త, ప్రసవము, తల్లిపాలు, ఇతర ఆహారములు, మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దినచర్య, పిల్లవాని అభివృద్ధి, జబ్బులను అరికట్టుట, ప్రథమ చికిత్స, సాధారణ రోగములు, జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ, జ్ఞాపకముంచుకోవలసిన విషయములు ఈ పుస్తకం తెలుగు, ఇంగ్లీషు, హిందీ, తమిళం, మలయాళం, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ భాషల్లో దొరుకుతుంది. దానికోసం పోస్ట్ బాక్స్ 10124, బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ, పూర్తి అడ్రసు యిస్తూ రూ 1 25 స్టాంపుల్ని జతపర్చండి




# అమూల్‌స్ప్రే

తల్లిపాల తరవాతనే ఇది

అమ్మకం చేయించువారు
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్



ASP/AS TEL7/83

# ముసుగు

పాలకూర సీతాలత

సమయం ఉదయం పదిగంటలు కావస్తోంది ఆఫీసుకి వెళ్ళడానికి సిద్ధం అయిన పావనరావు చెప్పులు తొడుక్కుని వీది గుమ్మం దగ్గరకి వచ్చాడు తమ ఇంటి ముందే ఆగిపోయి, రోడ్డు పక్కన నిలబడ్డ చంద్రమౌళి కనిపించగానే ఏదో సందేహం వచ్చి మెట్లు దిగాడు వీది వైపు వున్న తమ బెడ్‌రూం కిటికీ వైపు చూశాడు అతని ఊహ అబద్ధం కాలేదు కిటికీ తెర తొలగించి అక్కడే నిలబడి వుంది అతని కూతురు సుహాసిని పావనరావు కళ్లల్లో నిప్పులు కురిశాయి

సుహా ' అంటూ అరిచాడు కోపంగా

సుహాసిని అక్కడ నుంచి తప్పుకుంది కిటికీ తెర పడింది

రోడ్డు మీద చంద్రమౌళి గబగబా అడుగులు వెయ్యసాగాడు

వెంటనే రోడ్డు మీదకు వచ్చిన పావనరావు

చంద్రమౌళీ అంటూ పిలిచాడు బెరుగ్గా చంద్రమౌళి ఆగేడు

నీకు ఇదేమన్నా బాగుందిటోయ్? కొంచెం కోపంగా అన్నాడు పావనరావు

క్షమించండి సార్ నేను పాడుబుద్ధితో అక్కడ ఆగలేదు ఆమెను పెళ్లి చేసుకుందుకు నేను అరాట పడుతున్నానన్న విషయం మీకు తెలియనిది కాదు ఆమెను చూడకుండా వుండలేను కానీ మీరు అంగీకరించక

చంద్రమౌళి మాటలు పూర్తి కాకుండానే పావనరావు అందుకున్నాడు

అవునయ్యా! అంగీకరించను సాంప్రదాయాలు, కట్టుబాట్లు అనేవి పాటించాలి

కానీ ఆ సాంప్రదాయాలు, కట్టుబాట్లు కన్నీరుకి కారణం అవుతున్నప్పుడు వాటిని పట్టించుకోకూడదని నా ఉద్దేశ్యం అన్నాడు పావనరావుతో చంద్రమౌళి

మన ఉద్దేశాలు ఉత్తర, దక్షిణ ధృవాలు, అటువంటప్పుడు ఇక మాట్లాడటం అనవసరం అది కూడా ఇలా రోడ్డు మీద నడుస్తూ దయచేసి ఇకముందు మా ఇంటి దగ్గర ఆగకు నాకు కోపం తెప్పించకు తర్వాత వచ్చే అనర్ధాలకు నేను బాధ్యుడిని కాను అంటూ బెదిరించాడు పావనరావు

చంద్రమౌళి మాట్లాడలేదు వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయేడు

చంద్రమౌళి వంక కోపంగా చూసి పళ్లు నూరుకున్నాడు

'ఇందులో తప్పు సుహాసినిది కూడా ఉంది ముందు ఆమెను అదుపులో పెట్టాలి భర్తపోయిన ఆడది ఇలా ప్రవర్తించడం ఎంత తప్పు!అనుకున్నాడు

సాయంత్రం ఇంటికి వెళ్లాకా సుహాసిని బాధపడ్డా



సరే ఆమెను గట్టిగా మందలించాలి

ఆ రోజు ఆఫీసులో అన్యమనస్కంగానే గడిపాడు

ఆ సాయంత్రం ఇంటికి వెళ్ళగానే అతన్ని చూసి సుహాసిని లోపలకు వెళ్ళి గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది అది ఆమెకు అలవాటు ఆ పని అడక్కుండానే చేస్తుంది

**ఆమె ఇచ్చిన గ్లాసు అందుకుని దాన్ని ఖాళీ చేశాడు. అంతగా దాహం వెయ్యకపోయినా.**

**ఆమె ముఖంలోకి చూసేకా అతని కోపం అంతా నీరు కారిపోయింది.**

**బాధగా కుర్చీలో కళ్ళు మూసుకుని కూర్చున్నాడు.**

సుహాసిని ఆమె వయసు ఎంత? ఇరవై రెండు! ఉన్నంతలో లోటు లేకుండా పెళ్ళి చేశాడు కానీ ఆమె భర్తతో కాపురం చెయ్యకుండానే ఆమె పసుపు, కుంకుమలకు దూరం **అయ్యింది** ... భగవంతుడు ఎంత నిర్దయుడు!

**పెళ్ళి జరిగిన వెంటనే ఆ అబ్బాయికి** ఎక్కడో నెల రోజుల ట్రైనింగ్ వుందట అది అయ్యాకా కాపురం పెడతానన్నాడు కానీ ఆ నెల రోజులూ పూర్తికాకుండానే ఒక రోడ్డు ప్రమాదంలో మరణించాడు

కుంకుమ బొట్టుతో తళ తళ లాడుతుండే ఆమె ముఖం బోసి పోయింది పుట్టెడు బాధ, కొండంత నిరాశ ఆమెను చుట్టుముట్టాయి నిర్లిప్తంగా ఆ నాలుగు గోడల మధ్యా రోజులు గడుపుతోంది

ఆమెకు మళ్ళీ పెళ్ళి చెయ్యమని ఒకరిద్దరు మిత్రులు సలహా చెప్పారు కానీ ఆ ఆలోచనను సమర్థించలేకపోయాడు తను .

ఎంత తప్పు అది! ఆమె అదృష్టం అంతే అని తను సరిపెట్టుకుపోవాలి కానీ ఆమెకు పునర్వివాహం చెయ్యడమా? నలుగురూ ఏమంటారు? తనని వెలి వేసినట్లు చూడరూ? ఆమెను చూస్తుంటే బాధ కలుగుతుందన్న మాట నిజమే కానీ ఆమెకు పునర్వివాహం చెయ్యడానికి సమ్మతించలేకపోతున్నాడు ఆమెను చేసుకుందుకు చంద్రమౌళి సిద్ధంగా వున్నా!

అతని భుజం మీద చెయ్యి పడింది కళ్ళు విప్పి చూశాడు అతని భార్య సీత

ఏమండీ అలా వున్నారు? వంట్లో బాగాలేదా? అంది

'అబ్బే బాగానే వుంది అన్నాడు

బట్టలు మార్చుకుందుకు లోపలకు వెళ్ళాడు కర్టెన్ గుడ్డ మీద ఏదో పువ్వుల డిజైను కుడుతోంది సుహాసిని

"అమ్మా సుహాసినీ నీ బాధ నాకు తెలుసమ్మా! కానీ సంఘాన్ని ఎదిరించలేని పిరికితనం నాది నువ్వు ఏ తప్పూ చెయ్యవన్న నమ్మకం నాకు వుంది అయినా ఆ చంద్రమౌళిని మరిచిపో తల్లీ " అన్నాడు పావనరావు.

సుహాసిని కళ్ళు ఎత్తి చూసింది. ఆమె కళ్ళలో నీళ్ళు.

ఇక అక్కడ వుండలేక బయటకు వెళ్ళిపోయాడు పావనరావు

సుహాసిని ఆలోచనలలో చంద్రమౌళి

చంద్రమౌళి సుహాసినికి కాలేజీలో స్నేహితుడు ఆమెను ఎంతగానో ఆరాధించేవాడు ఆమెను పెళ్ళి చేసుకోవాలని అనుకున్నాడు కానీ సుహాసినికి పెళ్ళి నిశ్చయం జరిగినప్పుడు, ఆ పెళ్ళి జరిగిపోతున్నప్పుడు చేతకానివాడిలా చేతులు ముడుచుకుని కూర్చోవలసి వచ్చింది అందుకు కారణం అప్పట్లో అతను నిరుద్యోగపు వాడి కోరల్లో చిక్కుకుపోయినందువల్ల అక్కడికీ ధైర్యం చేసి అతను ఒక రోజు పావనరావు గారిని కలిసేడు నిరుద్యోగికి తన కూతుర్ని ఇయ్యనని ఆయన ఖచ్చితంగా చెప్పేశారు కొన్ని రోజులు వేచి ఉండమనీ, ఈలోగా ఎంత చిన్నదైనా ఒక ఉద్యోగం సంపాదించుకుంటాననీ జాలిగా బ్రతిమాలాడు చంద్రమౌళి

వేళాకోళంగా నవ్విన పావనరావు!

"బాగుందోయ్ నీ వ్యవహారం నీ ఉద్యోగం కోసం నా కూతురికి పెళ్ళి చెయ్యకుండా ఆపు చెయ్యనా? మా అమ్మాయిని మరిచిపో ఇదేం జరిగే వ్యవహారం కాదు బంగారంలాంటి సంబంధం దొరికింది దీన్ని వదులుకోవడం మూర్ఖత్వమే అన్నాడు దాంతో ఇక ఏమీ చెయ్యలేనని గ్రహించిన చంద్రమౌళి, మనసు రాయి చేసుకుని, సుహాసినికి నచ్చ చెప్పి ఆమె పెళ్ళి రోజున ఆ ఊర్లో ఉండకుండా వెళ్ళిపోయేడు

సుహాసిని పెళ్ళి జరిగిపోయింది ఆ తర్వాత జరగకూడనిది కూడా జరిగిపోయింది ఇప్పుడు ఉద్యోగస్తుడైన చంద్రమౌళి సుహాసినికి జరిగిన అన్యాయానికి చాలా బాధపడ్డాడు మనసు పొరలలో ఆమె పైన ఇంకా ప్రేమ వుండటంతో ఆమెను పెళ్ళి చేసుకుందుకు సిద్ధపడ్డాడు సుహాసినికి కూడా అతన్ని పెళ్ళి చేసుకోవాలన్న వాంఛ ఉంది

కానీ ఇందుకు అడ్డు పావనరావు

పావనరావు అభ్యంతరానికి కారణాలు సాంప్రదాయాలు

ఎంత ఘోరం!

సుహాసిని మౌనంగా రోదిస్తుంది చంద్రమౌళి ప్రయత్నాలు చేస్తున్నాడు పావనరావు గారికి నచ్చచెప్పడం కోసం

భగవంతుడు ఏం రాశి పెట్టాడో సుహాసిని నుదుట

చిన్నగా నిట్టూర్చింది సుహాసిని

★ ★ ★ ★ ★

రెండు రోజులు గడిచేకా ఒక సాయంత్రం ధైర్యం చేసి చంద్రమౌళి పావనరావు గారి ఇంటికి వచ్చి ఆయన్ని కలిసేడు

నమస్కారం ' అన్నాడు మర్యాదగా

అతన్ని చూడగానే అయిష్టంగా నుదురు చిట్లించాడు పావనరావు

ఎందుకు వచ్చావు?

మీతో కొంచెం మాట్లాడాలని

ఆ విషయమేగా

అవును సార్ ఇంట్లోవాళ్ళ పోరు ఎక్కువైపోయింది, పెళ్ళి చేసుకోమని ఇన్నాళ్ళూ ఏదో రకంగా వంక పెట్టి నెట్టుకు వస్తున్నాను ఇకముందు కుదరదని తోస్తోంది అందుకే మిమ్మల్ని మరొకసారి అడగాలని వచ్చాను సుహాసినిని

అంటూ ఆగిపోయేడు చంద్రమౌళి

మాట్లాడలేదు పావనరావు

ఇప్పుడు నేను ఉద్యోగస్తుడిని సార్ పన్నెండు వందల జీతం

అవునయ్యా! నీకేం తక్కువ? అందుకే మరొక అమ్మాయిని హాయిగా పెళ్ళిచేసుకో అన్నాడు



పావనరావు తేలిగ్గా

అమ్మాయి దొరక్క నేను ఇంతగా అవస్థపడటం లేదండీ మీ అమ్మాయిలాంటి అమ్మాయి దొరకదు కనుక ఇంతగా మీ చుట్టూ తిరగవలసి వస్తోంది సుహాసిని అంటే ఈనాటికీ కూడా నాలో అమితమైన ప్రేమానురాగాలు ఉన్నాయి దయచేసి అందుకే

చూడు చంద్రమౌళీ! ఒక విధవను వివాహం చేసుకుందుకు ముందుకు వచ్చిన నీ సంస్కారాన్నీ, మంచి మనసునీ అభినందిస్తున్నాను కానీ నిప్పులాంటి వంశంలో పుట్టి, సాంప్రదాయాలు ఊపిరిగా బ్రతుకుతున్న నేను నా కూతురికి వివాహం చెయ్యలేను మా బామ్మగారి చెల్లెలుకి భర్త పోయినప్పుడు వయసు ఎనిమిది సంవత్సరాలు ఆమె మళ్ళీ పెళ్ళి చేసుకోలేదే! భర్త శవం ఇంటి ముందు వుంటే ఆమె చింత గింజలు ఆడుకుంది పెద్దవాళ్ళు మందలించి ఆమెను ఏడవమని చెప్పారు అన్నాడు పావనరావు

ఆ రోజులు వేరు కదా! చంద్రమౌళి అన్నాడు

అన్ని రోజులూ ఒక్కటే ఆ రోజుల్లోనూ సూర్యుడు తూర్పున ఉదయించేవాడు ఇప్పుడూ అంతే

నిట్టూర్చాడు చంద్రమౌళి

'మీకు నచ్చ చెప్పడం నాకు చేతకాదు నా అదృష్టం ఇంతే అనుకుంటాను వస్తాను అంటూ లేచి వెళ్ళిపోయేడు

లోపల్నుంచి ఈ సంభాషణ అంతా వింటున్న సుహాసినికి బాధ ఆగలేదు గుమ్మం ముందుకు వచ్చిన అదృష్టం తిరిగి వెళ్ళిపోవడం ఆమెకు నచ్చలేదు కానీ ఏంచెయ్యగలదు? ఆ మొండి తండ్రిని ఎలా ఒప్పించగలదు? బేలగా తల్లి వైపు చూసింది కూతరు చూపులు అర్థం చేసుకుని భర్తకు సమీపించింది సీత

'ఇద్దరికీ ఇష్టం అయినప్పుడు మనం కాదనకూడదు మన అమ్మాయిని ఈ స్థితిలో కూడా పెళ్ళి చేసుకోగల అబ్బాయి దొరకడం ఒక రకంగా అదృష్టం ' అంది సీత

'అతను వెళ్ళాకా నువ్వు మొదలుపెట్టావా? కోపంగా అన్నాడు పావనరావు

అది కాదండీ! మీరే ఆలోచించండి వాళ్ళిద్దరూ కూడా మనపై గౌరవం వుంచి ఇలా ప్రాధేయపడుతున్నారు మీరు అంగీకరించలేదని చెప్పి స్వతంత్రించి ఇద్దరూ ఒకటైతే మన మర్యాద ఏముంటుంది?'

పావనరావు కళ్ళల్లో నిప్పులు కురిశాయి

వాళ్ళకు ఆ ఉద్దేశ్యం లేకపోయినా నువ్వు కలగచేస్తున్నావు ఒకవేళ అలాగే జరిగితే కటుంబ గౌరవం మంట కలిపినందుకు దాన్ని కత్తితో పొడిచి చంపి జైలుకు వెళ్తాను అన్నాడు పావనరావు

ఆ మాటలకు బెదిరిపోయింది సీత

లోపల్నుంచి సుహాసిని మౌనంగా రోదించింది

# ముసుగు

విసురుగా లేచి, తనకు కోపం వచ్చిన సంగతి తెలియపరచడానికి అన్నట్టు తలుపులు శబ్దం వచ్చేలా మూసి బయటకు వెళ్ళిపోయేడు పావనరావు

నిరాశగా కూలబడిపోయింది సీత

* * * * *

ఆ రోజు ఆదివారం సాయంత్రం పూట వీధి వైపు గార్డెన్‌లో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు పావనరావు

"పావనరావ్ ఎవరో పిల్చారు

తల ఎత్తి చూశాడు

నన్ను గుర్తుపట్టలేదుట్రా? అంటూ దగ్గరకు వచ్చాడు ఆ వ్యక్తి

అతని ముఖంలోకి పరీక్షగా చూస్తూ ఆలోచించేడు పావనరావు

'మీరు మీరు

"మీరు ఏమిట్రా నీ ముఖం? నేను బాలాజీని ' అన్నాడు అతను

అప్పుడు గుర్తు వచ్చింది పావనరావుకి

అవును బాలాజీ " అన్నాడు తన హైస్కూలు మిత్రుడితో చెయ్యి కలుపుతూ

అమ్మయ్య! మొత్తానికి గుర్తుపట్టావు అన్నాడు బాలాజీ ఆనందంగా

ఎక్కడనుంచి ఊడిపడ్డావు? ఎక్కడ వుంటున్నావు? నేను ఇక్కడ వున్నట్టు ఎలా తెలిసిందీ? అన్నాడు పావనరావు

"ఆగు మరి అలా ప్రశ్నల వర్షం కురిపిస్తే తట్టుకోలేను ముందు కాసిని మంచినీళ్ళు ఇప్పించు అన్నాడు బాలాజీ

అలాగే " అంటూ స్వయంగా లేచి వెళ్ళి, గ్లాసుతో నీళ్ళు తెచ్చి ఇచ్చాడు రెండో చేత్తో మరొక కుర్చీ తెచ్చాడు

"అదేమిటి? ఇంట్లో ఎవ్వరూ లేరా? అడిగేడు బాలాజీ

"ఈ ఊళ్ళోనే ఉన్న తన అన్నగారి ఇంటికి వెళ్ళింది మా ఆవిడ మధ్యాహ్నం కాస్సేపట్లో వస్తుంది అన్నాడు పావనరావు

"అలాగా " అంటూ మంచినీళ్ళు తాగేడు బాలాజీ

వాళ్ళిద్దరూ హైస్కూల్లో మంచి స్నేహితులు తర్వాత వేరే వేరే ఊళ్ళలో కాలేజీలో చేరారు కొన్ని రోజులు ఉత్తరాలు రాసుకున్నారు తర్వాత అవీ ఆగిపోయాయి మళ్ళీ ఇన్ని రోజులకు కలిశారు

"నేను రాజమండ్రిలో వుంటున్నాను అక్కడే ఉద్యోగం చేస్తున్నాను. నువ్వు ఇక్కడ ఈ కాకినాడలో వుంటున్న విషయం నిన్ననే తెలిసింది లేకపోతే ఇంత ఆలస్యం చేస్తానా నిన్ను కలుసుకుందుకు మన మిత్రుడు నిన్న నేను ఇక్కడకు వస్తున్నప్పుడు రైల్లో కలిసి ఇక్కడే ఎక్కడో వుంటున్నావని చెప్పాడు దాంతో నిన్ను కలుసుకోవాలని ఈ కాలనీకి వచ్చాను. నేమ్ బోర్డు చూశాను నువ్వే ఎందుకు కాకూడదని తోచింది పిలవబోయేంతలో గార్డెన్లో కూర్చున్న నువ్వు కనిపించావు నీ కుడి కంటి పైన వున్న పెద్ద పుట్టుమచ్చ నువ్వే మా పావనరావు అని చెప్పింది అంతే " అన్నాడు బాలాజీ

"నీకు రైల్లో కలిసింది ఎవరు?

"అదేరా జగన్నాథం అని సన్నగా, పీలగా వుండేవాడు వాడిని మనం జగ్గు, మగ్గు అని ఏడిపించేవాళ్ళం "

పావనరావు ఆలోచించేడు కానీ గుర్తు రాలేదు ఆ ! ఎవడో వుండే వుంటారు లేకపోతే బాలాజీ ఎందుకలా చెప్తాడు?

'నాకు చాలా సంతోషంగా వుంది చాలా రోజులకు కలుసుకున్నాం ' హాయిగా నవ్వేడు పావనరావు

బాలాజీ కూడా చిరునవ్వు నవ్వేడు

"లైఫ్‌లో సెటిల్ అయ్యావా? ఎందరు పిల్లలు? ఇల్లు సొంతమేనా? అడిగేడు బాలాజీ

"ఆ ( ' లోను తీసుకుని ఇల్లు కట్టేను కొద్దికొద్దిగా తీరుస్తున్నాను ఒక్కత్తే కూతురు పెళ్ళి చేసుకుంటావు బాలాజీ అన్నాడు ఆ అని ఊరుకున్నాడు పావనరావు ఆ తర్వాత కూతురి గురించి వివరాలు చెప్పడం ఇష్టంలేకపోయింది అతనికి భార్యతో పాటు కూతురు కూడా బయటకు వెళ్ళడం మంచిదే అయ్యింది " అనుకున్నాడు లేకపోతే ఆమెను పరిచయం చెయ్యవలసి వచ్చేది ఆమె విధవ అన్న విషయం వీడికి తెలిసిపోయి వుండేది

నీ గురించి చెప్పు!' అన్నాడు పావనరావు

చిన్నగా నిట్టూర్చేడు బాలాజీ

"ఒక కొడుకు ఒక కూతురు చేతికి అందివచ్చిన కొడుకు ఏక్సిడెంటులో చచ్చిపోయేడు వాడికి పెళ్ళి చేసిన ఏడాదికి ఈ ఘోరం జరిగింది కోడల్ని నా ఇంట్లోనే పెట్టుకున్నాను కూతురుకి పెళ్ళి చేసి పంపాను ఆమె సఖంగానే వుంది సమస్య కోడలితోనే "

అరెరె ఎంత కష్టం వచ్చింది! చేతికి అందివచ్చిన కొడుకు పోవడం చాలా బాధాకరమే ' అన్నాడు పావనరావు

నా బాధ సరే ఇంట్లో కోడలు పిల్ల ముఖం చూస్తే నాకు మరింత బాధ కలుగుతుంది. పట్టుమని పాతికేళ్ళు లేవు వైధవ్యం ముంచుకొచ్చింది ఆమెకు మళ్ళీ వివాహం చెయ్యాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాను కానీ అబ్బాయి దొరకద్దూ?" నిరాశగా అన్నాడు బాలాజీ

నిజమే ఈ రోజుల్లో అంత మంచి మనసుగల యువకులు ఎక్కడ దొరుకుతారు? మామూలుగా ఆడపిల్ల పెళ్ళి చెయ్యడానికే వేలకొద్దీ కట్నాలు

పొయ్యాలి లాంఛనాలు జరపాలి అయినా ఏవో గొంతెమ్మ కోరికలు వుండిపోతాయి అలాంటిది భర్త చనిపోయిన అమ్మాయికి పెళ్ళి జరగడం చాలా కష్టమే అన్నాడు పావనరావు

'పరవా లేదు దేశం అంతా వెతికి అయినా, ఎంత కష్టపడ్డా ఎవర్నో ఒకర్ని పట్టుకుంటాను మళ్ళీ నా కోడలు జీవితంలో నవ్వులు పండేదాకా శాంతి లేదు నాకు నా బాధ మరొకదానికి అన్నాడు బాలాజీ

'ఏమిటి?

ఆ కోడలు పిల్ల తల్లిదండ్రుల దోరణికి నాకు ఒళ్ళు మండుతుంది ఆ అమ్మాయికి మళ్ళీ పెళ్ళి చెయ్యవద్దంటారు సాంప్రదాయం, చట్టుబండలు అంటున్నారు కోడలు గురించి నేను పడుతున్న బాధలో సగం కూడా వాళ్ళు కూతురు గురించి పడటం లేదు వాళ్ళతో బాగా కొట్లాడాను వాళ్ళ పద్ధతి తప్పు అని నచ్చ చెప్పాను కానీ వినటం లేదు మూర్ఖులు అన్నాడు కొంచెం కోపంగా బాలాజీ

పావనరావు కొంచెం ఉలిక్కిపడ్డాడు

'కొంత మంది కొన్ని ఆచార వ్యవహారాల కోసం ప్రాకులాడతారు అన్నాడు పావనరావు

'అదే తప్పు మారుతున్న కాలంతో మనమూ మారాలి పూర్వకాలం ఆడదానికి చదువు ఎందుకన్నారు ఇప్పుడు చదువుకోవడమే కాదు ఉద్యోగాలు కూడా చేస్తున్నారు నువ్వు మీ అమ్మాయికి చదువు చెప్పించావా లేదా?'

చెప్పించాను

'కరక్టు మన బామ్మలు, అమ్మమ్మలు చదువుకోలేదని మన అమ్మాయిలకు చదువు చెప్పించడం మానలేదు కదా' సతీ సహగమనం అన్న ఆచారం గతంలో వుంది ఇప్పుడు దానికి స్వస్తి చెప్పామా లేదా? అలాగే గతంలో విధవా వివాహాలు లేవుకదా అని ఇప్పుడు కూడా వుండకూడదంటే ఎలాగ? నా కోడలు కోసం నేను చింతించని క్షణం లేదు

'సాంప్రదాయాలు ఇంకా ఏదో అనబోతున్న పావనరావుతో

రబ్బిష్ నువ్వు కూడా మా వియ్యంకుడిలాగే మాట్లాడకు ఈ సాంప్రదాయాలు అన్నవి "ముసుగు లాంటివి ఆ ముసుగులో కూర్చుంటే చుట్టూ చీకటి తప్ప మరేమీ కనిపించదు చీకటి అంటే నిరాశ, తిరోగమనం ఒక్కసారి ఆ ముసుగులోంచి బయటపడి చూస్తే కనిపించేది వెలుగు వెలుగు అంటే ఆశ, అభివృద్ధి, జ్ఞానం ఆ ముసుగులోంచి బయటపడనంత కాలం మనుమల్ని భగవంతుడు కూడా -రక్షించలేడు అన్నాడు బాలాజీ ఆవేశంగా

పావనరావుకి ఎవరో చెంపమీద కొట్టినట్లు అనిపించింది

బాలాజీ మాటలు పదే పదే అతని మనసులో కదిలాయి

కాఫీ తీసుకొస్తాను" అంటూ లేచి లోపలకు వెళ్ళాడు పావనరావు బాలాజీ అభ్యంతరం పెడుతున్నా వినకుండా

బ్రూ కాఫీ కలుపుతున్నా అతనికి బాలాజీ మాటలు చెవిలో ధ్వనించాయి

కాఫీ అందించేడు పావనరావు

ఇంతకీ ఏ పనిమీద వచ్చావు? అడిగేడు బాలాజీని

'చెప్పాను కదా నాకు ఉన్న సమస్య ఒక్కటే అని అదే కోడలుకి సంబంధం వెతకడం ఈ ఊళ్ళో ఒక కుర్రవాడు వున్నాడట అతని ఆదర్శం ఒక విధవను పెళ్ళి చేసుకోవడం అట అదృష్టవశాత్తూ ఒక మధ్యవర్తి ద్వారా తెలిసింది ప్రయత్నించాలని వచ్చాను '

పావనరావుకి సందేహం కలిగింది

ఎవరబ్బాయి? అడిగేడు

ఏమో! ఈ ఊళ్ళోనే ఒక భర్తపోయిన అమ్మాయిని చేసుకోవాలనుకున్నాడట అందుకు కారణం ఆమెను గతంలో అతను ప్రేమించడమే ఇందాకా నేను చెప్పిన ముసుగులో వున్న ఆ అమ్మాయి తండ్రి అందుకు అభ్యంతరం చెప్పాడట దాంతో నిరాశ చెందిన ఆ అబ్బాయి ఈ ఆదర్శం పెట్టుకున్నాడట మా కోడలు పిల్ల అదృష్టవంతురాలైతే ఈ సంబంధం కుదిరిపోతుంది అన్నాడు బాలాజీ

అబ్బాయి పేరు ఏమిటి?"

ఏదో వుంది మధ్యవర్తి మాత్రం చంద్రం' అని చెప్పాడు పూర్తి పేరు ఇంకేదో వుండొచ్చు సరే నేను వెళ్తాను అంటూ లేచాడు బాలాజీ

ఆగు ఏం తొందర? అన్నాడు పావనరావు

అబ్బే ఆ మధ్యవర్తి అలా ఎక్కడికో వెళ్ళాడని చెప్పారు ఆయన ఇంటికి వెళ్తే నేను వచ్చి ఒక గంట కాలేదూ? ఈ పాటికి వచ్చి వుండొచ్చు ఆయన వెళ్తాను రాజమండ్రి వెళ్ళాక ఉత్తరం రాస్తాను అన్నాడు బాలాజీ

ఒక కాగితం మీద తన చిరునామా ఇచ్చేడు పావనరావు బాలాజీ చిరునామా తీసుకున్నాడు

బాలాజీ వెళ్ళిపోయేడు

ఆలోచిస్తూ కూర్చున్నాడు పావనరావు

బాలాజీ ఎంత గొప్పవాడు! కోడలుకి మళ్ళీ పెళ్ళి చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు తన కడుపున పుట్టిన కూతురికి మళ్ళీ పెళ్ళి చేయడానికి తను సందేహపడుతున్నాడు నిజంగా వాడు చెప్పిన 'ముసుగు'లో వున్నాడు సంఘానికి తను ఎందుకు భయపడాలి? వాళ్ళు తన బాగోగులు చూస్తారా? తనకు ఎందుకంత పిరికితనం? తన కూతురు బ్రతుకు తను కాకపోతే ఇంకెవరు బాగు చేస్తారు? బాలాజీకి కుర్రాడిని వెతికే సమస్య తనకు ఆ సమస్యే లేదు ఒక రకంగా తను అదృష్టవంతుడు ఆ అదృష్టాన్ని ఆహ్వానించాలి తప్పు కాదనకూడదు అది మూర్ఖత్వమే తన కూతురు పసుపు కుంకుమలతో తిరగాలని తనకు ఉన్నా, ఏదో అర్థంలేని పిరికితనం తనని కట్టి పడేసింది ఆ బంధాల్ని తెంచుకునే బలం బాలాజీ మాటలు ఇచ్చాయి తను ఆలస్యం చెయ్యకుండా, చంద్రమౌళికి క్షమార్పణలు చెప్పుకుని తన కూతుర్ని కట్టబెట్టాలి

బాలాజీ ప్రయత్నిస్తున్నది కూడా ఈ చంద్రమౌళి కోసమేనా?

ఆ ఆలోచనలకే అతని గుండె వేగంగా కొట్టుకుంది

అదే నిజమైతే అతను తన చెయ్యి జారిపోయినట్లేనా? అలాగ జరిగితే మళ్ళీ మరొక వ్యక్తిని వెతకడం తనకు సాధ్యమా?

మనిషికి స్వార్థ చింతన సహజం కనుక బాలాజీ





ఇటీవల మదరాసులో ప్రదర్శింపబడిన "హరిజనాగ్రహారం" నాటకంలో ఉత్తమ నటిగా ఎన్నికై కళాసాగర్ స్పేటీ అవార్డును ఆంధ్రప్రదేశ్ గవర్నర్ డా.శంకరదయాళ్‌శర్మ నుండి అందుకుంటున్న శ్రీమతి కె.ఇందిరాదేవి.

కంటే ముందు తనే ఈ అవకాశం వాడుకోవాలి.

వెంటనే లేచి బట్టలు మార్చుకుని ఇల్లు తాళం పెట్టి చంద్రమౌళి ఇంటికి పరుగులాంటి నడకతో వెళ్ళాడు పావనరావు.

అదృష్టవశాత్తూ ... చంద్రమౌళి ఇంట్లోనే వున్నాడు.

"మీరా! ... రండి ..." అన్నాడు చంద్రమౌళి.

ఒక గంట తర్వాత ఇల్లు చేరాడు పావనరావు.

భార్య, కూతురు ఇంటి తలుపు దగ్గర కూర్చుని వున్నారు.

"ఎక్కడికీ వెళ్ళనని చెప్పి ... ఎక్కడకు వెళ్ళారండీ? ... పావు గంట నుంచి మీ కోసం చూస్తున్నాం ..." అంది సీత.

"చంద్రమౌళి దగ్గరకు వెళ్ళాను ... సుహాసిని పెళ్ళి గురించి మాట్లాడటానికి. అతను సంతోషపడి అంగీకరించాడు. త్వరలోనే వాళ్ళ పెళ్ళి చేస్తాను ..." అన్నాడు పావనరావు.

తల్లీ కూతుళ్ళు ఆశ్చర్యపోయి తర్వాత ఆనందించారు.

ఆ ఇంట్లో నవ్వులు పండాయి.

★ ★ ★ ★ ★

ఒక నెల రోజులు గడవక ముందే రిజిస్ట్రార్ ఆఫీసులో సుహాసిని, చంద్రమౌళిల వివాహం జరిగిపోయింది. పావనరావు అంగీకారం దొరకగానే

# ముసుగు

ఇక ఆలస్యం చెయ్యకుండా చంద్రమౌళి తన ఇంట్లోనే తన వివాహ ప్రసక్తి తెచ్చి సుహాసిని గురించి చెప్పాడు. ఒక విధవను కోడలుగా తెచ్చుకుందుకు చంద్రమౌళి తల్లిదండ్రులు ముందు అంగీకరించలేదు. కానీ చంద్రమౌళి కార్యసాధకుడు. బెదిరించి ఒప్పించాడు మొత్తానికి.

సుహాసినిని తనదాన్ని చేసుకోగలిగినందుకు చంద్రమౌళి ఆనందానికి అంతులేదు. సుహాసిని పరిస్థితి కూడా అందుకు భిన్నంగా లేదు. పెళ్ళి జరిగిందన్న మాటే గానీ భర్తతో గడిపిన రోజులు మూడే. అందుకే అతడని తెలిగ్గానే మరిచిపోగలిగింది. తనంటే ఇష్టపడే చంద్రమౌళికి తననే అంకితం చేసుకుంది.

పావనరావుకి రెండు మూడు సార్లు బాలాజీ గుర్తు వచ్చాడు. తనలో మార్పు తేగల్గిన వ్యక్తి అతనొక్కడే. మామూలు క్షేమ సమాచారాలు తెలుపుతూ రెండు ఉత్తరాలు రాశాడు. బాలాజీ జవాబు రాయలేదు.

★ ★ ★ ★ ★

ఆఫీసు పని మీద గుంటూరు వెళ్ళవలసి వచ్చింది పావనరావుకి. రైల్లో వెళ్తుండగా రైలు రాజమండ్రి స్టేషన్లో ఆగింది. ఆ స్టేషన్ చూడగానే బాలాజీ గుర్తు వచ్చాడు అతనికి.

ఒక అమ్మాయి రైలు ఎక్కి పావనరావు ముందు కూర్చుంది.

"జాగ్రత్తగా వెళ్ళు తల్లీ .. విజయవాడలో మీ ఆయన వచ్చి దింపుకుంటాడులే ... పగటి ప్రయాణమే కదా అని నేను రావటంలేదు..." అంటూ ఆ అమ్మాయితో చెప్తున్నాడు ప్లాట్‌ఫారం మీద నిలబడ్డ వ్యక్తి. అతని వైపు చూశాడు పావనరావు.

ఆశ్చర్యం ... అతను బాలాజీ ...

"బాలాజీ ..." అన్నాడు అభిమానంతో పావనరావు.

"అరె నువ్వా!" అంటూ ప్రేమగా చేతులు కలిపాడు బాలాజీ.

"అమ్మాయ్! ... ఇతను నా స్నేహితుడు ... నీకు తోడుగా వుంటాడు ... అన్నాడు కూతురితో బాలాజీ. ఆమె పావనరావుకి నమస్కరించింది.

"మా అమ్మాయి విజయవాడ వెళ్తోంది... దారిలో ఏదైనా అవసరం పడితే ... అన్నాడు బాలాజీ.

"అలాగే నువ్వేం బెంగపడకు ... అన్నాడు పావనరావు.

ఇంతలో రైలు కదిలింది. ప్లాట్‌ఫారం మీంచి చెయ్యి ఊపాడు బాలాజీ.

రైలు వేగం పుంజుకుని గోదావరినది దాటింది.

బాలాజీతో సరిగ్గా మాట్లాడలేక పోయాడు... టైము లేకపోయింది... ఇంతకీ వాడు కోడలుకి పెళ్ళి చెయ్యగలిగాడో లేదో ఇంతవరకు!

ఈ అమ్మాయిని అడగవచ్చు గదా!

ఆమెతో పిచ్చాపాటీ మాట్లాడసాగాడు పావనరావు.

"ఏమ్మా మీ వదినెకు పెళ్ళి అయిందా?" అడిగాడు పావనరావు.

ఆమె ఆశ్చర్యపోయింది.

"వదినా?" అంది.

"మీ అన్నయ్య పోయాకా ఆమెను వివాహం చెయ్యాలని బాగా ప్రయత్నిస్తున్నాడు కదా మీ నాన్న ..."

"మీరు ఏమంటున్నారో ఏమీ అర్థం కావటంలేదు ... నాకు. నాకు అన్నయ్య ఏమిటి? మా నాన్నగారికి నేను ఒక్కర్తినే బిడ్డను ..." అంది ఆమె.

పావనరావు తల తిరిగింది.

"నువ్వు బాలాజీ సొంత కూతురివేనా?

"అవునండీ ... ఇప్పుడు రైలు ఎక్కించడానికి వచ్చిన మీ స్నేహితుడు బాలాజీ గారి సొంత కూతుర్ని. నాకు అన్నకానీ తమ్ముడు కానీ లేరు. అక్కగానీ చెల్లెలు గానీ లేదు. నేను ఒకే ఒక కూతుర్ని ఆయనకు...." అంది ఆమె ఆ మాటల్ని నొక్కి పలుకుతూ.

పావనరావు అంతా అయోమయంగా వుంది... అంటే ఆ రోజు బాలాజీ తనకు అన్నీ అబద్ధాలు చెప్పాడా? ఎందుకని?

ఆ తర్వాత అతను ఎక్కువ మాట్లాడలేదు ఆమెతో. విజయవాడలో ఆమెని క్షేమంగా ఆమె

# ఇ'వేమన'పద్యాలు




తనువు లస్థిరమని ధనము లస్థిరమని
తెలుపవచ్చు తాను తెలియలేడు
పాత్రమెఱిగి యీవి పట్టుగ నియ్యరు
విశ్వదాభిరామ వినురవేమ.

భర్త కు అప్పచెప్పాడు

* * *

కాకినాడ తిరిగి వచ్చాడన్న మాటే గానీ పావనరావు ఆలోచన నిండా బాలాజీయే నిండిపోయాడు వాడు అంత ఘోరమైన అబద్ధాలు పనికట్టుకుని తన ఇంటికి వచ్చి ఎందుకు చెప్పవలసి వచ్చిందో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు మనసులో రొద ప్రారంభం అయ్యింది దాన్ని భరించలేక తిన్నగా బాలాజీకే ఒక ఉత్తరం రాశాడు ఒక వారం తర్వాత బాలాజీ నుంచి జవాబు వచ్చింది చదివేడు ఆత్రంగా

"డియర్ పావనరావ్!

'మా అమ్మాయి నీకు చెప్పినదంతా పచ్చి నిజం నేను నీతో అన్నీ అబద్ధాలు చెప్పాను ఒకరి కోసం ఒకరు అన్నట్టు ఆరాటపడుతున్న ఇద్దరు వ్యక్తుల్ని కలపడం కోసం ఈ అబద్ధాలు ఆడాను అందుకే నేను ఈ అసత్యాలకు చింతించటంలేదు ఇంకా వివరంగా రాస్తాను

చంద్రమౌళి హైస్కూలు చదువు ఇక్కడే చదివాడు మా ఇంటి పక్కనే వుండేవాడు చాలా మంచివాడు కావడంతో నన్ను ఆకర్షించేడు అతనికి ఏ సమస్య వచ్చినా నేను తీర్చేవాడిని అందుకే నన్ను 'గురువుగారూ' అంటాడు ఆ మధ్య అతను మీ అమ్మాయిని చేసుకునే ప్రయత్నంలో నీ నుంచి వ్యతిరేకంగా విని నాకు ఉత్తరం రాశాడు ఆదుకుని ఆ అమ్మాయిని వివాహం చేసుకోవడంలో సహాయపడమని ప్రాధేయపడ్డాడు ఈ రకంగా ప్రవర్తించే కుర్రాళ్ళు ఈ లోకంలో అరుదు పెళ్ళి చేసుకుందుకు ఇతను సిద్ధపడ్డా, భర్త పోయిన కూతురికి పెళ్ళి చెయ్యడానికి సిద్ధపడని ఆ తండ్రి మీద నాకు బాగా కోపం వచ్చింది ఆ తండ్రి అజ్ఞానానికి జాలి వేసింది అప్పట్లో ఆ తండ్రివి నువ్వే అన్న విషయం నాకు తెలియదు ఆ తండ్రికి నేను నచ్చు చెప్పాలి అనుకుని కాకినాడ వచ్చాను చంద్రమౌళితో కలిసి మీ ఇంటికి బయలుదేరాను దారిలో నువ్వు నాకు కనిపించావు నా మిత్రుడిగా నిన్ను గుర్తుపట్టి పలకరించబోయేంతలో నువ్వే ఆ అమ్మాయి తండ్రివని చంద్రమౌళి చెప్పాడు ఆ సమయంలో నువ్వు నన్ను చూడలేదు

ఆ పిల్ల తండ్రివి నువ్వే అని తెలిశాకా ఒక పథకం వేశాను నిన్ను ఇంటి దగ్గర కలిశాను కట్టు కథ కల్పించి పరోక్షంగా నీ మీద ప్రభావం చూపేను నువ్వు తప్పకుండా మారతావని నాకు నమ్మకం కలిగింది ఆ తర్వాత లేచి వచ్చేశాను నువ్వు నాకు తెలిసిన వాడవు కనుక వెతుక్కుంటూ వచ్చి సలహా ఇవ్వడానికి నా మనస్సు అంగీకరించక పోవడం వల్ల ఈ అంతర్నాటకం ఆడేను అది ఫలించిందని చంద్రమౌళి ఉత్తరం ద్వారా తెలుసుకుని ఆనందించాను తన పెళ్ళికి నన్ను రమ్మని అతడు కోరేడు కానీ ఈ నాటకం అప్పుడే బయటపడటం నాకు ఇష్టంలేక రాలేదు

ఈ ఉత్తరం చదివేక నా మీద అభిమానం పెంచుకుంటావో లేక కోపంతో అసహ్యించుకొంటావో నాకు తెలియదు మొదటిది జరిగితే సంతోషిస్తాను రెండోది జరిగితే బాధపడను

ఒక విషయం గుండెల మీద చెయ్యి వేసుకుని ఆలోచించు జరిగిపోయిన విషాదం అనుక్షణం గుర్తు చేస్తూ, పసుపుకుంకుమలకు దూరమై, నీ కళ్ళ ముందు నీ కూతురు తిరుగుతూ నీ గుండెల్లో బాధాగ్ని రగుల్చుతుంటే బాగుంటుందా లేక దూరమైన పసుపుకుంకుమలు తిరిగి సంపాదించుకుని, అల్లుడితో హాయిగా, మాయని చిరునవ్వుతో కాపురం చేసుకుంటుంటే బాగుందా?

జవాబు రాయి

నీ మిత్రుడు,
బాలాజీ."

ఉత్తరం చదివిన పావనరావు కొంచెంసేపు ఆలోచించాడు

అతని పెదవులపై చిరు దరహాసం ప్రత్యక్షమైంది.

థాంక్స్ బాలాజీ! నా కళ్ళు తెరిపించి నా కూతురు జీవితం బాగుపడడానికి కారణం అయ్యావు నీ మేలు మరిచిపోలేను " అనుకున్నాడు

బాలాజీకి ధన్యవాదాలు తెలుపుతూ ఉత్తరం రాయడానికి కూర్చున్నాడు పావనరావు □

సీరియల్:

# జిగి-బిగి

ఎమ్.హరా

(గత సంచిక తరువాయి)

రెండో నెంబర్ ప్లాట్‌ఫారం మీద శ్రీమతి సాధ్వి పూర్వానుభవంగల శోభనపు పెళ్ళి కూతురిలా నిల్చుంది ఎవరైనా వెండి రూపాయి కొంగున ముడివేస్తే వాళ్ళవెంటపడే మరబొమ్మలా వుంది ఆమె చుట్టూ వున్న కిరాయి జనాభా (కుమారి అహల్యని ఆహ్వానించడానికి వచ్చిన బాపతు) దంపత్ తాంబూలాలు స్వీకరించడానికి వచ్చిన దంపతుల్లా సరస చలోక్తులతో బంతి ఆట ఆడుతున్నారు

ఆ శోబనపు సందడికి అతి చేరువలో నిల్చున్న అమ్మడు బిత్తర చూపులు చూస్తున్నది వౌరాలో వస్తున్న అహల్య గురించి ఆమె ఆలోచించడంలేదు యింటి దగ్గరున్న తాతయ్య గురించి మథన పడుతోంది తాతయ్యకి మంచి మందులు యిప్పించాలంటే డబ్బుకావాలి అహల్య విజిట్ పూర్తి కాగానే రెండు వందలిస్తానంది సాధ్వి డబ్బు చేతికి అందగానే తాతయ్యకి వైద్యం చేయించాలని ఆమె ఆలోచిస్తున్నది

అంతలో గంట మ్రోగడం, రైలు రావడం. వొకేసారి జరిగాయి ఫస్ట్‌క్లాసు కంపార్ట్‌మెంట్ దగ్గరికి పరిగెత్తారు సాధ్వి అండ్ కిరాయి జనం

నెత్తిపై పెద్ద కుండ బోర్లించినట్లు కొప్పు ఆ సవరాల పుట్టలో బుట్టెడు పూలు స్లీవ్‌లెస్ జాకెట్ దాచలేని టీకామచ్చలు బాగా వెలిసిపోయిన నల్లరంగు సిల్క్ శారీపై పోగులు వూడిన చెమ్కి పూలు కుడిచేతికి ఆగిపోయిన రిస్టువాచీ ఎడమ చేతికి కంకణంలా గోల్డ్ కవరింగ్ గాజు భుజానికి తగిలించిన హేండ్‌బాగ్‌లో గత శతాబ్దంనాటి మాగ్జైన్స్ నీలిరంగు చవక రకం కళ్ళద్దాలు చికాకు కలిగించే సెంట్ వాసనతో స్టేషన్ అంతా కలియ జూస్తూ, కంపార్టుమెంట్‌లోంచి దిగడానికి ఒక స్త్రీ ప్రయత్నిస్తున్నది

ఆమెని చూడగానే 'వారే వారే అంటూ దొంగ పట్టుకోండి అన్నంత స్పీడుగా ఎలుగెత్తి అరిచింది సాధ్వి దొంగని దొంగే పట్టుకోగలదు

**జరిగిన కథ—2 సీనియర్ క్లర్క్స్ పరీక్ష రాయడానికి వెళుతున్న అమ్మాయికి అదే పరీక్ష రాయడానికి వెళుతున్న బక్కపాలెం అబ్బాయి ఎదురుపడి పరీక్ష సెంటర్‌కి దారి అడిగాడు అతనిని తప్పు త్రోవ పట్టించి పరీక్షకి వెళ్ళిన అమ్మాయికి పరీక్ష కాన్సిల్ అయ్యేటప్పటికి బక్కపాలెం అబ్బాయిని మోసం చేసినందుకు తగిన శాస్తి జరిగిందని అనుకుంటుంది 'ప్రజాసేవ కంపెని' నడుపుతూంటాడు ఉభయానందం పెళ్ళి చేసుకోని, నాలుగు పుష్కరాలు దాటిన ఉభయం తన పిన తల్లి మనుమరాలు సౌభాగ్యవతిని చేరదీశాడు సౌభాగ్యానికి పెళ్ళి చేసి ఆమె భర్తని దత్తత చేసుకోవాలని ఉభయం కోరిక సూర్యనారాయణ మనుమరాలు అమ్మాయి బి ఎ పాసై ఉద్యోగాన్వేషణలో ఉంది సౌభాగ్యం, చిరంజీవి ప్రేమించుకున్నారు**

కపార్ట్‌మెంట్‌లోంచి దిగిన స్త్రీ మెడలో దండలు వేశారు కిరాయి జనం

నాస్టి నాస్టి అంటూ అతి నాజుగ్గా ఆంగ్లంలో విసుక్కుంది కొప్పు

కుమారి అహల్యా వర్ధిల్లాలి

స్త్రీలకైపాటుబడే ఏకైక స్త్రీ వర్ధిల్లాలి

చప్పట్లు చరుస్తూ రకరకాల నినాదాలు చేస్తున్న జనం కన్నుగప్పి శ్రీమతి సాధ్వి వర్ధిల్లాలి అని గట్టిగా అరిచింది సాధ్వి వెంటనే ఆమె బజన ప్రారంబమయింది

ఆ అరుపులకీ, దండలకి దద్దరిల్లిన స్లీవ్‌లెస్ జబ్బ పట్టుకుని ఎక్స్యూజమీ అయామ్ మిస్ అమ్మడు పార్ట్ టైం కన్సల్టింగ్ సెకరెట్రి, టు శ్రీమతి సాధ్వి ఫౌండర్ అండ్ ప్రసిడెంట్ ఆఫ్ ప్రమదా మండలి యూత్ లేడీస్ క్లబ్ విడోస్ హమ్ అండ్ ఆవిన్ సెంటర్ వుయ్ ఆర్ వెరీగ్లాడ్ టు రిసీవ్ యు — అంటూ యింకా పదే పదే చెడామడా పేలుతునే వుంది అమ్మడు

సాధ్వి అండ్ జనం వేలం వెర్రిగా నినాదాలు చేస్తూ నమస్కరిస్తున్నారు అంతలో కంపార్టుమెంట్‌లోంచి దిగిన టికెట్ ఎగ్జామినర్ యాదాలాపంగా ఆ గుంపుకేసి చూసి ఎవరో గొప్పవారని తాను నమస్కరించబోయి నెత్తిమీద కుండని చూడగానే అదిరిపడ్డాడు

ఏమిటీ గోల నినాదాలు ఆపండి ఈవిడ ఎవరు? దండలెందుకు వేశారు? అంటూ జనాంతికంగా రకరకాల ప్రశ్నలు వేశాడు టికెట్ ఎగ్జామినర్

కుమారి అహల్య మంచి పలుకుబడి గల స్త్రీ యువరాజకీయ నాయకుడికి కాబోయే భార్య

'మన వూరిలోని ప్రమద మండలి, అనాధశరణాలయం, లేడిస్‌క్లబ్, వగైరా స్త్రీ సంస్థలు తనిఖీ చేసి డొనేషన్లు మంజూరు చేయడానికి వచ్చిన దేవతకుమారి అహల్య

'మీకీ విషయం తెలియదా? అహల్య ఈ రోజు హవురాలో వస్తున్నట్లు స్థానిక దినపత్రికలలో మీరు చదవలేదా

కిరాయి జనం ఈటిలులాంటి మాటలతో టికెట్ ఎగ్జామినర్‌ని బాధించసాగారు ఆ దెబ్బలకి తట్టుకోలేక అతనొక అతిక్రూరమైన నిజం చెప్పాడు

'యిది హవురా ఎక్స్‌ప్రెస్సే కానీ యిది మొన్న రావలసినది ఈ రోజు వచ్చింది ఈ రోజు రావలసిన బండి ఎల్లుండి వస్తుంది

మరి మరి ఈవిడ' తడబడింది సాధ్వి ఆమె కలలో కూడా అహల్యని చూడలేదు

టికెట్ లేకుండా ప్రయాణం చేస్తున్న కొప్పు కంపార్ట్‌మెంట్ డోర్ దగ్గర నిల్చుని తన కంపెనీ జనం ఎవరైనా కనబడుతారేమోని ఆశగా ఎదురు చూస్తున్నది ఆమె కంటికి సాధ్వి బజారు సరుకులా కనబడింది ఏ కంపెనీ తాలుకాని సాధ్విని గురిపెట్టి చూడసాగింది కొప్పు ఆ చూపులికి ఆమె అహల్యని అపోహపడింది సాధ్వి

'టికెట్‌లేని ఫస్ట్‌క్లాస్ పాసింజర్"

టికెట్ ఎగ్జామినర్ మాటలు పూర్తి కాలేదు ఎంత స్పీడ్‌గా కొప్పు మెడలో దండలు పడ్డాయో అంతకు రెట్టించిన వేగంతో తెగిపోయాయి

పద పద అంటూ నలుపు చీరెని అదిలించాడు టి ఇ

ఎక్కడికీ అంది ముద్దుముద్దుగా స్లీవ్‌లెస్

'నీకు తెలియదా అంటూ గడుసుగానే సరసాలు ఆడుతూ ఆమెని తోలుకెళ్ళాడు టికెట్ ఎగ్జామినర్

ఈ గలబా, ఈ అవమానం తనకి జరుగుతున్నట్లు ఫీలవుతూ పరుగులాంటి నడకతో స్టేషన్ నుంచి బయటపడింది సాధ్వి కూలి కోసం ఆమె వెంట పడ్డారు జనం

స్టేషన్‌లో వొంటరిగా మిగిలింది అమ్మడు ఆమె ఆశ అడియాశ అయింది శిరో వేదన భరించలేక కాఫీ తాగడానికి కాంటిన్‌కి వెళ్ళింది

'కాఫీ' అంటూ అర్ధ రూపాయి నిచ్చిన గులాబీల గుత్తి లాంటి ఆమె చేతిని

చూస్తూ తల పైకెత్తాడు అబ్బాయి అతన్ని చూడగానే సంభ్రమాశ్చర్యాలతో వొంట్లోని రక్తమంతా జరజరా పాకి అరచేతిలోకి వచ్చినట్లు వీలయింది అమ్మడు

ఆ అరుణిమని చూస్తూ మీరా అన్నాడు అబ్బాయి మృదువుగా, మదురంగా అతని చేతిలో టోకెన్ తుమ్మెదలా తొందర పడుతున్నది నేనే అంటూ పూల తీగెల పొదలాంటి తన చేతిని వెనక్కి తీసుకోలేక కళ్ళతో సిగ్గుని చిలకరించి చివాల్న టోకెన్ అందుకుంది అమ్మడు

గుప్పెట్లోకి వచ్చిన వెన్నెల చేయి జారిపోయినట్లు ఆమె వంక చూశాడు అతను

ఆమె కాఫీ కప్పుని అందుకుని హంసగమనంతో రెండు కుర్చీల ఖాళీగా వున్న టేబుల్ దగ్గరకి వచ్చింది కుర్చీలో కూర్చుంటూ సన్నజాజి పలువరసతో ముగ్ధమనోహరంగా అబ్బాయిని ఆహ్వానించింది

అబ్బాయి తబ్బిబ్బై కాష్‌కౌంటర్‌లో కూర్చోలేక ఆ పనిని అర్జంట్‌గా పక్కవాడికి అంటగట్టాడు

గోరంత ఆలిశ్యం కొండంత నిరాశ కలిగిస్తుందని తన హేండ్‌బాగ్‌ని ఖాళీ కుర్చీలో పడేసింది అమ్మడు అతని కోసం సీటు రిజర్వు చేసింది ఆమె ఎంత బీదదైనా వయసుకి మాత్రం దనవంతురాలే అతను కూర్చుంటూ థాంక్స్ చెప్పాడు

సారీ మిమ్మల్ని మోసం చేశాను తూర్పు వీధికి పంపించాను అందామె సన్నసన్నగా

మిమ్మల్ని నమ్మాను గాబట్టే అంత సులబంగా మోసం చేయగలిగారు

యిప్పుడూ నన్ను నమ్ముతున్నారా

యిప్పుడేంటీ? జీవితాంతం మిమ్మల్ని నమ్ముతాను

వాళ్ళిద్దరి మధ్య ప్రేమ తీగెలు అతిసులభంగా అల్లుకుంటున్నాయి

మీరీ కాంటిన్‌కి కంట్రాక్టరా అతని గురించి ఆరాలు ప్రారంబించింది అమ్మడు

'మీ ఆడవాళ్ళకి ఆశలు ఎక్కువ మందహాసం చేశాడతను

ఆశ లేకపోతే మనిషికి మనుగడే వుండదు

'అక్షరాలా నిజం నాకిప్పుడు కాఫీ తాగాలని వుంది మీరు ఆఫర్ చేస్తారని ఆశ

విత్‌ప్లజర్ అంటూ సాసర్‌లో కొంత కాఫీని వొంపి కప్పుని అతనికిచ్చింది

థాంక్యూ అంటూ అతను కప్పుని అందుకున్నాడు

యిద్దరూ కాఫీని సిప్ చేస్తూ కళ్ళతో ప్రేమించుకోసాగారు ప్రేమికుల కలల్లోకి కూడా కులాలూ, అంతస్తులు అడ్డువచ్చి మధురమైన కలలు కూడా ప్రేమికులకి దక్కనీయవు

అబ్బాయిగారూ మీరిక్కడ వున్నారా? వెంటనే మండీ కెళ్ళి కరివేపాకు,



# జిగి బిగి

అల్లం తేవాలి మిమ్మల్ని అద్దే సైకిల్ మీద వెళ్ళి రమ్మన్నారు అక్కడ పాపు మాడిపోతున్నది తొందరగా వెళ్ళండి అని క్లీనర్ గాండ్రించగానే బాహ్యాలో కానికి వచ్చారు అబ్బాయి, అమ్మాయి

వస్తానండీ నేను అన్నపూర్ణా కేఫ్‌లో బిల్లులు రాసే గుమాస్తాని ఈ కాంటిన్ కూడా వాళ్ళదే మిమ్మల్ని మరోసారి కలిసే అదృష్టం లభించింది దాంక్స్ అంటూ లేచాడు అబ్బాయి

మాత్సతో ఎం ఏ చేసి హొటల్లో బిల్లులు రాస్తున్నారా? సానుభూతిగా అతని వంక చూసింది అమ్మడు

ఏదో విధంగా పొట్ట నింపుకోవాలి కదండీ అన్నాడతను ఆమె వంక ప్రేమపూర్వకంగా చూస్తూ

మీరెక్కడుంటున్నారు అందామె ఆరాధనా పూర్వకంగా అతని వంక చూస్తూ

అతను జవాబు చెప్పే అవకాశం యివ్వకుండా మార్కెట్‌కి వెళ్ళమని తొందర చేశాడు క్లీనర్

6

బక్కపాలెం బస్టాండులో బస్ ఆగింది కీడెంచి మేలెంచమన్నారని ఎడమకాలు ముందు పెట్టి బస్ దిగాడు ఉభయానందం నేరుగా ప్రజాపతి యింటికి దారితీశాడు

ఆ యిల్లు నిర్మానుష్యంగా వుంది ప్రజాపతి భార్య అనారోగ్యంతో కన్నుమూసి పది సంవత్సరాలు దాటింది వొక్కగానొక్క కొడుకు అబ్బాయి అయన్ని విడిచి వెళ్ళిపోయాడు యిక ఆయన మాత్రం సర్పంచ్ పదవిని వదులుకోలేక యింకా కుర్చీలో కునికిపాట్లు పడుతూనే వున్నాడు

బెడ్ రూంలో నరసరావుపేట పడక కుర్చీలో కోడి నిద్రపోతున్న ప్రజాపతిని తట్టి నిద్ర లేపాడు ఉభయం

రత్నపతి మనుమలు ధనపతి కుమారులు, బక్కపాలెం సర్పంచ్ ప్రజాపతి గారికి ప్రజాసేవ కంపెనీ ఉభయం భక్తిపూర్వకంగా నమస్కారం చేస్తున్నాడు అంటూ ఆయనకి పాదాభి వందనం చేసి పాద ధూళిని కళ్ళకి అద్దుకుని తలపై వేసుకున్నాడు ఉభయం

ఎవరూ? నువ్వా ఉభయం నీ కోసమే ఎదురు చూస్తూ యిప్పుడే యిలా కళ్ళు మూశాను నీకింకా బ్రిటిష్ కాలంనాటి వాసనలు పోలేదు నీ పిచ్చిగాని నా కాలి మట్టిలో ఏముందయ్యా అని పైకి అన్నాడేగాని లోపల అతి గుప్తంగా అతిశయంతో ఆనందపడుతున్నాడు ప్రజాపతి

ఇతరులని శాసించి, బానిసలుగా సృష్టించి, పాలించే ఆధిక్యత తమకి పుట్టుకతోనే వచ్చిందనే దిలాసా పుష్కలంగా వున్న ప్రజాపతి బంధుకోటి అంతా రాజకీయ నాయకులే

ఆయన అన్నయ్య మాజీ మంత్రి బావగారిని శ్రీ వేణుగోపాలస్వామి టెంపుల్ మేనేజింగ్ ట్రస్టీగా కోర్టువారు తొలగించారు దివాలా తీసిన సహకార సంఘానికి తమ్ముడు ప్రెసిడెంట్ వొక్క వోటు తేడాతో సమితి ప్రెసిడెంట్ అయిన బావమరిది యివాళో రేపో దిగిపోయేట్టు వున్నాడు మునిసిపల్ చైర్మన్‌గా ఎన్నికైన తోడల్లుడి కౌన్సిలర్ ఎన్నిక కోర్టులో పెండింగ్‌లో వుంది అనారోగ్య కారణాల వల్ల పదవీ బాధ్యతలు నిర్వహించలేని మేనమామ గ్రంథాలయ సంస్థకి అధ్యక్షుడు యికపోతే ఎలిమెంటరీ స్కూల్ చదువుని పూర్తి చేసిన చెల్లెలు కాలేజీ కమిటీకి సెక్రెటరీ పినతండ్రి ఎం ఎల్ ఏ గా పోటీ చేసి డిపాజిట్ పోగొట్టుకుని కొత్త పార్టీని పెట్టాడు

అన్నన్న అలా అనకండి బంగారం మట్టిలో దొరుకుతుంది బంగారం కోసం కోలార్ వెళ్ళవలసిన పనిలేదు మీ కాళ్ళని ఆశ్రయిస్తే అసలు సిసలైన బంగారం దొరుకుతుంది నన్నెందుకు పిలిపించారో శెలవిస్తారా అంటూ చేతులు కట్టుకుని అతి వినయం అభినయించాడు ఉభయం

నా బెంగంతా మా అబ్బాయి గురించే' అంటూ గుటుక్కుమని రెండు మాత్రలు మింగి నీళ్ళు తాగాడు ప్రజాపతి

ఉద్యోగాల వేటకై అబ్బాయిగారు హైదరాబాదు వెళ్ళారని విన్నాను

నేనూ అలానే అపోహపడ్డాను కాని వాడు మీ వూర్లోనే పరంధాముడి యింట్లో వుంటూ, అన్నపూర్ణ కేఫ్‌లో బిల్లులు రాస్తున్నాడు

అన్నన్న ఎంత అపచారం జరిగింది సరస్వతితో సరసాలు ఆడడానికి నాలుగు ముఖాల బ్రహ్మ తెగ యిబ్బంది పడుతూ, చిక్కాకుపడుతూ, మన అబ్బాయి నుదుటన అవాకులు చవాకులు రాశాడే అనుకోండి ఆ పరదాముడు యిల్లు ఎలా అద్దెకిచ్చాడు? అన్నపూర్ణ ఎలా లెక్కలు రాయిస్తున్నది అంటూమండిపడుతూ లక్కోలాల్చీని విదిల్చాడు ఉభయం

పరోక్షంగా నేనే చేశాను శ్రీ ప్రజాపతి కుమారులు, ఈ పంచాయితికి యువరాజైన అబ్బాయిగారు రైలుస్టేషన్‌లో కాలకృత్యాలు తీర్చుకుని, ఫుట్‌పాత్‌పై భోంచేస్తున్నారని నలుగురికీ తెలుస్తే నాకెంత నామర్దా అందుకే లోపాయికారిగా మా వాడికి తిండీ, నీడా కరువులేకుండా చేశాను ఈ సంగతి వాడికి తెలియదు అంతా తన ప్రయోజకత్వమే అనుకుంటున్నాడు అంటూ బట్టతలని నిమురుకుంటున్న ప్రజాపతి సి విటమిన్ టాబ్‌లెట్‌ని చప్పరిస్తున్నాడు

మీ తదనంతరం ఈ వూరిని ఏలవలసిన అబ్బాయిగారు ఎందుకిలా దారుణంగా మారిపోయారు గంజాయి వనంలో తులసి మొక్కలా ఎలా పెరిగారు సారీ

అంతా నా చేజేతులారా చేసుకున్నాను ఇంగ్లీషులో సంతకం పెట్టే శక్తి రాగానే చదువుకి స్వస్తి పలికి మా అబ్బాయిని రాజకీయాలలో నాటితే ఈపాటికి బాగా ఏపుగా సెంట్రల్ నాయకుడిగా ఎదిగేవాడు ఏకైక వంశోద్ధారకుడని, తల్లిలేని వాడని అతి గారాబం చేశాను సిటీ చదువులు, స్నేహాలు మావాడి మనసుని విరిచేశాయి

మన బంగారం ఎంత మంచిదైనా కంసాలి దగా చేయకపోతే మనకి మేలిమి బంగారపు నగలు వస్తాయి మిమ్మల్ని దగా చేసింది కాలేజీ చదువులు, స్నేహాలే గాని మీ అబ్బాయి కాదు ఇంతకీ అబ్బాయిగారు యిల్లు విడిచి ఎందుకు వెళ్ళారో తెలుసుకోవచ్చా'

చేతి నిండా పని తగులుతున్నందుకు తనివితీరా ఆనందిస్తున్నాడు ఉభయం ప్రజాపతి ఏదో టానిక్ తాగి రెండు మాత్రలు మింగి తాపీగా అన్నాడు

మీరెప్పుడైనా కాలేజీ, హాస్టల్ గోడలు చదివారా? వాల్ లిటరేచర్ చదివారా? చదవలేదా? అయితే వినండి దొంగ వ్యాపారులు సరుకుల కృత్రిమ కొరతని సృష్టించి పేద జనాభాని కాల్చుకు తింటున్నారుట సమరశీల ప్రజల ఆచూకీ తెలియకుండా దాచేస్తున్నారుట డబ్బున్న లంజకొడుకులకి పేదింటి ఆడబడుచులని రేప్ చేయడం హాబీట దినచర్యట బలహీనవర్గాలపై విచ్చలవిడిగా జరుగుతున్న దోపిడీని అరికట్టాలిట స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలని ఖండించాలిట ధనిక వ్యవస్థని కూనీ చేయాలిట యింకా ఎన్నెన్ని చెప్పను అర్థం పర్థంలేని అనువాద విజాతీయ నినాదాలు ఈ నినాదాలే మా వాడిని నాకు కాకుండా చేశాయి

కాలేజీ ఎగ్గొట్టి మళయాళం మార్నింగ్ షోలు చూసి లాడ్జింగ్ కంపెనీలకు వెళ్ళే డబ్బున్న కుర్రాళ్ళని చూశాను గానీ మీ అబ్బాయిగారి లాంటి వాళ్ళని చూడలేదు

నేనీ ఆస్తిని అన్యాయంగా సంపాదించానట వాడి తల్లి అనారోగ్య మరణానికి కారణం నేనేనట పేదల రక్తమాంసాలతో కట్టిన ఈ యింట్లో వుండలేడుట నీతిగా న్యాయంగా తన బ్రతుకేదో తాను బ్రతుకుతానని వెళ్ళాడు వెళ్తూ వెళ్తూ నాలాంటి దోపిడీదారులకి అంత్యకాలం అతి చేరువలో వుందని హెచ్చరించాడు అంటూ బట్టతల నిమురుకుంటూ సిగరెట్ వెలిగించాడు ప్రజాపతి

మీపై పగబట్టిన అబ్బాయిగారి యోగక్షేమాల పట్ల మీరు అత్యంత శ్రద్ధ చూపిస్తున్నారు మీ ఔదార్యాన్ని పొగిడే సమయం కాదిది మీ అబ్బాయిగారి మనసు తిప్పేసి ఈ వూరికి సర్పంచ్ చేస్తాను బీద ఆకలిని మరిచి సెక్స్ ఆకలిని రెచ్చగొట్టడానికి కచికలాంటి కన్నెపిల్లని మీ అబ్బాయిపై వుసిగొల్పుతాను

ఆగవయ్యా, ఆగు అటువంటి చిల్లర వేషాలు వేసి చిత్తుగా







వోడిపోయాను బూతు కతలు చదివి వినిపించాను బ్లూ సినిమాలు యింట్లోనే వేయించాను గుర్రప్పందాలు, పేకాట నేర్పడానికి ప్రయత్నించాను బ్రాందీ అలవాటు చేయబోయాను కేబరే డాన్సులు చూపించాను మా అబ్బాయి దేనికీ లొంగలేదు వాడికి దుర్వసనాలు నేర్పబోయిన నేను పూర్తిగా చెడిపోయాను యిప్పటికీ మందులు వాడుతూనే వున్నాను కర్మ కర్మ అంటూ మళ్లీ నాలుగు మాత్రలు మింగాడు ప్రజాపతి ఉబయానికి నోట మాట రావటంలేదు

మా అబ్బాయి పోలీసు ఆపీసర్ అయినట్లు, నా చేతులకి సంకెళ్ళు వేస్తున్నట్లు, నన్ను వురితీస్తున్నట్లు కలలు వస్తున్నాయి మా వాడికి మంచి ఉద్యోగం రాకుండా నా పలుకుబడి అంతా ఉపయోగిస్తున్నాను లంచాలు కూడా యిస్తున్నాను అందుకే వాడికింతవరకు జాబ్ దొరకలేదు అన్ని రోజులు మనవి కావుగా వచ్చే సోమవారం ఉదయం ఎనిమిది గంటలకి మా అబ్బాయి ఇంటర్వ్యూకి వెళుతున్నాడు వాడా యింటర్వ్యూకి వెళ్ళకుండా చేయాలి అందుకే నిన్ను ఎలిపించాను

యింటర్వ్యూకి వెళ్ళినంత మాత్రాన ఉద్యోగం వస్తుందా

వస్తుంది యిదంతా అపోజిషన్ కుట్ర సోమవారంనాడు ఇంటర్వ్యూ కండక్టు చేసే సెలక్షన్ కమిటీ అయిదుగురు మెంబర్లలో నలుగురు అపోజిషన్ గ్రూపుకి దగ్గర బంధువులు మా అబ్బాయిని తప్పకుండా పోలీస్ ఆఫీసర్‌గా సెలక్టు చేస్తారు నన్ను అరెస్టు చేయిస్తారు సర్పంచ్ పదవిని కాజేస్తారు అందుకని మా వాడు ఇంటర్వ్యూకి వెళ్ళకూడదు ఎంత ఖర్చయినా పరవాలేదు నువ్వీ సహాయం చేయాలి

మీ అబ్బాయిగారు ఇంటర్వ్యూకి వెళ్ళకూడదు అంతేగా స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలు మీ అబ్బాయిగారి ఆశయం అయితే కాచుకోండి ' సాలోచనగా అంటున్న ఉబయం పెదవులపై చిరునవ్వు మెరిసింది

మా వాడికీ జన్మలో ఉద్యోగం రాకూడదు హెూటల్లో బిల్లులు రాసి రాసి విసుగెత్తి, చాలీచాలని ఆదాయపు జీవితానికి స్వస్తిపలికి నా పంచన చేరాలి ఈ వూరిని ఏలాలి ఆవేశంగా అంటున్నాడు ప్రజాపతి

## 7

ఆదివారం ఉదయమే తన ప్లానుని ఎటువంటి దాపరికం లేకుండా సౌభాగ్యవతి చెవిలో వూదేశాడు ఉభయానందం

పది లక్షల ఆస్తికి ఏకైక వారసుడు అబ్బాయి అతని బంధువులంతా నాయకులే నువ్వా బంగారు పిచుకని వరించాలి తండ్రి అంటే గిట్టని అబ్బాయిని మంచి చేసుకుని దత్తత చేసుకుంటాను తద్దినాలు పెట్టించుకుంటాను

సోమవారం అంటే రేపు తెల్లవారు యూమున నువ్వు పాలపాకెట్ తెస్తూవుంటే మన రౌడీలు వెంబడిస్తారు నువ్వు ( ...యి రూంలోకి చొరబడుతావు నిన్నెవరో రౌడీలు తరుము కొస్తున్నారని గువ్వలా అతని కౌగిలిలో వొదిగి పోతావు భయపడకు వౌస్ వోనర్ పరంధాముడు నిన్నోకంట కనిపెడుతూనే వుంటాడు శారీరకంగా బలహీనులైన స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలకి కృద్ధుడైన అబ్బాయి నిన్ను మరింత గట్టిగా కౌగలించుకుని వోదారుస్తూ ధైర్యం చెబుతాడు నువ్వీ అవకాశాన్ని చేజిక్కించుకుని అతన్ని ప్రేమ ముగ్గులోకి లాగి పెళ్ళి మార్గంలోకి తీసుకురావాలి

సిగ్గూ ఎగ్గూ లేకుండా హితబోధ చేస్తున్న ఉభయాన్ని తిరస్కారభావంతో త్రిప్పికొట్టలేక పోయింది సౌబాగ్యవతి బాబయ్య మాట కాదంటే గుంటూరు వెళ్ళాలి చిరంజీవికి దూరం కావాలి యిక్కడే వుంటే అబ్బాయిని వరించాలి ఏం చేయాలో పాలుబోక అమ్మడిని సలహా అడిగింది సౌభాగ్యవతి

వంటాముదం తాగినట్లు మూగగా వుండే బదులు ఆ ఆముదమే తాగితే మీ బాబయ్య నీకేపని చెప్పడు ఎక్కడికీ పంపించడు అంటూ అపాయంలేని ఉపాయం చెప్పింది అమ్మడు

సౌబాగ్యం పావులీటర్ వంటాముదం గడగడా తాగేసింది లెట్రిన్ దగ్గర నలుక మంచం వేసుకుని పడుకుంది

ఆ రోజు రాత్రి వేళ యిదెక్కడి గోలని లబోదిబోమని తలని బాదుకుంటూ అతి గుప్తంగా అబ్బాయి పనిని అమ్మడికి అప్పగించాడు ఉభయానందం

అతికీ అతకనట్లు వొక కట్టుకథ చెప్పి అబ్బాయి రేపు ఉదయం పదిగంటల వరకు రూం గడపని దాటనీయకూడదు వివరాలు నీకు అనవసరం అతను నిన్నేమి అల్లరి పెట్టకుండా పరంధాముడు కాపలా వుంటాడు నీ భద్రతకి అన్ని ఏర్పాట్లు చేశాను నీ పేరు అమ్మాయి కాదు సౌబాగ్యవతి అవగింజంత ప్రేమ నటించి అతన్ని ఆకట్టుకోవాలి శృతిమించ కూడదు యిది పెద్దవాళ్ళతో వ్యవహారం

కావాలని ఆపదలు కొని తెచ్చుకోవడ మెందుకని మా తాతయ్య ఆరోగ్యం అంతంత మాత్రంగా వుంది నేనెక్కడికీ వెళ్ళలేను అంటూ గొణిగింది అమ్మడు

చారునీళ్ళకీ, అల్లం కషాయానికి జబ్బులు నయం కావు నేను చెప్పినట్లు గుట్టు చప్పుడు కాకుండా ఈ పని చేస్తే రెండు వేలిస్తాను మీ తాతయ్యకి మంచి వైద్యం చేయించ వచ్చును ఆమెకి బాగా డబ్బాశ చూపాడు ఉభయం

మనస్సేదో కీడు శంకిస్తున్నా, తాతయ్య క్షేమంకోరి, రెండువేల ఆశతో, బండబారిన గుండెతో ఉభయం ప్లాన్ అమలు పరచడానికి సిద్ధపడింది అమ్మడు

* * * * * *

తాలుకా ఆఫీసులో ఆరు గంటలు కొట్టారు తెల్లవారిందని సుప్రభాత గీతాలు కూయసాగింది రేడియో అప్పుడే తెల్లారిందాని బాధగా ములిగాయి డబల్‌కాట్‌లు మార్నింగ్ వాక్‌కై యింటి నుంచి వూరి చివర చెరువు దగ్గరకి కార్లపై, స్కూటర్లపైవచ్చిన లంబోదరులు, నెలలు నిండినట్లు పొట్టని పెంచిన మగధీరులు, తెల్లారి పోతోందని చెరువుగట్టుపై పరుగులు తీస్తున్నారు

అమ్మడు పాల పాకెట్‌ని చేతులు మార్చుకుంటూ మంచు తెరల్ని చీల్చుకుంటూ గబగబా నడుస్తున్నది ఆమె నీడలా రౌడీ బీడీలు కదులు

## జిగి బిగి

తున్నాయి రోడ్డుపైజన సంచారం లేదు చలికాలపు రోజులు

అమ్మాయిగారూ ఆ పచ్చ డాబాయిల్లే పరంధాముడిది అంది రౌడీ బీడి

ఆ యింటిని తేరిపార చూసి నుదట మీదికి ముంగుర్లు లాక్కుంది పాల పాకెట్‌ని కొంచం చింపింది పరుగులాంటి నడకతో ఆ యింట్లోకి ప్రవేశించి గబగబా మేడ మెట్లెక్కి హెల్ప్ హెల్ప్ అని సన్నగా అరిచింది అమ్మడు, బయం, భయంగా చూస్తూ

ఆ మేడమీది గది తలుపులు బార్లా తెరిచి వున్నాయి ఇండియా టుడేని వల్లె వేస్తున్నాడు అబ్బాయి అబ్బాయిని చూడగానే ఆమె నోట మాట ఆడలేదు మాటలకి అందని ఆనందంతో ఆమె మనసు నాట్యం చేసింది

పాల పాకెట్‌లోంచి పాలు కారుతూనే వున్నాయి పొగ మంచు కురుస్తూనే వుంది ఆమె పాలుగారుతున్న వెన్నెల బొమ్మలా వుంది మంచు బిందువులతో నిండిన పారిజాతంలా వుంది సన్నగా వీస్తున్న మలయ మారుతంలా వుంది ఎర్రబడుతున్న తూర్పు దిక్కులా వుంది

రెప్పలార్పకుండా ఆమెని చూస్తున్న అబ్బాయి స్వప్న లోకంలో విహరిస్తున్నట్లు తన్మయత్వంతో మత్తుగా మదురంగా అన్నాడు

మీరా

నేనే అందామె మనోహరంగా

మీరా

మనమిలా మినీ డ్యూయెట్‌సాంగ్ పాడుతూ వుంటే రౌడీలు పైకి వస్తారు అంటూ రెండు అంగల్లో పిట్టగోడని సమీపించి 'నాకేం బయం లేదు మీరు వెళ్ళండని రౌడీలకి సంజ్ఞలు చేసింది అమ్మడు

రౌడీలా? ఎక్కడ? పాలన్ని యిక్కడ వొలకపోశారేం? నా రూం మీకెలా తెలుసు? అయినా తెల్లారకుండానే వచ్చారేం? అంటూ గబగబా ఆమె చుట్టూ తిరుగుతూ, అదే వేగంతో ప్రశ్నల వర్షం కురిపించాడు అబ్బాయి

ఉబయానందం పథకం వివరించింది అమ్మాయి

అయితే నన్ను తూర్పువీదిక ఉబయం ప్లాను ప్రకారం పంపారా అన్నాడతను సాలోచనగా

నో నో ఆ సంఘటన కేవలం యాదృచ్ఛికం అంతా నా అల్లరి నా మాట నమ్మాలి

నమ్ముతున్నాను అయినా మీ రెందుకింత సాహసం చేస్తున్నారు అన్ని వేళలు మీవికావు నేనుగాక యింకోరు ఈ పొజిషన్‌లో వుంటే మీరు అల్లరి పాలయ్యేవారు

కేవలం పిడికెడు మెతుకుల కోసం అదీ నా గురించి కాదు మా తాతయ్య కోసం నన్ను పెంచి విద్యాబుద్ధులు చెప్పించిన మా తాతయ్యని పస్తులుంచి హత్య చేయలేక నేనీ సాహసానికి వొడిగట్టాను నేనేకాదు నాలాంటి ఆడవారిని ఆడిస్తున్నదీ డబ్బున్న సంఘం కేవలం డబ్బుకోసం నేనిలా బరి తెగించాను అందామె ఆవేశంగా, ఆవేదనగా

అబ్బాయి మౌనంగా టుడే ఇండియాని చూస్తున్నాడు లెక్కకి అందే మనుషుల చేతుల్లో లెక్కకి అందని జీవితాలు కొన వూపిరితో బ్రతుకుతున్నాయి

మీరీ రోజు ఇంటర్వ్యూకి వెళ్ళకపోతే నాకు రెండు వేలు వస్తాయి అనారోగ్యంతో బాధపడుతున్న మా తాతయ్యకి మంచి ట్రీట్‌మెంట్ చేయించే ఆర్థిక శక్తి నాకు లబిస్తుంది నా అదృష్టమనండి లేదా దురదృష్టమనండి, మిమ్మల్ని మోసం చేయడానికి నన్నే పంపించాడా దేవుడు ఆమె కంఠం రుద్ధమయింది

దేవుడు పంపించ లేదు దెయ్యం పంపించ లేదు యిదంతా పెద్ద కుట్ర డబ్బుతో, అధికారంతో మా నాన్న ఆడుతున్న ఆట పన్నాగం – అంటూ ఉగ్రుడైన అబ్బాయి తన కథని చెప్పసాగాడు

(ఇంకాఉంది)

# సుభాషితాలు

భవేద్యది ఖలస్య శ్రీః
సర్వలోకవినాశినీ
యథా దవాగ్నేః పవనః
ఉరగస్య పయోయథా




అరని కారుచిచ్చుకు గాలి తోడైతే నది ఎట్లు అడవినంతా కాల్చి వేస్తుందో, పాముకు పాలు ఎట్లాతే విషాన్ని పెంచుతుందో అదేవిధంగా దుర్మార్గుడి చేతిలోని సంపద లోకవినాశాన్ని కలిగిస్తుంది

నాస్తి కామ సమోవ్యాధిః
నాస్తి మోహసమోరిపుః
నాస్తి క్రోధసమో వహ్ని –
ర్నాస్తి జ్ఞానాత్ పరం సుఖమ్




కోరికతో సమానమైన జబ్బు లేదు. మోహంతో సమానమైన శత్రువు లేదు. కోపంతో సమానమైన నిప్పు లేదు జ్ఞానానికి సమమైన సుఖం లేదు

**–ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ**



నో ఒక అద్భుతమైన వెర్మి
పరిశుభ్రమైన పద్ధతిలో అధు
ఇటాలియన్ యంత్రములతో
రు చేయబడినది. మిక్కిలి
కలిగియుండి క్రొవ్వు
లేకుండుటయే బాంబినో
త. వండినప్పుడు కాని,
త కాని ముద్దగా కాకపోవటమే
నో ప్రత్యేకత. నిమిషములలో
నోతో ఎన్నో రకములైన,
ంచే వంటకాలు, ఫలహారాలు
రు చేయవచ్చును. ఇంకా
నోతో పొదుపు కూడా. నేనే వాడి
ండి, మీకే తెలుస్తుంది.

## బాంబినో హల్వా

1 కప్పు బాంబినోని నేతిలో ముదుర రంగు వచ్చేదాక వేయించి, ప్రక్కన పెట్టుకొండి. మూడు కప్పుల నీళ్ళను మరగించి, బాంబినో కలిపి మూత పెట్టండి. దీనిని తక్కువ మంట మీద నీరు పూర్తిగా ఇంకేదాక ఉంచండి. మూడు చెంచాల పంచదార కలిపి 2 నిమిషాలు కలపండి. రుచికి పిస్తా, జీడిపప్పు చేర్చి వేడిగా వడ్డించండి. ఇది నలుగురికి సరిపోతుంది.

# రుచిలో కమ్మదనం
# ఖర్చులో పొదుపుతనం
# అదే బాంబినో గొప్పతనం

**ఉచితం**

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం, ప్రతి బాంబినో డీలరు వద్ద.








# వెర్మిసెల్లిని




**కాటన్ చీరెలు**

అందాల తార విజయశాంతి 'గాంధి' కాటన్ చీరెల్లో మరింత అందం.

తయారుచేయువారు: **గాంధిబ్రదర్స్** బొంబాయి

/HKI/GB/ 3

గాంధి కాటన్ చీరలు అన్ని షాపులలోను దొరుకును. ఏ.పి. డిస్ట్రిబ్యూటర్సు : శ్రీ లక్ష్మి క్లాత్ స్టోర్స్, 57, వస్త్రలత, విజయవాడ–1.

గిరిజ శారీ ట్రేడర్సు, 136–A, వస్త్రలత విజయవాడ–1 * బాలజీ టెక్స్‌టైల్స్, సుభాష్ రోడ్డు, సికింద్రాబాద్.



"నరసింహావతారం"లో అంబిక



# సినిమా

కన్సల్టింగ్ రూమ్‌లో ఉండగా "మే ఐ కమిన్?" అనే పరిచయమైన కంఠం వినిపించింది.

"ఎస్... కమిన్," అంది. ఎదురుగా పరిచయమైన వ్యక్తి (ఎ. ఎస్. ఆర్) కనిపించగానే ఆనందంతో పాటు ఆశ్చర్యం కూడా కలిగింది.

"కూర్చోండి." అంది.

"బావున్నారా?" అని ఆ వ్యక్తి అడిగాడు.

"ప్రాక్టీస్ బావుంది. ఉద్యోగం బావుంది. ఆరోగ్యం కూడా బాగానే ఉంది....ఉదయం, డ్యూటీ. జీతం, పేషెంట్స్... మా తమ్ముడు హాస్టల్‌లో చదువుకుంటున్నాడు. వాడి బాధ్యత ఒకటే నాకు మిగిలింది. అమ్మా, నాన్నా సంవత్సరం క్రితం కారు యాక్సిడెంట్‌లో చనిపోయారు."

"ఐ యామ్ సారీ."

"నేనే ఎవరికీ చెప్పలేదు...నా విషాదం ఇంకొకరికి పంచి పెట్టడం నాకిష్టం లేదు."

"శిక్ష"లో చంద్రమోహన్, సుహాసిని



## ఊటీలో "జయం మనదే"

"మొదటి షెడ్యూల్ ఊటీలో జూన్ 1 నుండి 10 వరకు జరిగింది. కృష్ణ, శ్రీదేవి మీద పాటలు చిత్రీకరించాం. ఆ తర్వాత లాస్ట్ షెడ్యూల్ మద్రాసులో జూలై 1 నుండి 10 వరకు జరుగుతుంది," అన్నారు కె. బాపయ్య. ఈయన దర్శకత్వంలో నెల్లూరుకు చెందిన ప్రముఖ వాణిజ్యవేత్త, సంఘసేవకర్త టి. [illegible]సుబ్బయ్య నిర్మించే టి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి చిత్రం "జయం మనదే"లో రాజ్యలక్ష్మి, కాంచన, అన్నపూర్ణ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, నాగేశ్వరరావు, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, సారథి, కె. కె. శర్మ, మాడా, చలపతిరావు, అనంతమోహన్, పూర్ణి, రాంబాబు తదితరుల నటవర్గం. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, సూర్యనారాయణ-- బ్రహ్మానందం ప్రొడక్షన్. శీను నృత్యాలు, టి. అశోక్‌కుమార్ నిర్వహణ, శ్యాంబాబు సహకార దర్శకత్వం. కొటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో నిర్మాణ సారధ్యం వహించే డాక్టర్ టి. వి. ఎస్. రాజు "సెప్టెంబర్‌లో విడుదలవుతుంది. ఈ చిత్రాన్ని బాపయ్య దర్శకత్వంలోనే హిందీలో కూడా నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నాం." అన్నారు.

## "దాంపత్యం"లో సమాగమం

డాక్టర్ (సుహాసిని) మెంటల్ స్పెషలిస్ట్. ఆమె

# విశేషాలు

-జి. వి. జి.

"అతా! మీరింకా ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?"

"ఎందుకు చేసుకోవాలో తెలీక... బైదిబై - మీరి ఊరొచ్చి ఎన్నాళ్ళయింది?"

"రెండు సంవత్సరాలు."

"నేనొచ్చి మూడ్నెల్లు అయింది...మీకు ఎలా తెలిసింది నా అడ్రసు?"

"ఇష్టంకూడా తెలిసేది కాదు; డాక్టరుగా మీ అవసరం వచ్చింది కాబట్టి తెలిసింది."

"నా అవసరమా!" డాక్టర్ నివ్వెరపోయింది.

ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో చదలవాడ తిరుపతిరావు సమర్పించే అనురాధ ఆర్ట్ కంబైన్స్ "దాంపత్యం" చిత్రానికి ఆర్. వి. కృష్ణారావు నిర్మాత.

## వెంకన్నబాబు తమిళ చిత్రం

"తమిళంలో ఓ చిత్రాన్ని ప్లాన్ చేశాను. జూన్‌లోనే ఉంటుంది షూటింగ్." అన్నారు మహేశ్వరి మూవీస్ అధినేత ఎస్. వి. వెంకన్నబాబు. ఈయన నిర్మించే తమిళ చిత్రంలో నాగేష్ కొడుకు ఆనందబాబు హీరో. భానుప్రియ హీరోయిన్. సి. వి. రాజేంద్రన్ దర్శకుడు.





జయమాలిని, "అగ్ని పిడుగు"లో

## మనదేశంలోకి దిగుమతి అయ్యే విదేశ చిత్రాలు

"మేగ్నిఫిసెంట్ బాడీగార్డ్, డైనాస్టీ, రివెంజ్ ఆఫ్ డ్రాగన్ వుమన్, హాట్ ది రోడ్ రన్నింగ్ (యు.ఎస్.ఎ.) "జోయోపన్ జూ (చైనా) వీనస్,టెక్స్ ఆఫ్ ది త్రీ డైమన్షన్, సైలెంట్ మేడ్‌నెస్, ఎప్ (కొరియా)" చిత్రాలను మన దేశంలో నేషనల్ ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ విడుదల చేస్తోంది.

## కృష్ణంరాజుతో ఎ. సారధి చిత్రం

"డిసెంబర్ నుంచి షూటింగ్." అన్నారు. నాగార్జున ఆర్ట్ పిక్చర్స్ అధినేత ఎ. సారథి. ఈయన "బొంగరాల దొర" అనంతరం కృష్ణంరాజు హీరోగా నిర్మించే చిత్రానికి బి. ఎల్. వి. ప్రసాద్ దర్శకుడు.

## ఎస్. ఎస్. క్రియేషన్స్

"ముచ్చటగా ముగ్గురు" అనంతరం నిర్మాత యార్లగడ్డ సురేంద్ర మరో రెండు చిత్రాలు ప్లాన్ చేశారు. మహాలక్ష్మిదయ చిత్రం ఆగస్టులో, ఎ. ఎన్. ఆర్‌తో హాస్యభరిత చిత్రం సెప్టెంబర్‌లో ప్రారంభమవుతాయని సమర్పకులు డి. రామానాయుడు తెలిపారు.

కాళ్ళకి హాయి
జేబుకి మరీ హాయి

# అదే శాండక్‌లోని అందం!



రాజేష్ 18
మెన్స్ పి.వి.
సైజు : 5-10
రూ. 29.95

అనుభవం వున్న కాళ్ళకి తెలుస్తుంది
శాండక్ తొడుక్కుంటే ఎలా వుంటుందో.
కొత్త పి.వి.సి. కాంపౌండ్స్‌తో మరి ఏ ఇతర
పి.వి.సి. జోళ్ళకీ లేని మృదుత్వం.
శాండక్ ఇస్తాయి.
దానికి తోడు మీ డబ్బుకి సరయిన విలువను
అందించే బాటావారి షెళ్ళ సేవని కలపండి.
అప్పుడు తెలుస్తుంది మా మాటలకి అర్థం
మీకు.

దుకాణాల్లో మాత్రమే లభిస్తున్నాయి.

**Sandak**

అన్ని కాలాలలో వాడదగ్గది

# అంతా నిశ్శబ్దం సరళమైన నిశ్శబ్దం





## ఆల్విన్ ఇంత నిశ్శబ్దంగా పనిచేస్తుందంటే ఆవెనుక జపాన్‌కు చెందిన సాంకేతిక పరిజ్ఞానం దాగిఉంది.

అదే అందులో ఉన్న గొప్పదనం. అసలు అది పని చేస్తోందా లేదా అనే భ్రమ కల్పిస్తుంది. ఏళ్ళు గడిచినా దాని పని అది అతిసమర్థవంతంగా చేసుకుపోతుందంటే అందులోనే వున్న రహస్యం జపాన్ సాంకేతిక పరిజ్ఞానమే. అదే మూలకారణం. అందుకే ఆల్విన్ దానికదే సాటి.

ఆల్విన్ రకరకాల సైజులలో లభిస్తుంది. సింగిల్‌డోర్ 85, 165, 300 లీటర్లు. డబుల్ డోర్ 165, 300, 380 లీటర్లు మీ ఇంటికి ఇందులో ఏదో ఒకటి తప్పక సరిపోతుంది. ఆల్విన్‌లో మీకు లభించేదేమిటో చూడండి.

**హిటాచి మూలాధారం !**

ఆల్విన్ కంప్రెస్సర్ హిటాచితో చేసుకున్న ఒప్పందం ప్రకారం తయారు చేయబడింది. సరళంగాను, నిబ్బరంగాను దక్షతతోను పనిచేస్తుంది.

**వోల్టేజి స్టెబిలైజరు అవసరం అసలు ఏమిటి ?**

విద్యుచ్ఛక్తిలో 150 నుంచి 260 వోల్ట్స్ వరకు జరిగే హెచ్చు తగ్గులను ఆల్విన్ తానంతట తానే సరిచేసుకుంటుంది. అందువలన వోల్టేజి స్టెబిలైజరు అసలు అవసరంలేదు.

**చిటికెలో ఐస్ సిద్ధం**

ఆల్విన్‌లో ఉన్నటువంటి రోల్‌బాండ్ ఫ్రీజర్ అతిస్వల్పకాలంలో ఐసును తయారు చేయడమే గాక అందులో నిలువ చేసుకునే ఆహార పదార్థాలు రోజుల తరబడి చెడిపోకుండా చేస్తుంది.

**సాధారణంగా వచ్చే పెద్ద మొత్తాల విద్యుచ్ఛక్తి బిల్లుకు విముక్తి**

మహోన్నతమైన జపాన్ సాంకేతిక పరిజ్ఞానం కారణంగా ఆల్విన్ 10 శాతం తక్కువగా విద్యుచ్ఛక్తిని వినియోగించుకుంటుంది.

**డీఫ్రాస్టింగ్ ఇంతతేలికగా ఎప్పుడూ లేదు.**

సులభంగా డీఫ్రాస్టింగ్ చేయడం కోసం నీరు దానంతట తనే తోడి వేసుకునే ఏర్పాటు, లోపలి భాగాలు అతి నునుపుగా వుండటం కోసం దిట్టమైన పాలిస్టైరిన్ ఎ బి ఎస్ లైనింగ్స్ ఏర్పాటు చేయడం జరిగింది.

**ఆల్విన్ అనీ అనకముందే సర్వీసు.**

ఆల్విన్‌కు మిక్కిలి పెద్దదైన సర్వీసు కేంద్రాల వ్యవస్థ వున్నది. వాటితో మీకు పని ఉండక పోవచ్చు. అయినా అవసరమనుకుంటే ఫోను చేస్తే చాలు మీకు ఎలాంటి సహాయమైనా లభిస్తుంది.

**ప్రపంచంలో దేనికీ తీసిపోని రిఫ్రిజిరేటర్**

ఎప్పటి కప్పుడు మార్పు చెందుతూ వుండే సాంకేతిక పరిజ్ఞానాన్ని మీ ముందుంచడం కోసం కర్మాగారాన్ని యంత్ర పరికరాలను ఆధునీకరించడానికి రూ. 8 కోట్లను ఆల్విన్ వెచ్చించింది.






7 సంవత్సరాలు గ్యారంటి

**ఆల్విన్**

2000 ఎస్ఎల్ రిఫ్రిజిరేటర్లు




హిటాచి వారినుండి లైసెన్సు పొందబడినది

HITACHI

*అన్ని సమయాలకు ఆల్విన్*

MAA (S) ALN 3A TEL 85

"పగటి జంగ"లో పూర్ణిమ

## "పారిపోయిన ఖైదీలు"

"ఖ్యాచరాలకి సంబంధించిన ఇతివృత్తం. రానున్న 21 వ శతాబ్దంలో ఏది ఎలా ఉంటుందన్న ఊహాపరమైన రూపకల్పన. సినిమా చాలా శక్తివంతమైన సాధనం. సంఘం మీద దాని ప్రభావం ఎక్కువగా ఉంది. దానిని బాధ్యతలు గుర్తెరిగి ఉపయోగించక పోతే మేలుకు బదులు కీడే జరుగుతుంది. సెక్స్‌ను క్రయిమ్‌ను ఎక్స్‌ప్లాయిట్ చేసే సినిమాల వల్ల సంఘంలో ఎటువంటి దుష్పరిణామాలు సంభవిస్తాయో తెలుపుతూ, ప్రజలను చైతన్యవంతులను చేసే సినిమాల ఆవశ్యకతను కూడా మా చిత్రం విశదీకరిస్తుంది" అన్నారు దర్శక నిర్మాత వల్లభనేని జనార్దన్. శ్వాతి చిత్ర ఇంటర్నేషనల్ వారి "పారిపోయిన ఖైదీలు" చిత్రంలో సినీ తారగా స్మిత, పారిపోయిన ఖైదీలుగా జనార్దన్, రాజా, [illegible]ప్రాంక్, సుధాకర్,

ఇతర భూమికలలో రంగనాథ్, గౌతమ్, నళినీకాంత్, వెంకటేశ్వరరావు, శ్వాతి కనిపిస్తారు. జనార్దన్, సాయినాథ్ కథ, స్క్రీన్‌ప్లే రాశారు. సాయినాథ్ సంభాషణలకర్త. కృష్ణ–చక్ర స్వరకల్పనలో గోపి గీతాలు రాశారు. నవకాంత్ ఛాయ. బాలు శిల్పం. తోట రామకృష్ణ సహకార దర్శకత్వంతో వల్లభనేని శ్వేతలానా సమర్పించే ఈ విశిష్టమైన చిత్రానికి ఇటీవల నాగార్జునసాగర్ వద్ద ప్రత్యేకంగా నిర్మించిన సెట్‌లలో కీలకమైన సన్నివేశాలు చిత్రీకరింపబడ్డాయి. శ్రీనరాజా రాజేంద్రబాబు వడ్లమూడి రాజబాబు సహ నిర్మాతలు.

మా ఆవిడమీద కోపం వచ్చినప్పుడల్లా సినిమాకి తీసుకెళ్ళి లోపల హాల్లో బాగా తిడతాను. ఏడ్చినా సినిమా చూసి ఏడుస్తోందనుకుంటారు. జనం!




## "కళ్ళు తెరవాలి"

"విధి వంచితురాలైన మగువ విపత్కర పరిస్థితుల్లో వీరనారి అవుతుంది... మహిళలను ఆకర్షించే చిత్రం. ఆడది ఆటబొమ్మ కాదని దుర్మార్గుల కళ్ళు తెరిపించే ఇతివృత్తం," అన్నారు ఎస్. ఎ. రాజకణ్ణు. ఈయన నిర్మించే శ్రీ అమ్మన్ క్రియేషన్స్ "కళ్ళు తెరవాలి" చిత్రంలో రేవతి, రాజేష్, పాండ్యన్, సూర్య, రాజా బహదూర్, బిందుఘోష్ వగైరా నటవర్గం. ఎం. ఎస్. మధు కథకుడు. రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. చంద్రబోస్ సంగీతం, హరి అనుమోలు ఛాయ, తిరునావుక్కరసు కూర్పుతో కె. రంగరాజా దర్శకుడు.

# సినిమా

## "వికటకవి విశ్వనాథం"

"హైందవ ధర్మానికి, సంస్కృతికి సంబంధించిన ఇతి వృత్తం. జూన్‌లో పాటలు రికార్డ్ చేసి, జూలైలో షూటింగ్ ప్రారంభిస్తాం" అన్నారు జి. జి. క్రియేషన్స్ వారి పై చిత్రాన్ని సమర్పించే గోల్డన్ స్టూడియోస్ అధినేత జనార్దన్‌బాబు. గెద్దాడ ఆనంద బాబు కథకుడు. జి. రామబ్రహ్మం నిర్మాత, గిరిధర్ దర్శకుడు.



"మొగుడూ- పెళ్ళాలు" తో భానుప్రియ

# తమిళ చిత్ర విశేషాలు

★ భాగ్యరాజ్ చిత్రం 'చిన్నవీడు" (చిన్నిల్లు) కు ఒక యువతి తొలిసారిగా ఛాయాగ్రాహకురాలిగా పని చేస్తోంది. పేరు విజయలక్ష్మి వయసు 23 దర్శక నిర్మాత స్వర్గీయ బి ఆర్ పంతులు పుత్రిక కెమెరామన్ అశోక్‌కుమార్ వద్ద అసిస్టెంట్‌గా పని చేసింది ఈ "చిన్నవీడు" చిత్రాన్ని శ్రీ సారథీ స్టూడియోస్ వారు తెలుగులో తీస్తారు

★ మద్రాసు పచ్చియప్పాస్ కాలేజీలో తమిళం ప్రొఫెసర్ ఎ ఎన్ ప్రకాశం రచయిత, దర్శకుడూనూ ఈయన శివాజీ గణేశన్ సరసన వయసు మీరిన పాత్రల్లో నటించమని కోరితే, సుజాతగాని, అంబికగాని ఓ పట్టాన ఒప్పుకోలేదట. చివరికి ఆ వేషానికి నళిని అంగీకరించింది . మరో విశేషం: శివాజీ తొలిసారిగా దేవర్ ఫిలిమ్స్ వారి చిత్రంలో నటించబోతున్నాడు

★ సాధారణంగా స్టంట్ సీన్‌లకు స్టంట్ మాస్టర్లు, డాన్స్‌లకు డాన్స్ మాస్టర్లు దర్శకత్వం వహించడం మామూలు ఇటీవల తమిళ చిత్రాలలో కామెడీ సీన్‌లను తీయడానికి ప్రత్యేకంగా ఒక డైరెక్టర్‌ను ఏర్పాటు చేసుకుంటున్నారు అతను హాస్య నటుడు, రచయిత ఎ వీరప్పన్. ప్రతి చిత్రానికీ కామెడీట్రాక్‌ను అతనే రాసి, డైరెక్ట్ చేస్తున్నాడు

★ కమలహాసన్ కొత్తగా ఎ సి. చేయబడిన మారుతీ కారు కొన్నారు. అందులో విశ్రమించడానికి సోఫా కమ్ బెడ్, ఫ్రిజ్ ఉన్నాయి కమల్‌కు అతి శీతలమంటే ఎంతో ఇష్టం "విపరీతమైన చలి ఉండే డిసెంబర్, జనవరి నెలల్లో ఊటీలో ఐస్‌క్రీమ్ తినాలని ఉంది" అన్నాడాయన.

★ అనూరాధ చాలా దీసెంటైన ఉడుపులలో హీరోయిన్‌గా నటించిన తొలి తమిళ చిత్రం "హేమాలిన్ కాదలర్‌గళ్" (హేమా యొక్క ప్రియులు) ఎంతో కాలమైనా ఆ చిత్రం ఇంకా పూర్తవ లేదు పంపిణీదారులు, కొనుగోలుదార్లు ఆ చిత్రాన్ని చూసి "ఆమెను మరీ ఇంతగా వొంటి నిండా బట్టలతో చూపిస్తే ఎవరు చూస్తారు?" అన్నారట

★ హాస్యనటి మనోరమ 27 ఏళ్ళలో వెయ్యి చిత్రాలకు పైగా నటించింది. వయసు 45. ఆమె పాతికేళ్ళ కొడుకు భూపతి ఈ మధ్య సినిమాలలో నటించడం మొదలిట్టాడు.

★ నాగేష్ తన కొడుకు డిస్కో డాన్సర్ ఆనందబాబు హీరోగా స్వీయ దర్శకత్వంలో ఒక తమిళ చిత్రాన్ని నిర్మించబోతున్నాడు.

★ శివాజీ గణేశన్ 250వ చిత్రం "నామ్ ఇరువర్" (మన మిద్దరం) తంజావూరులోని ఒక థియేటర్‌లో చాలా తక్కువ వసూళ్ళతో ఎనిమిది రోజులే ప్రదర్శింప బడింది.

★ బాలచందర్ సొంత సంస్థ కవితాలయ బానర్‌లో "రాఘవేంద్ర స్వామి" చిత్రం తయారవుతుంది. రజనీకాంత్ ప్రధాన పాత్రధారి. ఇది అతని 100వ చిత్రం. ఎస్. పి. ముత్తురామన్ దర్శకుడు జూన్‌లో సెట్స్‌కు వెళ్ళే ఈ చిత్రానికి అప్పుడే కొన్ని ఏరియాల అమ్మకం జరిగిందట. ఒక కొనుగోలు దారుడు "ఈ చిత్రంలో హీరోకు ఎన్ని ఫైట్స్ ఉన్నాయి?" అని అడిగాడట. బాలచందర్ కథ, స్క్రీన్‌ప్లే, మాటలు రాసి స్వీయదర్శకత్వంలో "సింధు భైరవి" అనే సంగీత ప్రధాన చిత్రాన్ని శివకుమార్, సుహాసిని జంటతో నిర్మిస్తున్నారు. ఇళయరాజా సంగీత దర్శకుడు.

(జి. వి. జి.)

# పరీక్షా ఫలితాలు





-శేఖర్..

| పాస్ అయిన విద్యార్థి | ఫెయిల్ అయిన విద్యార్థి |
|---|---|


























సీరియల్

# మల్లిక

(గత సంచిక తరువాయి)

కాస్త ఆశ్చర్యపోయినట్లు కనిపించాడు డాక్టర్ కానీ ఏమీ అనలేదు

తను కాస్త బ్లంట్‌గా అన్నానేమో అనుకున్నాడు భార్గవ్

మా ఇద్దరి ప్రేమ ఫలితంగా బిడ్డలు పుట్టాలని ఆశపడ్డాను ఇప్పుడలా జరగనందుకు నాకంత విచారంగానూ లేదు! ఎవర్నో తెచ్చుకుని లేనిపోని బాదరబందీ తగిలించుకోవాలని అంతకన్నా లేదు లోకంలో ఇంతమంది జనం వుండగా నాకు పుట్టకపోయినా వచ్చిన నష్టం లేదనుకుంటున్నాను నిదానంగా అన్నాడు బార్గవ్

మీరన్నది నిజమే! లోకంలో ఎంతోమంది జనం వున్నారు ఎందరో పిల్లలున్నారు కానీ ఆ పిల్లల్లో చాలామంది కనీసావసరాలు కూడా తీర్చుకోలేని నిర్భాగ్యులే! కన్నవాళ్ళ ప్రేమకు నోచుకోని దురదృష్టవంతులే! అట్లాంటి పిల్లల్ని దగ్గరకు తీసి వాళ్ళకో నిలవ నీడనిస్తే కలిగే ఆనందం, రక్తం పంచుకు పుట్టిన పిల్లల్ని సాకే ఆనందంతో సాటియైనదేనని నా వుద్దేశ్యం

డాక్టర్ మాటలకు చివ్వున తలెత్తింది మల్లిక

డాక్టర్! మీకెంతమంది పిల్లలు?

సడెన్‌గా అడిగిన ఆమె ప్రశ్నకు కాస్త ఆశ్చర్యపోయాడు డాక్టర్

ఇద్దరు! ఒకమ్మాయి ఒకబ్బాయి ఫోటో వంక చూస్తూ అన్నాడు

–'చద్దన్నం తిన్నమ్మ మొగుడాకలెరుగదన్నట్లు' ఇద్దరు పిల్లల్ని గన్న నువ్వు మాలాంటి వాళ్ళకెన్ని సలహాలైనా ఇవ్వగలవు మహాశయా!– మల్లిక మనస్సులో రేసు గుర్రంలా పరిగెడుతున్న భావం బైటి కురికే లోపలే డాక్టర్ మళ్ళీ అన్నాడు

ఈ పిల్లలిద్దరూ మాకు పుట్టిన వాళ్ళు కాదు మల్లికా! అయిదు సంవత్సరాల క్రితం దత్తత తీసుకున్నాం అయితే, మాకు పిల్లలు పుట్టి వున్నా వాళ్ళని ఇంతకంటే ఎక్కువ ప్రేమించేవాళ్ళం కాదేమో!

నవ్వుతున్న డాక్టర్ కళ్ళల్లోకి చూడలేక మల్లిక కళ్ళు వాలిపోయాయి

డాక్టర్ మంద్రస్వరంతో అన్నాడు "చూడండి? మీ మానసిక స్థితిని నేనర్థం చేసుకోగలను ఒకప్పుడు నేనూ ఆ స్థితిలో వున్నవాణ్నే! ఎంతో కావాలని ఎదురు చూసిన విషయం జరగనప్పుడు, ఆ నగ్న సత్యం విషంలా మారి మనస్సుని చేదుగా చేస్తుంది అది జీర్ణించుకోవటానికి చాలా శక్తి కావాలి అది సామాన్యమైన విషయంకాదు కాని అదృష్టవశాత్తూ ఈ కష్ట సమయాన్ని సాధ్యమైనంత తక్కువ మనస్తాపంతో దాటటానికి వుపకరించే ఎన్నో సహాయ సంస్థలు, సపోర్ట్ గ్రూప్స్ వున్నాయి పిల్లలు లేని కపుల్స్ గ్రూప్స్‌గా ఏర్పడి ఒకళ్ళకొకళ్ళు మానసిక సహాయ సహకారాలు అందజేసుకుంటుంటారు అక్కడ అందరి బాధలూ ఒక్కటే కాబట్టి ఒకళ్ళ ఫీలింగ్స్ ఇంకొకళ్ళు బాగా అర్థం చేసుకుని తద్వారా స్వాంతన పొందే అవకాశం వుంది

ఎప్పుడైతే ఈ పరిస్థితిని అంగీకరించి కోపప్ అవుతారో అప్పుడు మీకింత బాధ వుండదు అనుభవపూర్వకంగా చెబుతున్నాను నా మాట నమ్మండి?

మల్లిక నిట్టూర్చింది లేచి నిలబడి చెయ్యందించింది థాంక్యూ డాక్టర్! మీరు చెయ్యగలిగిందంతా చేశారని నమ్ముతున్నాను మీ సహాయానికి నా కృతజ్ఞతలు మనస్ఫూర్తిగా అంది

* * * * *

కార్లో ఇంటికి వస్తూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండిపోయారు

ఇక ఈ అధ్యాయం కూడా ముగిసిపోయింది ఇంక ఈ డాక్టర్ దగ్గరకూ వెళ్ళనవసరంలేదు బాధాకరమైన, అప్పుడప్పుడూ అవమానకరమైన ఆ పరీక్షలూ ఇక వుండవు ప్రపంచంలో పిల్లల్లేని వాళ్ళ లెక్కల్లోకి తామూ చేరిపోతారు! అయితే మల్లిక మనస్సు బాధతో మెలికలు తిరగటం లేదు నిర్వికారంగా, స్తబ్దంగా వుంది మనస్సులో ఏదో గడ్డ కట్టి బైటికి రావటంలేదు ఏమిటీ స్థితి! తనకెందుకు ఏడుపు రాదు? కన్నీటికి బాధను కడిగివేసే శక్తి వుంటుందంటారు తనలో కన్నీరే లేదా? లేక తన మనస్సు బాదల కతీతమైన ఒక పాషాణమా?

కళ్ళు మూసుకుని వెనక్కి వాలింది మల్లిక మళ్ళీ వెంటనే కళ్ళు తెరిచింది తల తిప్పకుండానే భార్గవ్ వంక చూసింది అతని కళ్ళు ఎదురుగుండా రోడ్డు మీద ఫోకస్ చేసి వున్నాయి అతని చేతులు స్టీరింగ్ వీల్ మీద వున్నాయి అతని మనస్సు? అతను ఏం ఆలోచిస్తున్నాడో? ఏమైనా మాట్లాడితే బాగుండును! తనే పలకరిద్దామా అనుకుంది కానీ ఎందుకో మాట పెగిలి రాలేదు మళ్ళీ కళ్ళు మూసుకుంది

సడెన్‌గా, పెళ్ళి కాక ముందు బార్గవ్‌తో పిల్లల విషయంలో వాదించిన సంగతి గుర్తొచ్చింది కనీసం డజనుమందైనా పిల్లలు కావాలనుకున్న భార్గవ్‌కి అసలు పిల్లలే పుట్టటం లేదన్న విషయం ఎంత రంపపు కోత కోస్తోందో? పిల్లలు లేకపోయినా విచారపడనని బల్లగుద్ది వాదించింది తను ఏ ముహూర్తాన ఆ మాట అన్నదో మరి, అది తనకొక పరీక్షై ఎదురు నిల్చింది!

ఎప్పుడూ అశుభం మాటలు పలకగూడదు – పైన తథాస్తు దేవతలుంటారనేది అమ్మమ్మ!

మల్లిక మనస్సులో అమ్మమ్మ మెదిలింది పిచ్చి అమ్మమ్మ! ఆమెదో అమాయకపు ప్రపంచం! ఆ ప్రపంచంలోనే అంతు లేని తృప్తిని అనుభవించేది ఆవిడ చేసే ప్రతి పనీ, చెప్పే ప్రతి మాటా చాదస్తంగానే వుండేది మల్లికకు

ఆవిడ భక్తి తల్చుకుంటే నవ్వొస్తుంది దేవుడికో రోజు చొప్పున వారంలో అన్ని రోజులూ ఒక పూట వుపవాసముండేది, తెల్లారగట్ల చన్నీళ్ళ స్నానాలకు అంతే లేదు! కార్తీక స్నానాలు చేసి రెండు నెలలు మంచం పట్టిందొకసారి

ఇక ఆమె పూజ చేసేటప్పుడు చూడాలి! నిముషానికొకసారి మల్లికను పిల్చి పొయ్యి మీద పప్పు మాడుతోందనో, పిల్లి పాలు తాగిపోతుందనో, అడుక్కునేవాడు అరుస్తున్నాడు అనో వెళ్ళమని చెప్పమనో హెచ్చరిస్తుండేది పూజ చేసే ఆ రెండు గంటల్లోనూ, గంటన్నర ఆ హెచ్చరికలకే సరిపోయేది ఎలాగోలా పూజ పూర్తయ్యి, వంట చేసి మల్లికకు పెట్టేసరికి స్కూల్ టైం

జరిగిన కథ–7 భార్గవ్ అమెరికాలో ఒక చిన్న ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు భార్గవ్‌కు మల్లిక పరిచయం అయ్యింది ఆమె కంప్యూటర్స్‌లో డిగ్రీ తీసుకొని ఉద్యోగంలో చేరినాక వారిద్దరు పెళ్ళి చేసుకున్నారు భార్గవ్ మల్లికల జీవితం హాయిగా సాగిపోతోంది మల్లికకు జీవితంలో కోరుకున్నవన్నీ ఉన్నాయి గానీ పిల్లలే లేరు అందుకోసం ఆ దంపతులు డాక్టర్ల చుట్టూ తిరగడం ప్రారంభించారు వారికి పిల్లలు పుట్టకపోవడానికి కారణాన్ని ఏ డాక్టర్లూ చెప్పలేకపోయారు కానీ భార్గవ్‌కు మాత్రం తమకు తప్పక పిల్లలు పుడుతారని నమ్మకం ఒంటరితనంతో బాధ పడుతున్న మల్లికకు చిన్ననాటి స్నేహితురాలు అంజలి తారసపడటం ఆనందాన్నిచ్చింది ఎదురింటి పాప స్టెఫనీ అంటే మల్లికకు తగని ప్రేమ పిల్లల్ని పెంపకం తీసుకునే విషయంలో తమకి ఆసక్తి లేదని డాక్టర్‌తో చెపుతాడు బార్గవ్

దాటిపోయేది. ప్రతి రోజూ మల్లిక ఆదరాబాదరా పరిగెత్తి మాస్టారు చేత మొహం వాచేలా చివాట్లు తినవల్సి వచ్చేది.

ఇక పండుగ రోజుల్లో సంగతి సరేసరి. మామూలుకంటే రెండు గంటలు ఎక్కువే పూజలో కూర్చునేది. ఆ రోజు అన్నం కడుపులో పడే వేళకి మల్లిక మిగలాకలి వల్ల వచ్చిన కడుపు నొప్పితో పడుకుండి పోయేది.

అందుకే పూజలన్నా, పండగలన్నా చెప్పరాని ఎలర్జీ మల్లికకు.

మొక్కులు మొక్కటంలోనూ, అవి తీర్చటంలోనూ ఆవిణ్ని మించేవాళ్ళే లేరేమో! తుమ్మితే మొక్కు, దగ్గితే మొక్కు! పరీక్ష పాసైతే ఆంజనేయుడికి ఆకు పూజ, ఫస్ట్ క్లాసొస్తే వెన్నప్పాలతో పార్వతీదేవి పూజ, తెలియక చేసిన దోషాలు పోవటానికి త్రిమూర్తుల వ్రతం, కాలేజీలో సీటొస్తే వెంకటేశ్వరునికి మూడు కత్తెరలు – ఆవిడ తీర్చిన మొక్కులూ, చేయించిన వ్రతాలూ ఇప్పుడు మల్లికకే సరిగ్గా గుర్తులేవు.

అమ్మమ్మ మీది అభిమానం వల్లనో, చిన్నతనంవల్ల తెలియకనో అన్నీ తు. చ. తప్ప చేసేది మల్లిక. కానీ వయస్సు వచ్చినకొలదీ, విషయావగాహన అవుతున్న కొలదీ మల్లికకవన్నీ అర్ధరహితంగా తోచేవి.

ఆమె దృష్టిలో, స్వార్థ భావంతో పెట్టే దణ్ణం భక్తి కాదు! నూటొక్క కొబ్బరికాయల లంచంతో భక్తుని కోరిక తీర్చే దేవుడు దేవుడూ కాడు! –

భార్గవ్ డాక్టర్ చెప్పిన విషయమే ఆలోచిస్తున్నాడు. అతని మనస్సులో డాక్టర్ మాటలే పదే పదే మార్మ్రోగుతున్నాయి.

"లోకంలో కనీసావసరాలు కూడా తీర్చుకోలేని నిర్భాగ్యపు పిల్లలెందరో వున్నారు! ఎందరో వున్నారు!"

అతనికి చటుక్కున చిట్టిగాడు జ్ఞాపకం వచ్చాడు.

చిట్టిగాడు! ఏనాటి చిట్టిగాడు?

చిన్నప్పుడు భార్గవ్‌కి ఏడెనిమిదేళ్ళ వయస్సప్పుడు వాళ్ళింట్లో పాలేరుగా వుండేవాడు. వాడికప్పుడు పన్నెండేళ్ళుండేయేమో! చాలా చలాకీగా వుండేవాడు. ప్రొద్దున్న నాలుగ్గంటలకు లేచింది మొదలు రాత్రి పది గంటలకు పడుకునే వరకూ గిలకలా గిర్రున తిరిగేవాడు. ఎంత పనైనా సునాయాసంగా చేసేసేవాడు.



# మల్లిక

అప్పట్లో వాడు భార్గవ్ హీరో!

పన్నెండేళ్ళ వయస్సుకే వాడు యువకుడిలా వుండేవాడు కాయ కష్టంవల్ల మెలిదిరుగుతున్న వాడి కండరాలు చూస్తే బార్గవ్‌కి అసూయగా వుండేది ఎప్పుడూ ఏదో ఒక రోగంతో నీర్సంగా, అర్భకంగా వుండే భార్గవ్ వయస్సుకి తగ్గట్టు ఎదగలేదని అందరూ అనుకునేవారు

ముఖ్యంగా చిట్టిగాడు అన్నం తినేప్పుడు చూడటం అన్నింట్లోకీ ఇష్టం భార్గవ్‌కి ఎంత చక్కగా, ఎంత పొందికగా, ఎంత ఆప్యాయంగా తినేవాడు! ప్రపంచంలో ఎవ్వరూ, ఎప్పుడూ పొందలేనటువంటి అద్భుతమైన హాయిని అనుబవిస్తున్నట్లుండేవాడు ఆ సమయంలో

అన్నంవేళకి గుండ్రంగావుండే తన సత్తుగిన్నె, శుభ్రంగా తళతళ మెరుస్తున్నది నీళ్ళతో తొలిపి తీసికెళ్ళి వంటింటి గుమ్మాని కివతల నుంచొని గడపవతలగా పెట్టేవాడు అమ్మ ఆ గిన్నె నిండుగా అన్నం, అందులోకి అధరువుగా కూరో, పచ్చడో పెట్టి ఇచ్చేది పంటిటి కెదురుగా వుండే చిన్న వసారాలో తను ఎప్పుడూ అన్నం తినే స్థలంలో వెళ్ళి, తలకున్న తుండుగుడ్డతీసి చేతి విసురుతో దులిపి క్రింద పరుచుకుని దానిమీద కూర్చునేవాడు ప్రక్కనే అంతకుముందు పెట్టుకున్న మంచినీళ్ళ గ్లాసుండేది

భార్గవ్ ఆ సమయానికి ఎలాగోలా అక్కడికి చేరుకుని కళ్ళప్పగించి చూస్తుండేవాడు పంచభక్ష్య పరమాన్నాలతో తిన్నప్పుడు కూడా రాని లాలాజలం వాడు గిన్నెడు చద్దికూడు ఒక్క మెతుకు క్రిందపడకుండా ఆబగా తినటం చూస్తుంటే భార్గవ్‌కి నోటి నిండుగా వూరేది

అతను ఆశగా అటే చూడ్డం గమనించి చిట్టిగాడు అప్పుడప్పుడూ ఎవ్వరూ చూడకుండా ముద్దలు పెట్టేవాడు ఆ ముద్దలు అమృతం కలిపినంత రుచిగా వుండేవి! ఆ తర్వాత పెద్దయినాక అతను అనేక విదేశీ వంటకాలు రుచి చూశాడు గూర్మే రెస్టారెంట్లలో తిన్నాడు పాష్ హోటల్స్‌లో విందులు ఆరగించాడు కానీ, ఆ రోజుల్లో చిట్టిగాడి చేతి పచ్చడి ముద్దలు తిన్నప్పటి సంతృప్తి, రుచి ఇవేవీ ఇవ్వలేకపోయాయి

కొన్నేళ్ళ తర్వాత చిట్టిగాడు వాళ్ళింట్లో పనిమానేసి వెళ్ళిపోయాక కూడా వాడెప్పుడూ గుర్తొస్తుండేవాడు వాడు గుర్తొచ్చినప్పుడల్లా బార్గవ్‌కి ఒక్కటే అనిపిస్తుండేది - మనిషి సంతోషంగా వుండటానికి డబ్బొక్కటే ప్రదానం కాదని

ఏడుగురు పిల్లలుగల కుటుంబంలో పెద్ద పిల్లవాడు చిట్టిగాడు తండ్రి పెద్ద పాలేరు తల్లికి ఏటా కాన్పులు! కాన్పుల మధ్యలో ఎప్పుడైనా కాస్త ఎడముంటే వాళ్ళింట్లోనూ, వీళ్ళింట్లోనూ పిండి దంచి, పప్పు రుబ్బి ఏవో రెండు రాళ్ళు సంపాదిస్తుండేది చిట్టిగాడి పెద్ద తమ్ముడూ - పదేళ్ళవాడు, నాలుగిళ్ళలో గొడ్లను కాసేవాడు పెద్ద చెల్లెలు - తొమ్మిదేళ్ళది, చిన్న చెల్లెలి సాయంతో ఇంట్లో పనులు చేయటం, పిల్లల్ని ఆడిపించటం అవసరం అయితే ఇంట్లో అందరికీ వుడకేసి పడేయటం చేస్తుండేది

రెక్కాడినా సరిగ్గా డొక్కాడని సంసారం! అయినా చిట్టిగాడు అది లేదనీ, ఇది లేదనీ ఏనాడూ అనుకునేవాడు కాదు మూడు పూట్లా కలో గంజో కడుపు నింపుకోవటం, పాతవో చిరుగులవో ఒంటినిండా బట్టా, - వీటికోశం కండలు కరిగేదాకా పని చెయ్యటంలో ఆనందం అనుభవించే అల్ప సంతోషి!

ఈ తృప్తి తనకు వెయ్యి జన్మలెత్తినా, కోటి రూపాయలు సంపాదించినా వస్తుందా? రానేరాదు! అనుకునేవాడు భార్గవ్

ఎమ్ ఎస్‌సి పాసయ్యి, వుద్యోగంకోసం తిరిగి తిరిగి, విసిగి వేసారి అమెరికా ప్రయాణం పెట్టుకున్న రోజులవి! ఏ వూరో వెళ్తూ, బస్‌కోసం ఎదురుచూస్తూ, బస్‌స్టాండలో నిలబడి వున్నాడు భార్గవ్ సిగరెట్‌మీద సిగరెట్ తగలేస్తూ, బస్ టైం దాటిపోయి గంటైనా ఎంతకీ రాని బస్‌ని తిట్టుకుంటూ, నడి వేసవి వేడికి చెమటలు కక్కుతూ, నానా అవస్త పడుతూ రాతి బెంచీమీద కూర్చున్నాడు

అతనికి కొంచం దూరంలోనే నేలమీద కూర్చున్న ఒక తల్లి అది, ఇది కొనిపెట్టమని చంపుకు తింటున్న పిల్లల్ని కసిరికొడుతూ, ఆయాసపడుతూ









అపసోపాలు పడుతోంది నూనెలేక కొబ్బరి పీచులా వున్న నాలుగు వెంట్రుకల్నీ దువ్వుముడి వేసింది కళ్ళు లోతుకుపోయి, బుగ్గలు ఎండిపోయి, చేతులు పుల్లల్లా లూజు జాకెట్టులో నుండి వేళ్ళాడుతూ వున్న ఆమె వయస్సెంతో చెప్పటం మహాకష్టం ఆమెలో నిండుగా కనబడేదల్లా ఒక్క పొట్టే! అయితే గర్భిణీ అయినా అయ్యుండాలి లేదా ఏదైనా జబ్బయ్యి వుండాలి తొంభైతొమ్మిదిపాళ్ళు మొదటిదే అయ్యుండాలి

అటే చూస్తూ ఆలోచన్లలో మునిగివున్న భార్గవ్ 'చిన్నయ్యా' అన్న పిలుపుతో వులిక్కిపడి ఇటు చూశాడు ఆ పిలుపెంతో చిరపరిచితంగా వున్నా ఆ పిలుపు తాలూకూ మనిషి మాత్రం ఎంతకీ గుర్తురాలేదు

చిరుగుల పంచ, మాసిన చొక్కా, తలకు గుడ్డ ఈ వేషంలో వున్న మనిషిలో అతనికి తెలిసిన అందరి మనుషుల పోలికలూ గుర్తు తెచ్చుకున్నాడు అయినా లాభం లేకపోయింది

బక్క చిక్కిపోయి, నిర్జీవంగా వున్న ఈ మనిషి ఎవరు?

ఇంక ఎక్కువసేపు అతన్ని సస్పెన్స్‌లో వుంచటం ఇష్టం లేకనో ఏమో ఆ మనిషి తనే పరిచయం చేసుకున్నాడు

"అదేమిటి చిన్నయ్యా అట్టా సూత్తుండావు? నేను చిట్టిగాణ్ణి చిన్నప్పుడు మీ ఇంట్లో పాలేర్ని గ్నాపకం రావటంలా?'

ఆ మాటతో కొరడా దెబ్బ తగిలినట్లు వులిక్కిపడి అతనివంక పరిశీలనగా చూశాడు ఎంతోసేపు చూసినాకగాని కొద్దిగా ఆనమాలు తెలియ లేదు

"అరె, నువ్వా చిట్టిగా! అస్సలు గుర్తుపట్టలేక పోయాను ఏమిటిలా అయ్యావు? ఎక్కడుంటున్నావు? ఏం చేస్తున్నావు?" చాలాకాలానికి అనుకోకుండా చిట్టిగాణ్ణి చూసిన ఆనందంతో వుక్కిరి బిక్కిరయ్యాడు భార్గవ్

మనుషులు మారిపోక అట్టాగే వుంటారా చిన్నయ్యా? నువ్వు మారలా?సన్నగా, రివటాలా వుండేవాడివి ఇప్పుడు బలంగా, దొరబాబులాగా వున్నావు ముందు నేనే గుర్తుపట్టలేక పోయాను నువ్వా కాదా, పలకరించాలా వద్దా అని చానాసేపు పీకులాడాను సూడగా సూడగా నువ్వే అయ్యుంటావులే అనిపించి ధైర్నం చేశాను అది సరేగాని, అమెరికా దేశం ఎల్తున్నావంటగా?' సంబరంగా అడిగాడు చిట్టిగాడు

ఆశ్చర్యపోయాడు భార్గవ్ వీడికెలా తెలుసు ఈ విషయం?

'నేను అమెరికా వెళ్తున్నట్టు నీకెలా తెలుసు?"

'బలేవాడివే చిన్నయ్యా! మీలాంటాళ్ళకి నాలాంటి ఎందరో పాలేళ్ళు. అందర్నీ గుర్తు పెట్టుకోనక్కరలేదు. నాకలా కాదు మీ ఇంట్లోనే నా మొదటి పాలేరుతనం మొదలయ్యింది మీరంతా నాకు అత్మబంధువులతో సమానం మీ ఇంట్లో జరిగే సంగతులన్నీ ఎప్పటికప్పుడు తెల్సుకుంటానే వుండాను" చిట్టిగాడు మామూలుగానే అన్నా వాడి మాటల్లో ఏదో నిష్ఠూరం ధ్వనించినట్లయింది భార్గవ్ మనస్సు చివుక్కుమంది

"సరే, నీ విషయాలు చెప్పు ఎక్కడుంటున్నావు? ఏం చేస్తున్నావ్? మా ఇంట్లో పని మానెయ్యగానే నీకు పెళ్ళయిందని విన్నాను ఆ తర్వాతి సంగతులు తెలియవు పిల్లలెంత మంది? మీ ఆవిడ బాగుందా?" మామూలుగానే కుశల ప్రశ్నలు అడిగాడు

"ఆఁ! ఏం బాగోలే చిన్నయ్యా! ఐదుగురు పిల్లల్లో ఒక పిల్లది జబ్బుతో పోయింది మా ఆవిడ మళ్ళీ నీల్లోసుకుంది సంపాయించేది తిండికే చాలదు పైగా మా ఆడది రోగిష్టిది పొట్టలకే చాలక పోతే ఇక మందూమాకూ ఏం ఇప్పించేది? పదతా, లేత్తా ఇదిగో ఇట్టా నెట్టుకొత్తున్నాం" నిరాశా నిస్పృహలు వాడి కంఠంలో పోటీపడుతూ ధ్వనించాయి

బంతిలా వుండేవాణ్ణి అలా చూస్తుంటే భార్గవ్ మనస్సు నీరుగారిపోయింది ఏదో అనేలోపలే మళ్ళీ చిట్టిగాడే అన్నాడు వేలుతో చూపిస్తూ

'అరుగో, అక్కడ కూర్చున్నవాళ్ళే నా బార్యాపిల్లలూను '

వాడు చూపించిన వైపు చూస్తూ మరింత నీరుగారిపోయాడు భార్గవ్

ఇంతకు ముందు అతను చూసిన స్త్రీ, పిల్లలు!

వీళ్ళా చిట్టిగాడి భార్యాపిల్లలు? చిట్టిగాణ్ణి, వాడి సంసారాన్ని ఆ స్థితిలో చూసి భార్గవ్ పడిన వ్యధ బహుశ చిట్టిగాడు వూహించలేదేమో!

అంతలో బస్ వస్తున్న జాడలు కనబడేసరికి కంగారుగా జేబులో చెయ్యిపెట్టి పర్సు బైటికి తీశాడు వంద రూపాయల నోటు, కొన్ని చిల్లర నోట్లు కనిపించాయి గబాలున వంద రూపాయల నోటు తీసి చిట్టిగాడు వద్దంటున్నా వినిపించుకోకుండా వాడి చేతిలో పెట్టి, పిల్లలకి ఏమైనా కొనమన్నాడు

వెళ్తున్న బస్ కిటికీలో నుండి, ఇటే చూస్తూ నిలబడ్డ చిట్టిగాణ్ణి చాలాదూరం వెళ్ళేవరకూ వెనక్కి తిరిగి చూస్తూనే వున్నాడు భార్గవ్ ఆ నాటి వాడి ముఖం భార్గవ్ హృదయంలో గాఢంగా హత్తుకు పోయింది.

ఎలాంటి చిట్టిగాడు ఎలా అయిపోయాడు? సంతోషాన్ని మించిన ఐశ్వర్యం లేదనుకునేవాడు తను ఒకప్పుడు కానీ, కనీసావసరాలైనా తీర్చుకోలేని మనిషి, ఎంత కష్టపడ్డా కడుపునిండా తిండీ, వంటినిండా బట్టా అమర్చుకోలేని మనిషి ఎంత అల్పసంతోషి అయితే మాత్రం సుఖంగా వుండగలుగుతాడు?భార్యాబిడ్డలు

# మల్లిక

జబ్బుపడితే మందిప్పించలేని స్థితికీ, కన్నబిడ్డ కళ్ళముందే సరైన వైద్య సౌకర్యంలేక చచ్చిపోతుంటే కళ్ళప్పగించి చూట్టం మినహా ఏమీ చెయ్యలేని నిస్సహాయత్వానికీ మనిషి గుండె పగిలేది ఆనందంతోనా? అదే ఆనందమైతే అట్లాంటిది కావాలని ఎవరు కోరుకుంటారు?

అయినా, సుఖంగా బ్రతకటానికి డబ్బు అవసరం లేదనుకోవట మేమిటి?డబ్బుండబట్టే కదా తను చిన్నప్పుడు రోగిష్ఠియైనా ఇప్పుడు పుష్టిగా, ఆరోగ్యంగా తయారయ్యాడు? డబ్బుండబట్టే కదా తనకు కావల్సిన విధంగా జీవితాన్ని తీర్చిదిద్దుకుంటున్నాడు? డబ్బుండబట్టేకదా ఇక్కడ వుద్యోగావకాశాలు లేకపోయినా వున్నచోటుకి వెళ్ళగలుగుతున్నాడు

మరి చిట్టిగాడు? పాలేరింట్లో పుట్టి పెరిగి, పాలేరై మళ్ళీ తన పిల్లలకు పాలేరుతనాన్ని వారసత్వంగా ప్రసాదిస్తున్నాడు!

వున్నవాడు మరింత వున్నవాడవుతుంటే లేనివాడు మరింత పాతాళానికి తొక్కబడుతున్నాడు! ఎల్లప్పుడూ సమాంతర రేఖలుగా సాగే ఆ ఇద్దరి జీవితాల సంగమం ఎప్పుడో? ఈ లోపం ఎక్కడుంది? ఆర్థిక వ్యవస్థలోనా లేక మనిషిలోని మితిమీరిన స్వార్థపరత్వం వల్లనా?

శ్రీ కృష్ణభగవానుని విశ్వరూప సందర్శనంతో అర్జునుని కళ్ళు తెరుచుకున్నట్లు, ఆ నాటి చిట్టిగాడి రూపం, అతని జీవితం, అతని భార్యాబిడ్డలు భార్గవ్‌కి వాస్తవ జీవితాన్ని తట్టిచెప్పాయి అప్పటివరకూ తల్లిదండ్రుల రక్షణలో, డబ్బనే కవచంలో జీవితాన్ని ఒకవైపు నుండే చూడగలిగిన భార్గవ్‌లో చిట్టిగాడి కలయిక చెప్పలేని భావ సంచలనం రేపింది

ప్రతి మనిషికీ ఏదివున్నా లేకపోయినా కడుపునిండా తిండీ, ఒంటినిండా బట్టా, తలదాచుకోవటానికి ఇల్లూ, ఏదైనా రోగం వస్తే నయం చేయించుకో గలిగే స్తోమతా వుండగలగాలి అది అత్యాశ కాదు మనిషి కనీసావసరం! ఆ కనీసావసరాన్ని కూడా తీర్చుకోలేని మనిషంత దురదృష్టవంతుడింకొక డుండడు

ఈ లోకంలో అన్నింటికంటే భయంకరమైనది ఆకలి! ఒక్కపూట అన్నం లేకపోతే – అంతెందుకూ, ఒక్క గంట అన్నం తినటం లేటైతే ఎంత నరకయాతనగా వుంటుందో అనుభవపూర్వకంగా తప్ప వర్ణించలేం! మరి రోజుల తరబడీ తిండిలేనివాడి సంగతేమిటి?

కావాలని వుపవాసం చేసేవాళ్ళు, నాజూగ్గా వుండటం కోసం తిండి మానేసేవాళ్ళ సంగతి వేరు వాళ్ళకొక ధ్యేయం వుంది అది తాత్కాలికమైన అవస్థ కాబట్టి అది అంతగా బాధించదు తర్వాతి ముద్ద ఎక్కడ్నుండి వస్తుందో, అసలు వస్తుందో రాదో తెలియని మనిషే నికృష్టజీవి!

మనిషికి స్వార్థం పుట్టుకతో వచ్చిన గుణం "నా" అనేది మనిషికి అన్నింటికంటే అత్యంత ప్రియమైన పదం! నేను, నా ఇల్లు, నా సంసారం, నా పిల్లలు అనుకోవటంలో మనిషి అనిర్వచనీయమైన ఆనందం అనుభవిస్తాడు.

ఆ స్వార్థత్వాన్ని కొంచం సడలించుకుని, తను తినగా మిగిలిన తిండే, తన వాళ్ళమీద కురిపించగా మిగిలిన ప్రేమే అవి లేనివాళ్ళకు ఇస్తే మనిషికి తరిగేదేమిటి?

బస్‌లో ఆ రోజంతా అతనదే విషయం ఆలోచించాడు ఎంతో ఆవేశపడ్డాడు. ఆ తర్వాత అతను అమెరికా రావటంతో, కొత్త వాతావరణంలో ఇమడటానికి పడేపాట్లలో, అతను ఆ విషయం మర్చిపోయాడు

చిట్టిగాడి పిల్లలిలా వున్నారో? చిట్టిగాడిలాగే వాళ్ళూ కూలీనాలీ చేసుకుంటూ తినీతినకా బ్రతుకులు వెళ్ళబోస్తుండి వుంటారు జీవితంలో ఏ ఆశా, అనుభవమూ లేక జీవచ్ఛవాల్లా వుండి వుంటారు

(ఇంకావుంది)

## రోగం కుదర్చటానికి నిషేధం మందు!

చైనా దేశానికి చెందిన బీజింగ్‌లో రోడ్డుమీద ఉమ్మివేయడం చాలా పెద్ద నేరమట నగరంలో ఎక్కడ చూసినా ఇక్కడ ఉమ్మివేయరాదు అనే హెచ్చరికలు వుంటాయట హద్దుమీరి ఉమ్మేవారిని రక్కున పట్టేయడానికి ప్రత్యేక సిబ్బంది వుందట పబ్లిక్కు రోడ్లమీద, సినిమా థియేటరులలో, పార్కులలో, పాఠశాలల్లో, విమానాశ్రయాల్లో, రైల్వేస్టేషన్లలో, ఫ్యాక్టరీలలో ఎక్కడా ఉమ్మివేయరాదట ఇహసలు ఉమ్మేసేది ఎక్కడయ్యా- జెయిల్లోనా అంటే అసలు చైనీయులకు ఉమ్మే రోగం ఎక్కువ అనీ, అది నివారించడానికే యీ మార్గాలనీ ఆ నగర మేయరు గారన్నారట అయన పేరు జిన్ చిటాంగ్‌ట'

## భార్య నచ్చక ఆత్మహత్య!

మహబూబాబాదుకు చెందిన తిమ్మంపేట గ్రామంలో రాజేందర్ అనే అతను ఎంచక్కా పెళ్ళి చేసుకుని, పెళ్ళయిన పన్నెండో రోజున తన భార్య తనకు నచ్చలేదనీ, తన ఊహాసుందరిలా లేదనీ కినుక వహించి, అంతతో ఆగక, ఎండ్రిను త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడట

## రు. 40 కోసం అన్నని హత్య చేసిన తమ్ముడు!

గద్వాల సమీపంలో వున్న పాతపాలెం గ్రామానికి చెందిన నర్సప్ప అనే రైతు తమ పొలంలో నుయ్యి త్రవ్వించుకోడానికి ఇండియన్ బ్యాంకు ఆరున్నర వేలు అప్పు యిచ్చిందట ఈ డబ్బులో అతడు వో నలభై రూపాయలు ఖర్చు పెట్టి ఆ విషయం తన తమ్ముడికి చెప్తే అతను కోపంతో అంత డబ్బు ఖర్చు చేస్తావురా అని చేతికందిన కర్రతో తన అన్నగారి నెత్తి మీద బలంగా కొట్టాడట దాంతో తల పగిలి, ఆసుపత్రికి తీసుకు వెళ్తుండగా నర్సప్ప చనిపోయాడట

# ఫాల్కని డైరీ

## వేశ్యా వృత్తి చేపట్టని ఇల్లాలి హత్య!

పాలఘాట్‌కు చెందిన 18 ఏళ్ల నజీరా అనే ఆమెను పున్నయార్ కుళంకు చెందిన మెయిదుకుట్టి అనే అతను పెళ్లి చేసుకుని, ఆమెను అబుదాబి అనే అరబ్బు నగరానికి పట్టుకు వెళ్లాడట ఆహా నా అదృష్టం అని ఆమె మురిసిపోయేలోగానే ఆమెను వ్యభిచారంలో దిగమన్నాడట విషయం గ్రహించి ఆమె మొండికేసేసరికిహ అతను, అతని స్నేహితులూ కలసి ఆమెను చావగొట్టే ఆమె చనిపోయిందట శవాన్ని పాలఘాటు తీసుకు వచ్చేశాడటాతను పాలఘాటు పోలీసు లతన్ని అనుమానం పేరిట అరెస్టు చేశారట

## అందం తెచ్చిన అనర్థం!

షంషేర్ గంజ్‌కు చెందిన రవి అనే 25 ఏళ్ళ కామరాజు ఇద్దరు పిల్లల తల్లయిన వో గృహిణి అందానికి పిచ్చెత్తి ఆమె యింట్లో జొరబడి, పగిలిన సీసాతో సినిమా ట్రిపులో చంపేస్తానని బెదిరించి, ఆమెను బలాత్కరించి, తన కామ వాంఛ తీర్చుకున్నాడట అనకాతన్ని పోలీసులు పట్టుకున్నారట – వాళ్లెప్పుడూ అంతే కదా!

## ఆత్మహత్యకి దారి తీసిన విరక్తి!

కడప నుంచి తిరుపతి ఉదర పోషణార్థం వెళ్ళిన అనంతమ్మ అనే ఒకామె ఆ పని చెయ్యలేక, ఇహ బ్రతుకు మీద రోత పుట్టి తన మూడేళ్ళ కొడుకు, రెండేళ్ళ కూతుర్ని వో నూతిలో పడేసి, తానూ దూకేసిందట అది చూసిన వారు వాళ్ళను రక్షించ ప్రయత్నిస్తే రెండేళ్ళ పిల్ల మాత్రం దక్కిందట

## పెన్సిల్‌తో వైద్యం!

మలేషియాలోని ముస్లిమ్ డాక్టర్లు వారి ఇస్లాం చెప్పిన ప్రకారం అన్యుల శరీరాలను తాకక, వో పెన్సిలుతో ముట్టుకుని చూసి వైద్యం చేయడాన్ని మలేషియా ప్రధాని విమర్శించారట పరాయి శరీరం ముట్టుకుంటే ఇస్లాం ప్రకారం నరకానికి పోవడం అలా వుంచి, రోగిని సరిగా పరిశీలించి మందు యివ్వకపోడం వల్ల ఆ రోగి చనిపోతే నరకమే గాక, జైలు కూడా తప్పదన్నారటాయన

## మీసాలకి భరణం!

ధ్యానూ చవాన్ అనే చర్మకారుడికి 32 అంగుళాల మీసాలున్నాయట ఈ మీసాలకు అతడు తానుంటున్న కర్ణాటక ప్రభుత్వం నుంచి నెలకు 101 రూపాయలు పింఛను పుచ్చుకునేవాడట అతడు ఇపుడు మహారాష్ట్రంలో స్థిరపడి, ఆ ప్రభుత్వానికి మీసాల భరణం యివ్వాలని దరఖాస్తు పెట్టుకున్నాడట మగతనమంతా మీసాలలోనే వుంటుందని అతడు సగర్వంగా చెప్తాడట– కాదు మరీ

## సితార్‌కి సమాన హోదా!

పండిట్ రవిశంకర్ విదేశాలకు తన కచ్చేరీలకు వెళ్ళేటప్పుడు విమానంలో రెండు టిక్కట్లు కొంటారంట ఒక టిక్కట్టు తనకు, మరొకటి తన సితార్‌కూనట తన సితారు కాయన మిస్టర్ సితార్ అని టిక్కట్టు కొంటారట ఈ రెండు టిక్కట్లూ పకపక్కనే వుండేలా కొంటారటాయన ప్రపంచంలోనే తన వాద్యానికి అంత గౌరవమిచ్చే మరో వ్యక్తి లేనేలేరట □






# దేవత

## జె. సుబ్బలక్ష్మి

ఆ రోజు నర్సు ప్రమీలది నైట్‌డ్యూటీ

అప్పుడు సమయం పదకొండు గంటలు వార్డంతా మరోసారి కలయతిరిగి వచ్చి తన సీట్లో కూర్చుంది ప్రమీల రోగులందరూ మంచి నిద్రలో ఉన్నారని నిశ్శబ్దంగా, ప్రశాంతంగా వున్న వార్డు చెప్పకచెబుతోంది రాత్రిళ్ళు ఉండి ఉండి వినిపించే పసిపిల్లల ఏడుపులు కూడా వినిపించడం లేదు

కుర్చీలో కూర్చునే ప్రమీల వరసగా వున్న మంచాల వైపు చూపులు సారించింది రకరకాల భంగిమల్లో నిద్ర పోతున్న రోగుల మొహాలలో సంతృప్తి, సంతోషం కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి తమ పసిపాపలను ప్రేమగా, లాలనగా గుండెల కదుముకుని పడుకున్న ఆ 'రోగుల్లో' అదో విధమైన గర్వం కూడా తొంగి చూస్తోంది ప్రమీల కెందుకో నవ్వొచ్చి పక్కున నవ్వింది వివిధరకాల జబ్బులతో బాధపడుతూ, రోగాలతో మూల్గుతూ, మూల్గుతూ ఆస్పత్రికి చేరేవాళ్ళని రోగులు' అని పిలిచినా బావ్యంగా వుంటుంది కాని ఇంట్లో ఇంచక్కా కావలసినవన్నీ చేయించుకు తింటూ, హాయిగా తిరుగుతూ నెలలు నిండగానే అప్తులతో, ఆత్మీయులతో కలిసివచ్చి ఆస్పత్రిలో చేరి అందరి ముద్దు మురిపాలనందుకునే పసిబిడ్డలకు జన్మనిచ్చి తమ జన్మ తరించినట్టు అనుభూతి చెందుతూ హాయిగా, సుఖంగా కాలక్షేపం చేసే ఈ తల్లులను రోగులు అనడం ఏం బావ్యం ' తమను ఎంతగానో ప్రేమించే తల్లితండ్రులకూ, భర్తలకూ, బంధువులకూ ఇబ్బంది కలిగించడం ఇష్టంలేక డాక్టర్లు, నర్సులు, ఆయాలచేత సేవలు అందుకోడానికి ఇక్కడికి వస్తారు అంతే ఆ తరువాత తమ దాంపత్య ఫలాన్ని చేతుల్లో నిండుగా ఎత్తుకుని గర్వంతో విర్రవీగుతూ ఇంటికి చేరుకున్నారంటే ఇక అంతె ఆ తరువాత ఆస్పత్రినీ, ఇక్కడి సిబ్బందినీ, తాము అందుకున్న సేవలనీ ఇట్టే మరిచిపోతారు

ఇలా ఆలోచిస్తూ కూర్చున్న ప్రమీలకు ఒకదాని వెంట ఒకటిగా ఆవలింతలు రావడం మొదలుపెట్టాయి కనురెప్పలు బరువెక్కి నెమ్మదిగా మూసుకుపోసాగాయి కాసేపు బలవంతాన కళ్ళు తెరుచుకుని కూర్చుందిగానీ ఆ తరువాత ఇక నిద్ర నాపుకోవడం కష్టమనిపించి ముందున్న బల్ల మీద ఒరిగిపోయింది

కాస్త కునుకు పట్టిందో లేదో – ఈలోగా భుజంపై ఎవరిదో చెయ్యి పడేసరికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది ప్రమీల ఎదురుగా డాక్టర్ వసుంధరాదేవి నిలబడి వుంది

ప్రమీల చటుక్కున లేచి నిలబడి ఎస్ డాక్టర్ అంది

రౌండ్సు పూర్తయ్యాయా సిస్టర్? డాక్టరు వసుంధరాదేవి ప్రశ్నించింది

అయ్యాయి డాక్టర్ సమాధానమిచ్చింది ప్రమీల

ఆ చివరి బెడ్ అమ్మాయి ఏమంటోంది?

ఇప్పుడు బాగానే వుంది డాక్టర్

'కాస్త జాగ్రత్తగా కనిపెడుతూ వుండండి ఆమెని '

అలాగే డాక్టర్

డాక్టర్ వసుంధరాదేవి వెళ్ళిపోయింద వార్డు ప్రక్కనే డ్యూటీ రూమ్ 'ఈవిడ ఇప్పుడు ఈ డ్యూటీరూమ్‌లో హాయిగా పడుకుని నిద్రపోతుంది కాబోలు తనలాంటి నర్సులు మాత్రం రాత్రంతా మేల్కొని వుండి రోగులను కనిపెడుతూ, అవసరమైనప్పుడు వాళ్ళకు సేవలు చేయాలి ఇంకా అవసరమైతే పరుగెత్తుకెళ్ళి డ్యూటీలో వున్న డాక్టరును నిద్రలేపి తీసుకురావాలి ఇక 'బికేర్‌ఫుల్ జాగ్రత్త! లాంటి మాటలు రోజుకు ఎన్నిసార్లు వినాలో? అయినా తన డ్యూటీలో ఎలాంటి లోపం జరగకపోయినా ఈ మాటలు వినడం మాత్రం తప్పదు

– డ్యూటీలో వున్న నర్సులు మందుసీసాల లేబుల్స్ చూడకుండా అది ఏ పేషెంట్‌కివ్వాలో గమనించకుండా తీసుకెళ్ళి ఎవరి నోట్లోనో పోసేస్తారేమోననీ, ఒకరికివ్వాల్సిన ఇంజెక్షన్ మరొకరికి ఇచ్చేస్తారేమోననీ ఈ డాక్టర్లు అనుకుంటారు కాబోలు తమ గురించి? –

ఆస్పత్రుల్లో పసి బిడ్డలకు స్నానం చేయించడానికి తీసుకెళ్ళినప్పుడు వారు మారిపోతూ వుండడం, వార్డుల్లోకి కుక్కలు వచ్చి పసిబిడ్డల నెత్తుకుపోవడం వంటి వింత వార్తలన్నీ పత్రికల్లో చదివి – తమ ఆస్పత్రిలో కూడా అలాంటిదేదైనా జరుగుతుందేమోనని భయం కాబోలు? అయినా మరీ అంత నిర్లక్ష్యంగా ఎవరుంటారబ్బా ?

– అంతకు ముందున్న నిద్రమత్తంతా ఎగిరిపోగా మళ్ళీ ఆలోచనల సుడిలో కూరుకుపోయింది ప్రమీల

అంతలో ఒక నీరసమైన ఎలుపు వినిపించింది – సిస్టర్ అని

ప్రమీల వరసగా వున్న మంచాలకేసి దృష్టి మళ్ళించింది కాని ఆ పిలుపు ఏమంచం నుంచి వచ్చిందో తెలియలేదు . ఎవరి పిలుపయి వుంటుంది ? అని అనుకుంటూ వుండగ్గానే చివరి బెడ్ మీదున్న పేషెంట్ ఈసారి చెయ్యెత్తి సిస్టర్ అని పిలవడం వినిపించింది

ప్రమీల చటుక్కున లేచి ఆమె దగ్గరికి నడిచింది ఏమ్మా ఏం కావాలి? అని అడగింది మృదువుగా

కాసేపు ఇక్కడే కూర్చోండి సిస్టర్ నాకేమిటో చాలా బాధగా వుంది

ఇప్పుడు అలాగే వుంటుందమ్మా నెమ్మదిగా అదే సర్దుకుంటుందిలే! అనునయిస్తూ అంది ప్రమీల

అసలు నన్ను నామానాన చావనీయకుండా ఇక్కడికి తీసుకొచ్చి ఎందుకు బతికించారు సిస్టర్?

ఇప్పుడెందుకమ్మా అవన్నీ? జరిగిందంతా మరిచిపోయి హాయిగా నిద్రపో!

అదికాదు సిస్టర్ అసలు నాలాంటి నిర్భాగ్యురాలు లేకపోతే ఈప్రపంచానికొచ్చిన నష్టమేమిటి?నేను బతికుంటే సమస్యలు, కష్టాలు అంతకంతకూ అధికమవుతాయి చచ్చిపోతే ఏ సమస్యా ఉండదని ఆత్మహత్యకు పాల్పడ్డాను కానీ మీరు నన్ను రక్షించాననుకుని మళ్ళీ సమస్యల సుడిగుండంలోకి తోశారు

పిచ్చిదానా మానవ జీవితాలే సమస్యల పుట్ట ఎదురైన కష్టాలను ధైర్యంతో ఎదుర్కోవాలి తప్ప బలవంతాన ప్రాణాలు తీసుకోవడం పిరికితనం '

ఆమె పెద్దగా నిట్టూర్చి 'పిరికితనం అని నాకూ తెలుసు కానీ బతకడానికి ఇంకే మార్గమూ లేనప్పుడు అంతకంటే చేసేదేముంది – చెప్పండి సిస్టర్? అంది అప్పటికే ఆమె గొంతు దుఃఖంతో పూడుకుపోయింది

మనసుంటే మార్గం కనిపించకపోదమ్మా రేపు నీకు పుట్టబోయే బిడ్డే నీకు మార్గదర్శకుడవుతాడు చూస్తుండు ముఖ్యంగా నువ్వు ధైర్యంగా ఉండాలి అంతే!"

అంతలోనే బాధగా అరిచింది ఆమె "అమ్మా

అబ్బా చాలా నొప్పిగా వుంది సిస్టర్ కొంచెం డాక్టర్‌ని పిలుస్తారా? ప్లీజ్

బయపడకమ్మా నీకిప్పుడప్పుడే కాన్పు కాదు ఇంకా టైముంది కాసేపు నిద్ర పోవడానికి ప్రయత్నించు అని చెప్పి తన సీటుకేసి వెళ్ళిపోయింది ప్రమీల

★ ★ ★ ★ ★

ఏమంటున్నాడు నీ సుపుత్రుడు? వార్డులో అటూ ఇటూ తిరుగుతూ తన పని చేసుకుంటూనే చివరి బెడ్ పేషెంట్ నడిగింది ప్రమీల

'సిస్టర్‌ని చూడాలి అంటున్నాడు నవ్వుతూ చెప్పింది ఆమె

అలాగేం? నన్ను మాత్రమేం కర్మ మొత్తం ప్రపంచాన్నే చూడాలంటాడేమో కనుక్కో! అని తనూ నవ్వింది ప్రమీల

చేతిలో పని పూర్తి కాగానే చివరి బెడ్ వద్దకు వచ్చి నిలబడింది

మీరు చేసిన సహాయాన్ని నేను ఈ జన్మలో మరువలేను సిస్టర్ ఆత్మహత్య నుంచి నన్ను రక్షించి ఇక్కడికి తీసుకొచ్చి ఇన్నాళ్ళూ నాకు సపర్యలు చేసి ఈ ముద్దులబిడ్డను నాకందించారు మీరు నాపై అంత శ్రద్ధ చూపి నాకోసం అంత శ్రమపడి నన్ను ఆదుకోకపోతే నేను ఏమైపోయేదాన్నో ?

ఈ మాటలు అంటుంటె ప్రమీల పట్ల కృతజ్ఞతతో ఆమె గొంతు ఆర్ద్రమైంది

అబ్బె ఇందులో నేను ప్రత్యేకంగా చేసిందేముందని? ఒక మనిషి చనిపోతుంటే మానవత్వం ఉన్నవారెవరూ చూస్తూ ఊరుకోరు నేనూ అదే చేశాను ఇక ఇక్కడ నర్సుగా నాడ్యూటీ




చేశాను అంతే!

అలా అనకండి సిస్టర్ మొదటి నుంచీ నాపట్ల మీరు ఓ ప్రత్యేకమైన అబిమానం చూపుతున్నట్లు నాకు అనిపిస్తోంది అయితే నామీద మీకెందుకింత ప్రేమో నాకర్థం కావడంలేదు అంటూ ఆమె చెమ్మగిల్లిన తన కళ్లను కొంగుతో తుడుచుకుంది

అలాంటిదేం లేదమ్మా నా అన్నవాళ్ళెవరూ లేని ఒంటరిదానివని తెలిసినప్పటి నుంచి నా మనసు నీ పట్ల ఆకర్షితమైంది ఎందుకంటే నేనూ నీలాగే ఒంటరిదాన్ని పొన్లే అవన్నీ ఇప్పుడెందుకు గానీ నువ్వు పడుకుని రెస్ట్ తీసుకో! అని వెళ్లబోతున్న ప్రమీల ఆమె ఏడుస్తూ వుండడం చూసి మళ్ళీ ఆగిపోయింది

చ! పచ్చిబాలింతలు ఇలా ఏడవ కూడదమ్మా! ఏడిస్తే తల నొప్పి వస్తుంది ఒక్కోసారి జ్వరం కూడా రావచ్చు అంటూ వారించింది

ఆమె కళ్ళు తుడుచుకుని ఎవరైనా ఇలా ఆప్యాయంగా మాట్లాడినప్పుడల్లా ఏవేవో పాత జ్ఞాపకాలు వచ్చేస్తాయి సిస్టర్ అంది

ప్రమీల వాచీ చూసుకుని అరె చాలా టైమయిపోయిందే ? ఇక నేవెళ్తానమ్మా నువ్వు పడుకుని నిద్రపో! అనేసి అక్కణ్నుంచి వెళ్ళిపోయింది

★ ★ ★ ★

అబ్బ! ఈమందు చాలా చేదుగా వుంది నాజీవితం లాగే! అంది ఆమె రాని నవ్వును పెదాల మీదికి

తెచ్చుకుంటూ

తియమంపు అదే మధురమైన జీవితం కావాలంటే మాత్రం అందరికి లభిస్తుందా? అని తనూ నవ్వింది ప్రమీల

ఈరోజేమిటో వింతగా మాట్లాడుతున్నారు సిస్టర్ మీరు?

ఇందులో వింతేముంది? నువ్వు ఏ ఉద్దేశంతో అన్నావో నేనూ అదే ఉద్దేశంతోనే అన్నాను అంతే! అని కాసేపు ఆగింది ప్రమీల ఏదో ఆలోచిస్తున్నట్లుగా వయసు పొంగులో మనం వేసే తప్పటడుగుల పరిణామం మనకు అప్పుడు తెలియదు అంది

ఆమె సిగ్గుతో తల వంచుకుంది

నిజమే సిస్టర్ అప్పుడు నాకది తప్పుగా తోచలేదు దాని ఫలితం ఇప్పుడు అనుభవిస్తున్నాను అది సరేగాని సిస్టర్ గర్భంలో ఉన్నన్ని రోజులూ నేను అమితంగా ద్వేషించిన ఈబిడ్డపై ఇప్పుడు ఉన్నట్టుండి ఇంతటి ప్రేమ వాత్సల్యం పొంగుకొస్తున్నాయేమిటా అని నాకే ఆశ్చర్యంగా ఉంది అంటూ ఒళ్ళోవున్న పసిబిడ్డను ప్రేమతో గుండెల కదుముకుంది

ప్రమీల నవ్వి ఆబిడ్డ లేతబుగ్గపై తట్టింది చూశావా అక్కడే వుంది జీవిత పరమార్థం బిడ్డ మొహం చూడగానే మాతృహృదయం ఉప్పొంగి మమతానురాగాల వర్షాన్నే కురిపిస్తుంది ఆ బిడ్డ ఏ పరిస్థితులో ఎవరి వల్లనైనా పుట్టనీ, చూడటానికెలాగైనా ఉండని తల్లికి తన బిడ్డ అంటే ప్రేమ సహజంగా ఉండనే వుంటుంది బిడ్డను తన ప్రాణం కంటే ఎక్కువగా ప్రేమించడం ప్రతి తల్లికి సహజం ఒకరకమైన తన్మయత్వంతో చెప్పుకుపోయింది ప్రమీల

ఆ మాటలు వింటుంటే ఆమె హృదయం ద్రవించింది తన మనసులోని బాధను ప్రమీలతో చెప్పుకోవాలనిపించింది

సిస్టర్ నేను ఈ ఆస్పత్రిలో చేరినప్పటి నుంచి మీకు నా గాథను వినిపించాలని ఎంతో ఆరాటంగా ఉంది మీరు చెప్పమంటే చెబుతాను

మనసులోని బాధ ఒకరితో చెప్పుకుంటే తగ్గుతుందంటారు నీకంతగా చెప్పాలనిపిస్తే నిరభ్యంతరంగా చెప్పొచ్చు

ఆమె చెప్పనారంభించింది -

నేనూ రాజేంద్ర అనే అబ్బాయి ఒకే కాలేజిలో చదువుతూ వుండేవాళ్ళం ఎవరివంకా అసలు కన్నెత్తయినా చూడని నేను రాజేంద్ర వలలో ఎలా పడ్డానో నాకే తెలియదు బహుశా అతని తీయని మాటలకు నా మనసు మోసపోయింది కాబోలు శరీరాలు వేరైనా మన మనసులు ఒకటే అన్నాడు కులం మతం, కట్టుబాట్లు సంప్రదాయాలు అన్నీ, ఒట్టి బూటకాలన్నాడు ఎవరేమన్నాసరే నిన్ను పెళ్ళాడితీరుతాను అని మాటిచ్చాడు అదంతా నిజమేనని నమ్మి నేను అతనితో స్వేచ్ఛగా

## దేవత

నిస్సంకోచంగా తిరిగాను కన్నెపిల్లలకు ఉండవలసిన హద్దుల్ని కూడా దాటి ముందుకు వెళ్ళిపోయాను చివరికి అతని కనుసైగలతో మెలిగే బొమ్మగా మారిపోయాను కాని అదంతా మోసం వంచన అని తెలుసుకునేటప్పటికే రాజేంద్ర అయిపు లేకుండాపోయాడు అతని కోసం పరితపిస్తూ నేను నా చదువును నాశనం చేసుకున్నాను

సరిగ్గా అదే సమయానికి మా అన్నయ్య ఫ్రెండుకి నన్నిచ్చి పెళ్ళి చేయాలని ఆలోచిస్తున్నారు మావాళ్ళు ఈలోగా నా కడుపులో మా ప్రేమఫలం రూపం దాలుస్తోందని గ్రహించాను ఇప్పుడేం చేయాలి? అన్న ప్రశ్నతో బాటు తెలీని భయం కూడా ఆవరించి రాత్రింబవళ్ళు అదే బెంగయిపోయింది ఏమీ ఎరగనట్టు ఆ పెళ్ళికి ఒప్పుకుని వుంటే నేను చేసిన తప్పు కప్పబడిపోయేది నాక్కూ, నా బిడ్డకూ సమాజంలో ఒక స్థానం, గౌరవం లభించేవి కానీ ఒకరివల్ల మోసపోయిన నేను మరొకర్ని మోసం చేయడానికి నా మనసు ఒప్పలేదు అందుకని బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను ఎవరినీ ఇబ్బంది పెట్టకుండా ఎవరినీ బాధించకుండా ఇల్లొదిలి వచ్చేశాను ఏదైనా ఓ ఉద్యోగం చూసుకుని నా పొట్ట నేను పోషించుకోగలనన్న ఆత్మవిశ్వాసం నాలో బలంగా వుండేది చదువు సంస్కారం, తెలివితేటలు వున్న నాలాంటి అమ్మాయి బతకడానికి ఎన్నో మార్గాలున్నాయిలే అన్న ధీమాతో ఉద్యోగం వేట ఆరంభించాను కాని ఉద్యోగం దొరకడం నేను అనుకున్నంత సులభం కాదని కొద్దికాలంలోనే తెలిసిపోయింది అయినా ప్రయత్నాలు మటుకు మానలేదు రోజులు గడిచిపోతున్నాయి తప్ప నాకెక్కడా ఉద్యోగం దొరకలేదు ఓ చిన్నగది అద్దెకు తీసుకుని అందులో ఉండేదాన్ని వెంట తెచ్చుకున్న డబ్బు ఎప్పుడో అయిపోయింది ఒంటి మీదున్న నగలు కూడా అప్పుడొకటి, అప్పుడొకటిగా బజారు చేరుకున్నాయి అంతమాత్రమే అయితే నేనేం భయపడేదాన్ని కాదు కాని రోజురోజుకి ముందుకు వస్తున్న నాపొట్ట అందరి దృష్టిని ఆకర్షించసాగింది మెడలో మంగళసూత్రం లేకుండా గర్భవతి అయిన నన్ను చూసి ఇరుగు పొరుగు అమ్మలక్కలు గుసగుస లాడు కునేవారు వాళ్ళ చూపుల్లో తిరస్కారభావం నిండి వుండేది కొందరైతే నాకు వినిపించేటట్టే చాలా అవమానకరంగా మాట్లాడేవాళ్ళు నా పరిస్థితి చూసి జాలి, సానుభూతి చూపేవాళ్ళు ఒక్కరూ కనిపించకపోవడంతో నాలో నేనే కుమిలికుమిలి ఏడుస్తూ గదిలోనే ఉండిపోయేదాన్ని అలాఅలా తొమ్మిది నెలలూ గడిచిపోయాయి అంతవరకూ అందరి అవమానాలు తిరస్కారాలు భరిస్తూ వచ్చిన నాకు ఇక భరించే ఓపిక లేకపోయింది ఈ

బాధల నుండి తప్పించుకునే మార్గం ఇక ఒక్కటే మిగిలింది నాకు అదే ఆత్మహత్య వెంటనే మోతాదును మించి నిద్ర మాత్రలు మింగేశాను ఆ తరువాత జరిగిందంతా మీకు తెలిసిందే!

అంతలో ప్రమీల అందుకుని నేనారోజు డ్యూటీ నుంచి ఇంటికి వెళుతూ నీ గది ముందు చాలామంది జనం గుమిగూడి వుండడం చూశాను దగ్గరికి వచ్చి ఎవర్నో కనుక్కుంటే సంగతి తెలిసింది వెంటనే జనం మధ్య నుంచి దారి చేసుకుని లోపలికి వచ్చాను నీ పక్కన నిద్రమాత్రల ఖాళీ సీసా కనిపించగానే గాబరాతో నీ నాడి పట్టుకు చూశాను నీకింకా ప్రాణం పోలేదని పసిగట్టగానే అక్కడున్నవాళ్ళ సాయంతో నిన్నిక్కడికి తీసుకొచ్చి నిన్ను బతికించడానికి ప్రయత్నాలు మొదలెట్టాం ఎలాగైతేనేం మా ప్రయత్నాలు ఫలించాయి నువ్వు బతికి బయటపడ్డావు అదృష్టంకొద్దీ నీ కడుపులో ఉన్న పసిబిడ్డకు ఏమీ ఎఫెక్ట్ కాలేదు అందుకు సంతోషించాలి మనం అంది

మళ్ళీ ఏదో గుర్తుకొచ్చినట్టు అంది ప్రమీల నువ్వు నాకో మాటివ్వాలి అని

నేనా ? ఆశ్చర్యంగా చూసింది ఆమె

అవును నువ్వే ఇంకెప్పుడూ ఆత్మహత్య మాట తలపెట్టనని మాటివ్వు

ఆమె ఏం మాట్లాడలేదు ఏదో ఆలోచిస్తూ మౌనంగా కూర్చుండిపోయింది

ఆ మాటివ్వడానికి ఇంత ఆలోచన ఎందుకు? నువ్వు పోతే ఈ బిడ్డ గతేమవుతుందో ఆలోచించావా?

దిక్కులేని అనాధ అనిపించుకుంటాడు అంతేగా? విరక్తిగా అంది ఆమె

నీ కడుపున పుట్టిన బిడ్డను పెంచి పెద్ద చేసి మంచిమనిషిగా తీర్చిదిద్దవలసిన బాధ్యత నీపై వుంది అంతేగాని వాణ్ని అనాథగా మిగిల్చే హక్కు నీకులేదు

ఎంతో కాలంనుంచి కలిసివున్న స్నేహితురాళ్ళల్లా మనసు విప్పి మాట్లాడుకుంటున్న వాళ్ళిద్దరిలో ఎవరూ డాక్టరు రావడం గమనించలేదు

సిస్టర్ అంటూ దగ్గరికి వచ్చిన లేడీ డాక్టరు ఓ ఏదో సీరియస్‌గా మాట్లాడుకుంటున్నట్టుందే ? అనగానే ప్రమీల చటుక్కున లేచి నిలబడింది

లేడీ డాక్టరు పేషెంటు వైపు తిరిగి ఎలా ఉన్నావమ్మా? అని అడిగింది

బాగానే వున్నాను డాక్టర్ అంది ఆమె

★ ★ ★ ★

ఆ రోజు ఉదయం డ్యూటికి రాగానే ప్రమీల ముందు చివరి బెడ్ పేషెంట్ దగ్గరికి వచ్చి ఈ రోజు నిన్ను డిశ్చార్జ్ చేస్తారమ్మా అని చెప్పింది

పిడుగు పడ్డట్టయింది ఆమెకు

# ప్రేమ్ సబ్బుతో స్నానం రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మరియు ఆకుపచ్చ
రంగులలో లభించును.



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

"ఏమిటీ....ఏమన్నారు?" అంది తడబడుతూ.

ఆమె కంగారు భయం చూసి ప్రమీలకు నవ్వొచ్చింది.

"ఈ రోజు నిన్ను డిశ్చార్జ్ చేస్తారమ్మా అన్నాను అంతె. దానికంత కంగారెందుకు?"

ఆమె మొహం పాలిపోయింది. కళ్లల్లో భయం చోటుచేసుకుంది.

"ఈ రోజే వెళ్లిపోవాలా సిస్టర్?" అని దీనంగా అడిగింది.

"ఇక్కడి రూల్స్ ప్రకారం డిశ్చార్జ్ అయినరోజే ఇంటికీ వెళ్లిపోవాలి. తల్లీ బిడ్డల ఆరోగ్యం బాగుంటేనే డాక్టర్‌గారు డిశ్చార్జ్ చేసేది!" అని ప్రమీల వివరించింది.

ఆమెకు అప్పటికే ఏడుపు ముంచుకు వచ్చేస్తుంది. ఎలాగో అతికష్టంగా మాటలు కూడదీసుకుని అంది. "ఆ మాట నిజమే సిస్టర్.... కానీ ఇప్పుడు నేను ఎక్కడికి వెళ్లాలి అని?"

ప్రమీల ఆమెవైపు జాలిగా చూస్తూ "వెళ్లాలికదమ్మా.... ఎల్లకాలం ఇక్కడే ఉంచరుగా? ఇది ఆసుపత్రి నీకు తెలయందేముంది?"

"ఇప్పుడే వెళ్లిపోవాలా స్టర్? నాకు కొంచెం ఆలోచించడానికి కూడా టైమ్ ఇవ్వరా? ఇన్నాళ్లూ నాకో చిన్నగదైనా ఉండేది. ఈ పాటికి ఇంటాయన ఆ గదిని స్వాధీనం చేసుకునే వుంటాడు. నేను రెండు నెలల అద్దె బాకీ వున్నాను. అలాంటప్పుడు ఏ మొహం పెట్టుకుని వెళ్లేది!" అని వెక్కి వెక్కి ఏడవసాగింది ఆమె. రెండు చేతుల్లోనూ మొహం దాచుకుని దీనంగా విలపిస్తున్న ఆమెను ఇక చూడలేకపోయింది ప్రమీల. తన కళ్లల్లో కూడా నీరు తిరుగుతుండగా ఆమె మొహాన్ని పైకెత్తి కళ్లనీళ్లు తుడిచింది. ఆ తరువాత వీపుమీద ఆప్యాయంగా నిమురుతూ "ఏడవకమ్మా....ఇప్పుడే వెళ్లక్కరలేదు. డాక్టర్ వచ్చి డిశ్చార్జ్ చేస్తారు. అంతవరకూ టైమ్ ఉంది." అంది.

ఆమె ఏడుస్తూనే "ఈ పసిబిడ్డ నెత్తుకుని నేను ఎక్కడికెళ్లాలి. సిస్టర్?" అంది.

ప్రమీల ఆమె మొహాన్ని పైకెత్తి "మా ఇంటికి" అంది.

ఆమె ప్రమీల వైపు ఆశ్చర్యంగా చూసింది. ఆమె కళ్ళు 'ఇది నిజమా?' అని ప్రశ్నిస్తున్నట్టుగా వున్నాయి.

ప్రమీల నవ్వుతూ "ఏమిటలా ఆశ్చర్యంగా చూస్తున్నావ్? నిజంగానే చెబుతున్నాను.మీ ఇద్దర్నీ పోషించడం నాకు పెద్ద బరువుకాదు. బాబు పెద్దవాడైదాకా ఉండి ఆ తరువాత ఏదైనా ట్రైనింగ్ చేసుకుని ఉద్యోగం సంపాదించవచ్చు. నీకాళ్లమీద నువ్వు నిలబడే దాకా నువ్వు మా ఇంట్లో వుండు" అంది

"మరి మమ్మల్ని మీ ఇంటికి తీసుకెళితే మీ ఇంట్లోవాళ్ళు ఊరుకుంటారా?" అంది ఆమె అనుమానంగా.

ప్రమీల తేలిగ్గా నవ్వి "మా ఇంట్లో నాకు అడ్డు

# ఇంధన కణాలు!

థర్మల్ శక్తి, హైడ్రాలిక్ శక్తి, అణుశక్తి తరువాత నాలుగవదైన ఇంధన కణాలను పెంపొందించడానికి జపాన్‌లో పోటీ అంతకంతకూ ఉధృత రూపం దాల్చుతోంది. ఈ పోవటంలో ప్రధాన విద్యుచ్ఛక్తి సంస్థ, నగం గ్యాస్ సంస్థలూ, విద్యుచ్ఛక్తి స్టోరేజి బ్యాటరీలను తయారు చేసే సంస్థ పాల్గొంటున్నాయి.

రసాయనిక శక్తిని సరాసరి మార్పు చేసే ఇంధన కణాలు ఇంధనంగా, విద్యుచ్ఛక్తితో విద్యుత్ రసాయన ప్రతిక్రియ ద్వారా వినియోగించబడతాయి. బొగ్గు, పెట్రోలియంని మండించడం వలన 40 శాతం ఉష్ణ శక్తి ఉత్పత్తికాగా దీనివల్ల 80 శాతం ఉత్పత్తి అవుతుంది.

(జ. వా)

# దేవత

చెప్పేవాళ్ళు ఎవరున్నారని? ఇంట్లో వుండేదే ఇద్దరం నేనూ, మా పాప ఉష." అంది.

"మరి మీ వారు....?" అంటూ సందేహంగా ఆగిపోయింది ఆమె.

ప్రమీల పెదాల మీది నవ్వు వెంటనే మాయమైంది. ముఖం గంభీరంగా మారిపోయింది.

"హు.... మా వారు!" అంటూ పళ్ళు పటపటా కొరికి "అసలు పెళ్లంటూ అయితేగా నాకు మా వారంటూ ఉండడానికి?"

ఆమెకు ప్రమీల మాటలు అర్థంకాలేదు. తెల్లబోయి చూసింది ప్రమీల వైపు.

"అంతలా తెల్లబోయి చూస్తావే?" నాదీ నీలాంటి కేసేనమ్మా! అందుకే నాకు నీమీద జాలీ, సానుభూతి. కానీ నీలా పిరికితనంతో నేను ఆత్మహత్యకు పాల్పడలేదు. ధైర్యంతో ఈ సమాజాన్ని ఎదిరించి నిలబడగలిగాను. ఈరోజు నన్ను అందరూ గౌరవిస్తారు. ఒకప్పుడు నన్ను హేళన చేసినవారే ఈ రోజు నన్ను దేవతగా చూస్తున్నారు. కారణం – ఈ ఆస్పత్రిలో నర్సుగా ఉండటం. అందుకే ఈ ప్రపంచంలో ఎవరికీ భయపడకూడదు; దేనికీ భయపడకూడదు. ఎలాంటి కష్టాలకీ కుంగిపోకూడదు, ఎలాంటి అవమానాలకీ తిరస్కారాలకీ జడవకూడదు. అందరినీ ఎదిరించి ధైర్యంతో ముందడుగు వేస్తే మనం సాధించలేనిది ఏదీ ఉండదు." అని ప్రమీల ఇంకా చెబుతూవుంటే ఆమె అడ్డుతగిలి "అసలు దీనికంతా కారణం ఎవరు సిస్టర్?" అని అడిగింది.

"ప్రభాకర్ అనే ఒక మోసగాడు. అతను నన్ను నమ్మించి మోసంచేసి తీరా పెళ్లి దగ్గరకొచ్చేసరికి పరారయ్యాడు. నేనూ నీలాగే అతని మాయమాటలు నమ్మి మోసపోయాను. ఇది నేను చేసిన పెద్ద పొరపాటు. ముందే పెళ్లి చేసుకుని ఆ తరువాత ఇద్దరూ చేరువవుదామని గట్టిగా పట్టుపట్టి వుంటే అతని అసలు రంగు బయటపడేదేమోగానీ నాకప్పుడు అతని వ్యామోహంలో ఏదీ తెలిసిరాలేదు. ఎప్పుడైతే నేను నెల తప్పానో అప్పట్నుంచీ అతను అయిపులేకుండా పోయాడు. కన్నెగా ఉంటూ గర్భవతి అయిన నన్ను చూసి సమాజం హేళన చేసినా నేను ఖాతరు చేయలేదు. ధైర్యంగా సమాజాన్ని ఎదిరించి నా చిన్నారి పాపకు జన్మనిచ్చాను....ఇప్పుడు దాన్ని పెంచి పెద్దచేసి డాక్టర్ చేయాలన్న ఉద్దేశంతో బతుకుతున్నాను. నేనే గనక నర్సు ట్రైనింగ్ చేయకపోయినట్లయితే ఎలాంటి ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సి వచ్చేదో నిన్నిప్పుడు చూస్తునే తెలుస్తోంది. ఇప్పటి నీ పరిస్థితే అప్పుడు నాకూ ఎదురయ్యేది. కానీ నేను జాగ్రత్తపడి నర్సు ట్రైనింగ్ చేయడంవల్ల నాకు ఈ ఆస్పత్రిలో నర్సు ఉద్యోగం దొరికింది. ఒకప్పుడు నన్ను నిందించినవాళ్లే ఇప్పుడు నన్ను గౌరవిస్తున్నారు, చేతులెత్తి నమస్కరిస్తున్నారు. తమ బిడ్డల్ని ఇళ్లకు తీసుకెళ్లేటప్పుడు తమ కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నారు. ఆస్పత్రిలో ఉన్నవాళ్ళు నా సేవలు అందుకున్నందుకు కానుకలు అర్పిస్తున్నారు. అందుకే చెబుతున్నానమ్మా.... నువ్వు నాలానే ఏదైనా ట్రైనింగ్‌లో చేరు ఉద్యోగం తప్పకుండా దొరుకుతుంది. బాబును చూసుకుంటూ జీవితం గడిపేయ్. జరిగింది మరిచిపో!"

ఆమె కళ్ళూ, నోరూ వెళ్లబెట్టి ప్రమీల వైపు అలా చూస్తూ వుండిపోయింది. కానీ ఆమె ధైర్యానికి మనసులోనే జోహార్లర్పించకుండా ఉండ లేకపోయింది.

మళ్లీ ప్రమీలే చెప్పసాగింది.

"నేను చాలా కాలంగా ఈ నర్సు ఉద్యోగం చేస్తున్నాను. నా సర్వీసులో ఎంతోమంది పేషెంట్లను చూశాను. అయితే ఇలాఎవరితోనూ చనువుగా మాట్లాడి నా స్వంత విషయాలు చెప్పుకోలేదు. వాళ్ల కష్టసుఖాలూ కనుక్కోలేదు. నా డ్యూటీ ప్రకారం వాళ్లకు సేవలు చేశానుగానీ మనస్ఫూర్తిగా ఎవరికీ ఏమీ చేయలేదు. అటువంటప్పుడు నువ్వుమాత్రం నన్నెలా ఆ కట్టుకోగలిగావో నాకిప్పటికీ అర్థంకాదు. బహుశా నాదీ, నీదీ ఒకేకేసు కావడం దీనికి కారణం కావచ్చు.

ప్రమీల ఇంకా ఎంత సేపలా మాట్లాడుతూ ఉండేదోగానీ అంతలో ఎవరో ఆమెను పిలవడంతో చప్పున వాస్తవంలోకి వచ్చింది. పిలుపువినిపించిన వైపు వెళుతూ ప్రమీల" ఆఁ...మన ఈ చరిత్ర కేమిటిగానీ.... నేను డ్యూటీ పూర్తి చేసుకుని తిరిగొచ్చే సరికి నువ్వు రెడీగా ఉండు డాక్టరుగారితో చెప్పేసి ఇంటికి వెళ్లిపోదాం." అని చెప్పి వెళ్లిపోయింది.

మనసంతా కృతజ్ఞత నిండిపోగా ప్రమీల వెళ్లినవైపే చూస్తూ కూర్చుండిపోయింది ఆమె. □

# అరబ్బు షేకులను ఆకర్షిస్తున్న జర్మన్ వైద్యం!

ఇటీవలి వరకూ వైద్యం నిమిత్తం లండన్‌కు, లాస్ ఏంజెల్స్‌కూ, శాన్‌ఫ్రాన్సిస్కోకి వెళుతూ ఉన్న ధనిక అరబ్బు షేకులు సంవత్సరం నుంచి తమ దృష్టిని జర్మనీ వైపు మళ్ళించారు.

జర్మన్ జాతీయ విమాన సంస్థ అయిన లుఫ్తాన్సా ఆషెన్, బాడెన్ - బాడెన్, హైడల్‌బర్గ్, వీస్ బాడెన్‌లలోని ఆసుపత్రులతో పాకేజి వైద్య ఒప్పందాలని ఏర్పాటు చేస్తున్నది. నేడు అరేబియా, కువైట్, గల్ఫ్ దేశాలలో లుఫ్తాన్సా ప్రయాణీకులకి వైద్య సేవలకి ఏర్పాట్లు ముమ్మరంగా చేస్తున్నది.

కొన్ని కేసుల విషయంలో బ్రిటన్, అమెరికా ఆసుపత్రిలలో వేసే బిల్లులు పెట్రో డాలర్ కోటీశ్వరుడికి సయితం తల తిరిగేటట్లు ఉంటున్నాయి. అదీకాక అక్కడి చికిత్స కూడా అంతంత మాత్రమే. వాటన్నిటిలో కోటీశ్వరులైన ధనికులకి కూడా సవ్యంగా చికిత్స లభించినట్లు చెప్పడం లేదు. అక్కడి వైద్యశాలలో బిల్లులు చుక్కలని అంటుతున్నాయని ఒక బహరిన్ ఫ్యాక్టరీ ప్రధాన అకౌంట్స్ గుమాస్తా అన్నారు. లండన్‌కి షేకుల రాక తగ్గడానికి కారణం ఇదే. ప్రవేటుగా చికిత్స చేయించుకొనే రోగులకు. ఎంత ఎక్కువ బిల్లు వేసినా దానికి కూడా ఒక పరిమితి అంటూ ఉంది.

జర్మనీ లో విమానాశ్రయాలు, హోటళ్ళు, విశ్వవిద్యాలయాల ఆసుపత్రులు షేకులతో నిండిపోతున్నాయి. అరబ్బులు ఆ దేశం వెళ్ళడానికి ముఖ్య కారణం అక్కడి వైద్య నిపుణులు వారి పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపడమే అని లుఫ్తాన్సా మార్కెటింగ్ మేనేజరు అన్నారు.

ఒక ఆయిల్ కంపెనీ షేకు తన 20 మంది కుటుంబ సభ్యులతో పది రోజులు ఆషెన్‌లో గడిపారు. 'ఇక్కడ చాల బాగుంది. నాకు సంపూర్ణ ఆరోగ్యం చేకూరింది. ఇక్కడి హోటలు కూడా బాగుంది. నేను త్వరలో మళ్ళీ వస్తాను' అని తిరిగివెళ్తూ ఆయన చెప్పాడు.

బురఖా వేసుకున్న స్త్రీలు వీస్‌బాడెన్ నగరం చుట్టు ప్రక్కల ఇప్పుడు తరచుగా కనపడుతున్నారు.

వీస్‌బాడెన్‌లోని జర్మన్ డయాగ్నోస్టిక్ క్లినిక్ తన ప్రత్యేక పరీక్షలతోను, ప్రాథమిక పరీక్షలతోను ముఖ్యంగా క్లిష్టమైన రోగాలను నయం చేయడం వల్ల అరబ్బు కుటుంబాలను ఆకర్షిస్తున్నది.

ఉన్నత కుటుంబాలలో నుంచి వచ్చిన అరబ్బు స్త్రీలతో మసలుకోవడంలో ఉన్న కష్టాలను క్లినిక్ అధికారి ప్రొఫెసర్ జెర్‌హార్డ్ రోవ్ వెల్లడించాడు.

అరబ్బు వనితలు జర్మనీ యూరోపియన్ డాక్టర్ల ఎదుట నగ్నంగా పరీక్ష చేయించుకోడానికి ఇష్టపడరు. కాబట్టి వారి శరీరాన్ని పరీక్ష చేసే సమయంలో తొడుగుకోడానికి ఒక ప్రత్యేకమైన గౌనుని రూపొందించారు. ఈ గౌనుకి అనేక రంధ్రాలుంటాయి. రోగికి వివస్త్రగా ఉన్నామనే బాధ లేకుండా డాక్టర్లు పరీక్ష చేయాల్సిన చోట పరీక్ష చేసేటందుకు అనువుగా ఈ గౌనులు ఉపయోగపడతాయి. లేడీ డాక్టరయితే ఈ సమస్యలు ఉండవు.

ఈ షేకుల కోసం వారి సాంప్రదాయాలకు, అలవాట్లకి, అనువుగా దగ్గరలోని హోటళ్ళు రూపొందించబడ్డాయి. హోటలు మేనేజరు కార్నెలియస్ తమ హోటలులో నేల మీద పరిచే టేబుల్ క్లాత్ కోసం ఎక్కువగా వెచ్చించవలసి వస్తోందన్నారు. అరబ్బు కుటుంబీకులు సాధారణంగా నేల మీద కూర్చొని చేతితోనే భుజిస్తారు. సాయంత్రాలు అరబ్బులకు ఇష్టమయిన బెల్లీ డాన్సు మొదలైన వినోద కాలక్షేపాలు ఏర్పాటు చేసిన హోటళ్ళకే అరబ్బులు ఎక్కువగా వస్తున్నారు. ఖురాన్‌లోని కొన్ని పద్యాలు నేర్చుకోవాలని హోటల్ యజమాన్యానికి సలహా ఇవ్వబడుతోంది. అరబ్బులను బాగా చూడటం అనేది ఆర్థికపరంగా దీర్ఘకాల ప్రాతిపదికపై లాభసాటిగా ఉంటుంది.

చాలా మంది ధనిక అరబ్బులు తమతో పాటు అంగరక్షకులను, తమ కుటుంబాన్నే కాకుండా తమ స్వంత వంట వాడిని కూడా తెచ్చుకుంటున్నారు. లుఫ్తాన్సా అమ్మకపు విభాగం ఉన్నతాధికార్లు దాదాపు అన్ని అరబ్బు దేశాలనీ ఉన్నత వైద్య నిపుణుల బృందంతో పర్యటించి కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి జర్మనీ హోటళ్ళు, వాతావరణం మొదలైన వాటి గురించి పెద్దపెట్టున ప్రకటనలు ఇచ్చారు.

ఉన్నత కుటుంబాలకు చెందిన 50 వేల మంది అరబ్బులు అనారోగ్యంతోనో, లేదా వైద్య పరీక్ష కోసమో ఈ సంవత్సరం జర్మనీ వచ్చారు.

గొప్ప గొప్ప జర్మను నిపుణులు అరబ్బు దేశాల్ని పర్యటించి చిన్న చిన్న రోగాల నుంచి కేన్సరు వంటి జబ్బుల వరకు అన్ని అంశాలని వివరించారు.

ప్రతి ఒక్క అరబ్బు షేకు పదిమందిని వెంట వేసుకుని వచ్చేటప్పటికి ఆసుపత్రులు, హోటళ్ళు బాగా డబ్బు చేసుకుంటున్నాయి.

హానోవర్ డాక్టర్లు మూత్రపిండాల జబ్బులు నివారించడంలో నిపుణులయితే మైన్జ్‌లో యూరోలాజికల్ వ్యాధుల నిపుణులున్నారు. అలాగే డూసెల్‌డర్ఫ్ ఆసుపత్రిలో చర్మ రోగాలకి, బాన్‌లో కంటి జబ్బులకి. రోటాన్-ఎగెర్న్‌లో శరీరం సన్నబడడానికి ప్రత్యేక చికిత్సలు చేస్తున్నారు.

(ది జర్మన్ ట్రిబ్యూన్ ఆధారంగా)



మెయిన్జ్‌లోని ఆస్పత్రిలో మూత్రపిండాలలోని రాళ్ళని విచ్ఛిన్నం చేసే చికిత్స చేస్తున్న వైద్య బృందాన్ని చిత్రంలో చూడవచ్చు.




జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికి, చల్లదనానికి, దానికదే సాటి

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి

# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును



కొత్త సీరియల్ ప్రారంభం!

# ముసురు వెలిసింది

## కళ్యాణీ సోమరాజ్

ఉన్నట్టుండి ఆకాశం ఎక్కడో ఉరిమింది.

అంతలోనే 'టప టప' మంటూ ఆగకుండా ఒకటే చినుకులు.

మూర్తి వైపర్స్ ఆన్ చేసాడు. పడుతున్న చినుకులను పడుతున్నట్లే మాయం చేస్తోంది వైపర్!



రోడ్డు మీద ఎంబాసిడర్ మెత్తగా పోతోంది. కొత్తగా కొన్న కారు అవటం వలననో, లేక ప్రభుత్వం వారు వేసిన తారు రోడ్డు మహత్యమో తెలియదు. హై రోడ్డు మీద అట్టే జనం లేరు

మనం తెల్లవారేసరికల్లా 'తెనాలి చేరుకుంటామా మూర్తీ!' అంది రమ సన్నటి తుప్పర వచ్చి మొహం మీద పడుతుంటే కర్చీఫ్‌తో తుడుచుకుంటూ!

ఆఁ మరీ నీకు జర్నీ బోర్‌గా వుంటే చెప్పు ఏ గెస్ట్ హౌస్‌లోనో ఈ రాత్రి హాల్ట్ చేద్దాం అదేమిటి ఆ సైడు గ్లాసెస్ మూసేయి రమా' వర్షం లోపలకి రావటంలా అన్నాడు మూర్తి అప్పటికే వర్షం జోరు హెచ్చింది

రమ వెంటనే తన వైపున్న గ్లాస్ డోర్స్ క్లోజ్ చేసింది

"వర్షం పెద్దదయ్యేలా వుంది డ్రైవింగ్ విసుగ్గావుంటే నాకివ్వు. మూర్తి"

ఫరవాలేదు రమా! నేను 'స్టేట్స్'లో వుండగా నా ఫేవరెట్ హాబీ డ్రైవింగ్, చాలామందికి ఇదంటే విసుగు మా ఫ్రెండ్స్ ఏ పిక్నిక్ పార్టీ వేసుకున్నా డ్రైవింగ్ వీల్ ముందుకు నన్ను తోసేవాళ్ళు

ఎక్కడో పిడుగు పడ్డట్టుంది ఆకాశం ఒక్కసారి భయంకరంగా ఉరిమింది రమ ఆ శబ్దానికి భయపడి మూర్తిని వచ్చి చుట్టేసుకుంది

ఉత్తపిరికి అమ్మాయివేనన్న మాట

రమ గుండెల్లో బెదురు తగ్గలేదు

నాకు వర్షం అంటే ఇష్టమే కాని, ఉరుములు, మెరుపులు నచ్చవు

మీ ఇంటి విషయాలేమైనా చెప్పు మూర్తి ఒక్కసారి మనం ఇలా వెళ్ళి మీ వాళ్ళ ముందర నుంచుంటే వాళ్ళు ఏం చేస్తారు? నువ్వు ఎలా ఊహిస్తున్నావ్

రమ మాటలకు నవ్వాడు మూర్తి

'రమా! దీనికి సమాధానం చెప్పాలంటే కష్టమే! బహుశ ఒక్కసారి ఇంటి వాతావరణం మారిపోవచ్చు ప్రళయం వచ్చినా రావచ్చు అందుకు సిద్ధమయ్యే కదా నిన్ను పెళ్ళి చేసుకుంది సరే మా ఇంట్లో ఉండే పాత్రలను నీకు



# ముసురు వెలిసింది

పరిచయం చేయటం చాల ముఖ్యం అనుకుంటాను మా నాన్నగారి పేరు సత్యనారాయణమూర్తి డెబ్బయ్యోపడిలో పడ్డ వృద్ధుడు మొదటి నుంచి ఆస్తి విషయాల మీద ఆసక్తి ఎక్కువ ఇప్పుడిక వార్ధక్యం రావటంతో అన్ని బాధ్యతలు అన్నయ్య మీద వదిలేసి, పల్లెటూరి రాజకీయాలు చర్చిస్తూ నిశ్చింతగా కాలక్షేపం చేస్తున్నారు కాస్త ప్రథమ కోపం అయినా మనసు మంచిది ఇక మా అమ్మ సుందరమ్మ సనాతన ఆచారాలకొక డిక్షనరీ! అని చెప్పొచ్చు తను కొన్ని గిరులు గీసుకొని వాటిల్లోంచి బయటకు రాదు అందరికంటే పెద్దవాడు మా అన్నయ్య ప్రస్తుతం ఇంటి బాధ్యతలు, పొలం పనులు మీద వేసుకొని మోస్తున్నదీయనే నలుగురు ఆడపిల్లలకు తండ్రి! ఇంటా బయటా కూడా 'మెతక మనిషి' అని పేరు తెచ్చుకున్న వ్యక్తి మా పెద్ద వదినె పేరే కాదు మంచితనంలోను, ఓర్పులోను సీతమ్మే! అయితే ఇంటెడు చాకిరీ మీద వేసుకుని చేస్తున్నా అత్తగారు చేత మంచి అన్పించుకోని అభాగ్యురాలు ఇకపోతే మా రెండో అన్నయ్య ఎల్. ఐ సి లో క్లర్క్ చిన్న వదిన కాన్వెంట్‌లో టీచర్‌గా పనిచేస్తోంది వీళ్ళకిద్దరూ అబ్బాయిలే! వీడు ట్రాన్స్‌ఫర్ల మీద చాలా వూళ్ళు తిరుగుతూ వుంటాడు ప్రస్తుతం విజయవాడలో వుంటున్నారు సరేమా మూడో అన్నయ్య 'కాశిపతి' వాడు చిన్నప్పుడు చదువులోనూ రాణించలేదు ఇప్పుడు పొలం పనులలోను వళ్ళు వంచి పనిచేయటంలేదు జలసా ఖర్చులు చేస్తూ కులాసాగా తిరుగుతూ వుంటాడు అమ్మ తమ్ముడి కూతుర్నే ఇచ్చి పెళ్ళి చేసారు వదిన పేరు ధనలక్ష్మి అంతా ధనం అంటారు ముగ్గురే సంతానం

ఆ తరువాత వరుసగా ఇద్దరు అక్కయ్యలు పెళ్ళిళ్ళయి సంసారంలో పడ్డారు నా తరువాతది ప్రసూన చదువు మీద శ్రద్ధ తక్కువ టెన్త్ తప్పి ఇంట్లోనే వుంది, పెళ్ళి చూపులకు హాజరు అవుతూ!

'అది సరే మూర్తి నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేదు నువ్వు పెద్ద హీరోలా కాని కట్నం తీసుకోకుండా రిజిస్టర్ మ్యారేజ్ చేసుకున్నావ్ మీ పేరెంట్స్ మనల్ని ఇంట్లోకి రానిస్తారా!'

'తినబోతు రుచులెందుకు ఏది ఏమైనా మనం అన్నింటికి సిద్ధపడి వెళుతున్నాం కదా! ఇంకాభయం ఎందుకు?"

'భయంకాదు జస్ట్ ఫర్ ఇన్‌ఫర్‌మేషన్!'

రమ సీటు మీద వెనక్కి వాలి గ్లాస్ డోర్స్ నుంచి మెత్తగా పడుతున్న వర్షాన్ని చూస్తూ కూర్చుంది ఆమె మనసు చాలా ఉల్లాసంగా వుంది కోరుకున్న వాడిని చేపట్టానన్న ఆనందం, కాని కట్నం కోరని ఆదర్శవంతుడు, తనకి అన్ని విధాలా నచ్చిన గుణవంతుడు భర్తగా అయ్యాడన్న తృప్తితో కూడిన గర్వం – ఆమె మనసు నిండా నిండింది!

* * * * *

తల్లిదండ్రి ఎన్నో విధాల నచ్చచెప్పారు రమకు –'ఈ పెళ్లి వద్దంటూ' – ఆఖరికి మూర్తికి ప్రాణస్నేహితుడైన రమ అన్నయ్య కూడ రమని ఈ పెళ్ళికి ప్రోత్సహించలేదు అయితే అందరికి మూర్తి అంటే విపరీతమైన గౌరవం, అభిమానం అతనికేం తక్కువ? అందమైన పర్సనాలిటి– అందుకు తగ్గ రూపం, రూపాని తగ్గ చదువు, అన్నింటిని మించిన వినయం అయితే ఎవరికి నచ్చంది రమ అతన్ని పెళ్ళి చేసుకుంటే రేపు ఆ ఉమ్మడి కుటుంబంలో ఓ పల్లెటూళ్ళో జీవించాలి అన్నదే! రమ మద్రాస్ లాంటి సిటిలో పెరిగిన పిల్ల దానికి తోడు ఎమ్ ఎస్. సి పాసైన దగ్గర నుంచి ఓ గరల్స్ కాలేజిలో ట్యూటర్‌గా పని చేస్తోంది ఇంట్లో తల్లిదండ్రితో పాటు అన్నా, వదిన కూడ రమని గారంగా చూస్తారేమో, రమకు కష్టాలెలా వుంటాయో తెలియవు అలాంటి అమాయకు రాలిని, చూస్తూ చూస్తూ ఉమ్మడి కుటుంబంలోకి, అందునా ఒక పల్లెటూళ్ళో వుంటూన్న వాళ్ళ మధ్యకు పంపటం ఆ ఇంట్లో వాళ్ళెవ్వరికి ఇష్టం లేదు మూర్తి గురించి చెప్పాలంటే – అతను రెండేళ్ళ క్రితం ఫారెన్ నుండి తిరిగి వచ్చిన డాక్టర్. తల్లిదండ్రి కోరిక ప్రకారం తమ స్వస్థలానికి దగ్గర్లో వున్న తెనాలిలో ప్రాక్టీస్ ఆరంభించాడు రమతో అతని పరిచయం రమ అన్న ప్రభాకర్ ద్వారా జరిగింది ప్రభాకర్, మూర్తి క్లాస్ మేట్స్ మూర్తి పై చదువులకు స్టేట్స్ వెళ్ళటం, ప్రభాకర్ తండ్రి ప్రాక్టీస్ చేపట్టటం ఒకసారే జరిగింది మూర్తి స్టేట్స్ నుంచి వచ్చాక ప్రభాకరాన్ని తరుచు కలుసుకునేవాడు రమని అంతకు ముందు స్కూల్ కెళ్ళే పిల్లగానే తెలుసు మూర్తికి, అప్పటి ఆ అమాయిక ముగ్ధ ఇప్పుడు చైతన్యం చిందులు వేసే నిర్ఝరి అందమైన శరీర సౌష్టవం, చిలిపితనం రంగరించిన మాట తీరు – మూర్తి మనసును దోచుకోవటానికి ఆట్టే కాలం పట్టలేదు దానికి తోడు భావాలు ఇద్దరివి కలవటంతో ప్రేమ మొగ్గ కాసింది రమకు కట్నం ఇవ్వటం అన్నా – కట్నం తీసుకొనే వాడిని పెళ్ళి చేసుకోవటం అన్నా పరమ అసహ్యం మూర్తి కూడ కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకోవాలనుకున్నవాడే!

అయితే ఇంట్లో అందరూ అతని చదువు, అందచందాలకి, ఆస్తిపాస్తులకి లెక్కలు కట్టి, బేరీజులు వేసి ఒక రేటు నిర్ణయించేసారు దానికి తగ్గట్టుగానే బోలెడు మంది పిల్లనిస్తామంటూ వచ్చేవాళ్ళు ఎక్కువైయ్యారు ఇంట్లో అందరూ మూర్తిని ఒత్తిడి పెడుతున్నారు ఎవ్వరి మాట తీసేసే ధైర్యం, చొరవ తక్కువ మూర్తిలో! అందుకే రమ విషయం ఎవ్వరికి చెప్పకుండానే, రిజిస్టర్ మ్యారేజ్ చేసుకోటానికి సిద్ధమైయ్యాడు మూర్తి

రమ కూడ ఇంట్లో అందరితోను చిన్న సైజ్ యుద్ధం చేయాల్సి వచ్చింది ఈ పెళ్ళి గురించి

"కట్నం తీసుకోవటం మంచిది కాదు ఒప్పుకుంటాను కాని దాని కోసం లేనిపోని చిక్కుల్లో పడటం నా కిష్టం లేదు మేము కట్నం ఇవ్వలేని పరిస్థితుల్లో లేము" అంటూ తండ్రి నచ్చచెప్పాలని చూసాడు రమని

ఉమ్మడి కుటుంబంలో మనుగడ అంటే తేలికైన విషయం కాదు అందులో పల్లెటూరు వాళ్ళు, సనాతన ఆచారాలున్న కుటుంబంట నువ్వు అక్కడ శాంతిగా గడపలేవు నువ్వు పెరిగిన పద్ధతి వేరు ఒక్కసారిగా మారలేవు అతను చూడబోతే ఆ వూరు వదిలి వచ్చేలా లేడు ' అంటూ తల్లి స్పష్టపరచింది

"అదేమిటమ్మా

నువ్వే ఇలా మాట్లాడుతున్నావ్? నువ్వు 'ఉమ్మడి కుటుంబం' నుండి వచ్చావ్– మనది ఉమ్మడి కుటుంబమే! వదిన కాని నువ్వు కాని ఒక్కమాట అనుకోగా వినలేదు మీరిద్దరూ ఎంతో మంచి స్నేహితుల్లా కలిసిమెలిసి వుంటారు రమ తల్లికి నచ్చచెప్పాలని చూసింది

"మన ఇంటి పద్ధతులు వేరు రమా! నేను నిజానికి ఉమ్మడి కుటుంబంలో వున్నన్నాళ్ళు సుఖపడింది లేదు. అత్త, ఆడబడుచుల సూటిపోటి మాటలతోను, తోడికోడళ్ళు అసూయలతోను అశాంతిగానే గడిపాను జీవితాన్ని భగవంతుడి దయ వలన మీ నాన్నగారు ఇక్కడ కొచ్చి ప్రాక్టీసు పెట్టటంతో నాకు మంచిరోజులు వచ్చాయి అయితే, ఉమ్మడి కుటుంబంలో ఎలా ఉండకూడదో నా జీవితం నాకు నేర్పిన పాఠాలను వల్లె వేసుకున్నాను అందుకే 'లత' ను నేనెప్పుడూ కోడలన్న భావంతో చూడలేదు లత కూడ సంస్కార వంతురాలు కావటంతో, మా మధ్య గొడవలు రాలేదు కాని అన్ని కుటుంబాలు ఇలాగే వుంటాయని ఊహించుకోకు నీకు సమస్యలంటే ఏమిటో తెలియవు ఇప్పుడు నేనెంత చెప్పినా – అనుభవంలోకి వచ్చేవరకు నీకు బుర్ర కెక్కవు అంటూ తల్లి చేస్తున్న హితబోధకు రమ బదులు పల్కలేదు

"అత్తయ్య చెప్పిన మాటలు నిజం రమా! అందులో నువ్వు ఈ సిటి జీవితానికి అలవాటు పడినదానవు ఒక్కసారి ఆ పల్లెటూళ్ళో అడ్జస్ట్ కావటం కూడ కష్టమే నీకు చేతనైతే మూర్తిని ఇక్కడే ప్రాక్టీస్ పెట్టటానికి ఒప్పించు ' అంటూన్న లత వంక నవ్వుతూ చూసింది రమ

అతని వ్యక్తిత్వాన్ని చంపుకుని నేను చెప్పినట్లు వినాలని అనటం భ్యావం కాదు వదినా! షరతులతో జరిగేది 'పెళ్ళి' కాదు బిజినెస్ ఎగ్రిమెంట్!"

"చాల్లేవే పెద్ద ఆరిందాలాగా అందర్ని ఎదిరిస్తున్నావ్ మేము నీ క్షేమం కోరి చెప్పే మాటలు నీ చెవి కెక్కటం లేదు.' అంతా వింటున్న ప్రభాకరం

అసహనం

మూర్తి నీ ప్రాణస్నేహితుడన్నావ్ అతని గొప్ప గుణాలను నా ముందు ఎన్నో వందల సార్లు పొగిడావ్' రమ చెప్పింది

పొగిడితే! నిన్ను మనసు పారేసుకోమన్నానా! వాడు ఎంత మంచివాడైనా తల్లిదండ్రుల మాట జవదాటని అపర 'శ్రీరామచంద్రమూర్తి' వాడిని పెళ్ళి చేసుకుని నువ్వు సుఖపడలేవు అంటూ ప్రబాకరం చివరి సారిగా హెచ్చరించాడు

చివరకు రమ మొండి వైఖరే నెగ్గింది అందరూ అశాంతిగానే రమ, మూర్తుల రిజిస్టర్ మ్యారేజ్ కి సాక్షులైయ్యారు

తల్లి ఇంటిల్లిపాదికి బట్టలు పంపాలనుకొంది లాంఛనాలు తీసుకురాని కోడల్ని అత్తలెలా చూస్తారో ఆమెకు తెలుసు గనుక అందుకు కూడ మూర్తి ఒప్పుకోలేదు లాంఛనాలంటూ కట్నం వాసన మా పెళ్ళికి అంటనీయద్దు అంటూ

ఈ కారు మీరు తప్పకుండా తీసుకెళ్ళాల్సిందే మూర్తి ఇది అమ్మాయి కోసం ఎప్పుడో బుక్ చేసాను అది సమయానికి వచ్చింది అందులో మీరు వుండేది పక్కా పల్లెటూరు అంటున్నావ్ రమకు తోచనప్పుడల్లా పక్క సిటికి వెళ్ళి రావటానికి ఉపయోగంగా వుంటుంది అంటున్న మామగారి మాట తీసివేయలేదు మూర్తి

అలాగే మీ ఇష్టం అయితే కారు డబ్బు మాత్రం –ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో మీకు పంపిస్తుంటాను అందుకు మీరు కాదన కూడదు అంటూ మృదువుగా చెప్పాడు మూర్తి

కారు హారన్ వింటూనే వాకిట్లో గోలీలాడు కుంటున్న మగపిల్లలిద్దరూ కారు – కారు అరే కారులో బాబాయి వచ్చాడు బలె బలె అయితే మనకారే అంటూ ఆనందంగా చప్పట్లు కొట్టుకుంటూ కారు చుట్టూ చేరారు

మూర్తి రమ సూట్‌కేస్ 'డిక్కీ' నుంచి తీసి పాలేరు కందించాడు

వీది వరండాలోనే పేపరు చదువుకుంటూ కన్పించారు సత్యన్నారాయణ మూర్తిగారు

ఎవరోయ్! ఆ అమ్మాయి నీతో చదువుకున్న అమ్మాయా?" కొడుకు చొరవగా తీసుకొస్తున్న అమ్మాయిని చూసి అడిగారు ఆయన

లేదు నాన్న మీ కోడలు రమా! నాన్నగారి కాళ్ళకు దండం పెట్టు!

కోడలా! ఆయన ఆశ్చర్యం నుండి తేరుకునేసరికి రమ, మూర్తి నమస్కరించటం అయిపోయింది

'ఏమిటి అంటే పెళ్ళి చేసేసు కున్నావా!

ఔను నాన్నగారు నిన్ననే మా పెళ్ళి రిజిస్ట్రారాఫీస్‌లో జరిగింది"

ఎంత ధైర్యంగా చెబుతున్నావురా మేమంతా చచ్చాం అనుకున్నావా ఎవరి అనుమతితో ఈ పెళ్ళి చేసుకున్నావ్!"

నన్ను క్షమించండి నాన్నగారు రమ నాకు అన్నివిధాల నచ్చింది రమది మన కులమే ఎటొచ్చి మేము కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకోవాలని ఇలా సింపుల్‌గా రిజస్టర్ మ్యారేజ్ చేసుకున్నాం మూర్తి తండ్రి ఉగ్రరూపాన్ని చూసే ధైర్యంలేక ఎటో చూస్తూ అన్నాడు

ఇంతలో ఈ వార్త ఇంట్లో నాలుగు మూలలా వ్యాపించి, ఆడవాళ్ళు, మగవాళ్ళు ఎక్కడ పని అక్కడ వదిలి పరుగున వచ్చారు కొత్త జంటను చూడటానికి

సుందరమ్మకీ విషయం కాస్త ఆలశ్యంగా చేరినట్లుంది వెనక నుంచి అందర్నీ తోసుకుంటూ వరండాలోకి వచ్చింది

ఆమె మొహం కందగడ్డలా వుంది ఎంత నష్టం, ఎంత నష్టం మనసు విలవిల్లాడు తోంది కలలో కూడ అనుకోలేదు కొడుకు ఈ విధంగా దగా చేస్తాడని

'ఏరా మూర్తి నే విన్నది నిజమేనా మేమంతా చివరి పిల్లాడి పెళ్ళి ఎంతో ఘనంగా చేయాలని ఆశలు పెట్టుకొని వుంటే మా అందరి ఆశలమీద నీళ్ళు చల్లి చివరికి ఎవత్తెనో వెంట బెట్టుకొచ్చావా! ఇన్ని వేలుపోసి చదివించి, నిన్ను పై దేశాలకు పంపి చదివించింది ఇందుకా! చివరికి ఈ విధంగా మా ఋణం తీర్చుకున్నావన్న మాట" కాళిలా ఉరుముతున్న సుందరమ్మను చూసిన రమకు అంతవరకు తను పోగు చేసుకున్న ధైర్యం గాలిలో కలిసి పోయింది

వాడిప్పుడు చాలా గొప్ప వాడైయ్యాడు తల్లి దండ్రుల మాట వినాలన్న భావం వాడిలో ఏకోశానైనా వుంటే ఇలా చేస్తాడా! భార్యను చూసాక మనం ఎవరం గుర్తుండం మరి మన బాధ్యత అయిపోయింది" తండ్రి నిష్ఠూరాలు మూర్తిని బాధించాయి

'మీ కెవరికి చెప్పకుండా పెళ్ళి చేసుకోవటం తప్పే నాన్నగారు అలా అని మీనుంచి దూరంగా అన్ని తెంపుకొని పారిపోలేదు. మీ మధ్యకే వచ్చాంకదా!

చూసావురా పెద్దాడా! మీ తమ్ముడు చేసిన నిర్వాకం అయినా ఈ కాలం పిల్లలే అంతలే వయసు వచ్చేవరకు మనం కావాలి ఆ తరువాత రెక్కలొచ్చిన పక్షులు'

పోన్లెండి నాన్నగారు అయిపోయిందేదో అయిపోయింది ఆ నూతన దంపతుల్ని లోపలికి రానివ్వండి' అంటూ తనవైపు మాట్లాడుతున్న పెద్ద అన్నగారి వంక కృతజ్ఞతతో చూసాడు మూర్తి

ఏదో కానివ్వండి! అంతా దైవేచ్ఛ

సుందరమ్మ రుసరుస లాడుతూనే లోపలికి వెళ్ళి పోయింది అత్తగారి వెనుక మూతి తిప్పుకుంటూ మూడో కోడలు నడిచింది భర్త కళ్ళతో సౌజ్ఞ చేయగానే 'సీత' వెళ్ళి గబగబ హారతి తీసుకొచ్చి నూతన దంపతులకు అద్ది

## కాపలా

మన దేశానికి ఎల్లలేవంటే
ఉత్తరాన హిమాలయాలనీ,
తూర్పున బంగాళాఖాతమనీ
పడమర, దక్షిణాలలో
అరేబియా, హిందూ మహాసముద్రాలనీ
చిన్నవాళ్ళు సహితం చెప్పేవారు!
ఎప్పుడు ??
ఒకప్పుడు !
మరిప్పుడో ??
దారిద్ర్యం తూర్పు దిక్కు,
నిరుద్యోగం పడమర వైపు,
ఆకలి, మతోన్మాదం
ఉత్తర దక్షిణాలు అని
లోకజ్ఞానం చదివిన
ఎవరైనా చెప్ప గలరు !

– నారంశెట్టి ఉమా మహేశ్వరరావు

## ముసురు వెలిసింది

**ఆహ్వానించింది**

ఆ రోజంతా ఎవ్వరూ రమని పల్కరించలేదు. ఇంట్లో తమ పెళ్ళి గురించిన చర్చలే ఏ మూలచూసినా! రమ బిక్కు బిక్కు మంటూ తిరిగింది.

ఇల్లు చాలా పెద్దదే! వరండా లోంచి వెళితే ముందు పెద్ద హాలు, ఆ హాలుకు రెండు వైపులా మూడేసి గదులు, ఆ హాలు దాటి ముందుకు పోతే పెద్ద వంట ఇల్లు, దాని కానుకొని పూజగది. ఇంటి చుట్టూ పెద్ద ఆవరణ. పెరటి వైపు గొడ్ల సావిడి. వీధి వైపున వర్ధగాదె, గడ్డివాము. పశువుల పాక నుండి తెచ్చి పడేసే నైపోగు పల్లెటూళ్ళల్లో ఇల్లు ఎలా వుంటాయి చూడటం అదే ప్రథమం రమకి. ఇల్లు ఎంత పెద్దదైనా ఏ గది నీటుగా లేదు. విరిగిపోయిన మంచంకోడుల దగ్గర నుంచి, ఎందుకు పనికిరాని విరిగిన ఆట బొమ్మల వరకు ఎక్కడపడితే అక్కడ పడేసి వున్నాయి. దొడ్లో నాలుగు అరటి మొక్కలు, ఓ పక్కన రెండు మూడు కొబ్బరి చెట్లు తప్పించి వేరే చెట్లేమి కన్పించలేదు రమకు. రమకు హఠాత్తుగా తను, లత కలిసి పెంచుతున్న తమ ఇంటిలో ని తోట గుర్తు వచ్చింది.

రమ మొహమాటంగా మసలటం గమనించి రమ సామాను తన రూమ్‌లో పెట్టించి, ఆమెను పైనున్న తన గదికి తీసు కెళ్ళాడు మూర్తి.

వీధివైపునున్న మెట్లమీద నుంచి వెళితే మూర్తి కోసం ప్రత్యేకంగా కట్టించిన రూమ్ వస్తుంది. రమకా రూమ్‌లోకి రాగానే ప్రాణం లేచివచ్చినట్లైంది. రూమ్ చాలా విశాలంగా వుంది. ఒక పక్కన డెకోలామ్ డబుల్ కాట్ మంచం, దాని కెదురుగా డ్రస్సింగ్ టేబుల్, మరో వైపున గాడ్రేజ్ బీరువా దాని పక్కన స్టీల్ టేబుల్, కుర్చీ! అన్నీ అనువుగా అమర్చుకున్నాడు మూర్తి. స్నానాలకి వాటికి బయటకు వెళ్ళకుండా షవర్‌తో వున్న బాత్‌రూమ్.

భోజనం ఎలాగో అయిందనిపించి పైకి వచ్చి పడుకుంది రమ. సాయింకాలం ఎప్పుడో మెలుకువ వచ్చింది రమకు. అప్పటికి మూర్తి డ్రస్ చేసుకొని బయటకు వెళ్ళిపోయాడులా వుంది. రూమ్‌లో ఎవరూ లేరు!

బాగా నిద్ర పట్టిందా!' అంటూ వచ్చింది 'సీత' రమ లేచి డ్రస్ చేసుకున్నాక ఆ!

కింద కొస్తావా ఇప్పుడే గుంటూరు నుండి పెద్దాడపడుచు, పొన్నూరు నుండి చిన్నాడబడుచు వచ్చారు. నిన్ను చూడాలను కుంటున్నారు."

"పొద్దున అయిన భాగవతం రమకి కొన్ని రోజుల వరకు గుర్తుంటుంది. ఇక వీళ్ళ నెలా ఎదుర్కోవాలో. అందులో పక్కన మూర్తి కూడ లేడు. అనుకుంటూ అయిష్టంగానే బయలు దేరింది సీత వెనుక రమ.

ఉదయం ఖాళీగా కన్పించిన హాలు ఆడవాళ్ళతోను, పిల్లలతోను గందర గోళంగా వుంది. అంతవరకు గోల గోలగా మాట్లాడుతున్న వారల్లా రమ రావటం చూసి 'ఉష్ పెద్దగా అనకండి ఆ అమ్మాయి వచ్చేసింది. అనుకుంటూ ఒక్కసారి నిశ్శబ్బం అయిపోయారు.

రమ కూర్చోటానికి కాబోలు చాప ఒకటి పరచివుంది. రమ వెళ్ళి కూర్చోగానే రమ చుట్టూ చేరారు అక్కడున్న ఆడవాళ్ళు. రమ కలా కూర్చోవటానికి చాలా మొహమాటంగా వుంది. అందరి దృష్టి తన మీదే వుందని గ్రహించి రమ తలపైకెత్తి ఎవరివంక చూడలేదు. పెళ్ళి చూపుల అనుభవం అప్పుడు తప్పినా, ఇప్పుడు తప్పలేదు అనుకుంది మనసులో!

'ఎంత మంది మీరు అక్క చెల్లెళ్ళు – అన్నదమ్ములు. పెద్దాడబడుచు కాంతం కూతురికి జడ అల్లుతూ అడిగింది.

'నాకు అక్క చెల్లెళ్ళు లేరు. ఇద్దరు అన్నయ్య లున్నారు'

అందరూ నీలాగే రిజిస్టర్ మ్యారేజ్ చేసుకున్నారా! ఎవరైనా సాంప్రదాయంగా పెళ్ళి చేసుకున్న వాళ్ళున్నారా!'

ఈ సారి కాంతం మాటలకు చిన్న ఆడబడుచు కామాక్షి కిసుక్కున నవ్వింది.

రమ తలఎత్తి సూటిగా కాంతం వంక చూస్తూ 'మీ ఉద్దేశ్యంలో సాంప్రదాయం అంటే ఏమిటి?"

అదే కట్నం– కానుకలు లాంఛనాలు అన్నీను"

"నాన్నగారు కట్నం తీసుకోలేదు. లాంఛనాలు మేము కావాలన లేదు.

'ఇంతకీ నీ మెడలో మంగళసూత్రాలు కూడ వున్నట్టు లేవు.

'సంతకాల పెళ్ళిళ్ళకు అలాటి వేమి ఉండవే అక్కయ్యా! మొన్నీ మధ్య మా వారి వేలు విడిచిన మేనత్త కొడుకు బావమరిది ఇలాగే సంతకాల పెళ్ళి చేసుకొన్నేను – మంగళసూత్రం కట్టని పెళ్ళి ఒక పెళ్ళేనా అని మళ్ళీ పెళ్ళి చేసారు' కామాక్షి అక్క సందేహం తీర్చింది.

వీళ్ళిద్దరూ కలసి మూర్తికి, తనకు పెళ్ళి కాలేదంటూ బయటకు నెట్టేలా వున్నారు. అనుకుంది రమ.

'రమా! నిన్ను చూడటానికి కరణంగారి భార్య, కోడలు వచ్చారు. అత్తగారు రమ్మంటున్నారు" అంటూ సీత వచ్చి పిలవటంతో 'బ్రతుకుజీవుడా' అనుకుంటూ లేచి నిలబడింది రమ.

(ఇంకావుంది)




# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## రచయితలకు గమనికలు

**ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర రచనలు పంపదలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003. అన్న చిరునామాకి వ్రాయాలి.**

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి — హామీపత్రం జతచెయ్యాలి

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు — వారి స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని— తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు — రచన పేరు — అది పంపినతేదీ, వాటి గురించి **వివరంగా తెల్పనిదే** పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ళలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు . ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది.

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ ''ప్రతు''లను — కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. **సం॥**

# ఉదాత్తం

కోలపల్లి ఈశ్వర రావు




"రండి మీ కోసమే ఎదురు చూస్తున్నాం మీరొస్తే కానీ మాకు పండగ పూర్తి కాదు మీ ఆశీర్వాదం పొందితేగానీ నాకు తృప్తి వుండదు రంగనాయకి వికసించిన ముఖంతో వర్ధనమ్మను ఆహ్వానించింది

ఆవిడ ఆప్యాయతకు కొద్దిగా చలించినా సర్దుకుని, భుజం నిండగా పవిటను కప్పుకుని లోపలికి అడుగుపెట్టింది వర్ధనమ్మ

అదేవిటోనండీ పండక్కంటే ముఖ్యంగా మీ రాక కోసం ఎదురు చూస్తుంది మా ఆవిడ కూర్చోండి అంటూ వర్ధనమ్మ రాకకు తన సంతోషాన్ని కూడా మాటల్లో వ్యక్తపరిచాడు పురుషోత్తం!

పార్వతీ పరమేశ్వరుల్లాంటి ఆ దంపతుల ఆప్యాయతను – ఆస్వాదిస్తుంటే – ఒక్క క్షణం వర్ధనమ్మ మనసు లయతప్పింది తను ఇంతటి అబిమానానికి అర్హురాలేనా అన్నట్లు కించిత్ బాదపడింది కూడా! సన్నని నీటి పొర కనుకొలకుల్లో నిలిచింది! వెంటనే సంభాళించుకుని నవ్వుతూ రంగనాయకి వంక చూసి –

అంత దూరం నుండి శ్రమపడి వస్తానన్న మాటే గానీ మీ ప్రేమ ముందు నాకా శ్రమ తెలియనే తెయదు నిజంగా మీరు చూపిస్తున్న ఆదరాభిమానాలకు నేను తగుదునా అని కూడా అప్పుడప్పుడు అనుకుంటుంటాను

'ఆఁ భలేవారే ఈ సంవత్సరంతో పదేళ్ళు పూర్తవుతుంది– మీకు మాకు వున్న బంధం మొదలై మీరు మంచి మనసుతో మొట్ట మొదటిసారిగా దీవించారు ఆ దీవెన వల్లనే మా వ్యాపారం "మూడు పువ్వులు ఆరు కాయలుగా విలసిల్లుతున్నది మీ చల్లని దీవెన– మాకు ఇలాగే కొనసాగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాం

ఆఁ రండి భోంచేద్దురుగానీ– తర్వాత మాట్లాడుకుందాం తీరిగ్గా అంటూ రంగనాయకి వంటింట్లోకి దారితీసింది

సరే– అయితే– నే నలా ఆంజనేయులు ఇంటిదాకా వెళ్ళొస్తా నాయకీ! మళ్ళీ కలుస్తానమ్మా అంటూ వర్ధనమ్మకు నమస్కరించి బయటకు కదిలాడు పురుషోత్తం!

వర్ధనమ్మ ఎవ్వరూ చూడకుండా కళ్ళు ఒక్కసారి వత్తుకుని, పెరటి వైపు వెళ్ళింది కాళ్ళు కడుక్కుని ఇవతలకు వచ్చింది

ఆఁ మీరంతటి పని చేస్తారనే– నేను కాచుకుని ఊఁ ఇక్కడే కూర్చున్నా అలా బాత్‌రూంలోకి వెళ్ళిరండి ఊ తప్పదు బలవంతంగానైనా నా కోరిక తీర్చుకుంటానండోయ్

ఆపైన– మీ ఇష్టం అంటున్న రంగనాయకి వైపు కాస్త ఇబ్బందిగా చూసి, ఇప్పుడా తతంగాలన్నీ ఎందుకమ్మా– నీది మరీ చాదస్తం అంది తేలిగ్గా కొట్టి పారేస్తూ వర్ధనమ్మ

వప్పనంటే, వప్పను మీ రెళ్ళాల్సిందే, మీ రొచ్చేదాకా నేను ఇదిగో, ఇక్కడ ఇలాగే నిరాహార దీక్షచేస్తుంటాను

పసి పిల్లలా మారాం చేస్తున్న రంగనాయకిని ఏమి అనలేక– బాత్‌రూంలోకి బలవంతంగావెళ్ళింది వర్ధనమ్మ

అక్కడ వున్న సామగ్రిని చూసి– కళ్ళు చెమర్చాయ్

ఒక్క ఉదుటున కట్టలు తెంచుకున్నట్లు దుఃఖపు పొంగు కళ్ళల్లో నుండి దూకింది

అది ప్రతి సంవత్సరం జరుగుతున్న తంతే అయినా, ఎందుకో– ఈ సారి వర్ధనమ్మ మనసు కాస్త చికాకుగా వుంటంతో ఇవన్నీ ఎందుకబ్బా– లేనిపోని యవారం – అన్నట్లుంది

పళ్ళ బిగువున ఏడుపుని దిగమింగింది!

తమాయించుకుంది!

గట్టిగా కళ్ళు తుడుచుకుని– తలుపుని కొద్దిగా తొలగించి, తొంగి చూసింది

రంగనాయకి వంటింటి మెట్టుమీద– ఈవిడ రాక కోసం ఎదురుచూస్తూ కూర్చుని వుంది

పిల్లలేరీ– కన్పించరేం?

వర్ధనమ్మ ప్రశ్నకు– పక్కున నవ్వింది రంగనాయకి!

బలేవారే– నన్ను ఏమార్చాలని చూస్తున్నారా ఆ పప్పులేం వుడకవండోయ్ మీ రెంత త్వరగా వస్తే అంత మంచిది నా కాకలి దంచేస్తోంది అందునా వుదయం నుండి ఉపవాసం చూడండి కడుపు ఎలా ఉసూరు మంటుందో అమాయకంగా అంటున్న రంగనాయకివైపు తదేకంగా చూడలేక పోయింది వర్ధనమ్మ

గబుక్కున తలుపు లాక్కుంది– గొళ్ళెం బిగించింది తలుపుకు జారగిలబడి అనుకుంది

రెండు కళ్ళు- రెండు సుడిగుండాల్లా- సుళ్ళు తిరుగుతూ నీళ్ళు టపటపమంటూ రాలటానికి సిద్ధంగా వున్నాయ్

ఆమె కళ్ల ముందు- అంతటి, నీటి పొరలలో కూడా తీలగా ప్రత్యక్షమయ్యాడు కొడుకు

అమ్మా ఏం చెప్తావ్ కాలేజీ మానేసి గోళ్ళు గిల్లుకుంటూ కూచోనా పరీక్ష ఫీజు కట్టిస్తావా లేదా ఏదైనాసరే- నీ ఇష్టం ఎక్కడతేనురా- ఊర్నుండి వెలివేయలేక వుంచుకున్నారుకానీ మనం అప్పు చెయ్యాని కొట్టుందా అని అంటావ్, కాబోలు అను- వింటా- అది కూడా నీ ఇష్టం పదహారో తేదీలోపల కడితే సరే వుంది లేకపోతే పరీక్షకు వెళ్ల నివ్వరట ఆ పైన అందరం చేరి- తాన తందాన ఆడుకుందాం చీచీ దరిద్రపు కొంప- నాలుగు అక్షర ముక్కలు చెప్పించే 'యోగ్యతలేదు

ఒరేయ్ ప్రకాశం ఇంటి పరిస్థితి తెలిసి కూడా అలా విసుక్కుంటే ఎలారా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు నేను మాత్రం ఏం చేసేది చెప్పు

అదే నేనూ అంటున్నా ఒకమాట తెగనరికినట్లు చెప్పు నావల్ల ఏం కాదురా బాబూ- నీ ఇష్టం అని ఒకే ఒక్క మాట చెప్పు నా తంటాలేవో నే పడతా తర్వాత కుళ్లి కుళ్లి ఏడ్చేది నువ్వే పలానా వాళ్లబ్బాయి- పరీక్ష ఫీజు కట్టలేక స్నేహితుల ముందు తలెత్తుకోలేక- రైలు క్రిందపడి చచ్చాడనో ఎండ్రిన్ తాగి చచ్చాడనో వింటావ్‌గానీ నే వెళ్తున్నా ఏ సంగతి సాయంత్రం చెప్పు నాకు ఈ లోపల ప్రిన్సిపాల్ కాళ్ళు పట్టుకుని రెండ్రోజుల్లో కడతానని చెప్పొస్తా

వెచ్చటి కన్నీళ్ళు చెంపల మీదుగా జారాయ్ వర్ధనమ్మకు

ఏవండోయ్ వర్ధనమ్మగారూ అయ్యిందా

ఉలిక్కిపడింది వర్ధనమ్మ

రంగనాయకి గొంతు మళ్ళీ వినిపించింది!

గబ గబ కళ్ళు తుడుకుని, చన్నీళ్లతో ముఖం కడుక్కుంది ఏడ్చిన చాయలు కన్పించకుండా- సబ్బుతో మళ్ళీ రుద్దుకుంది

టవల్‌తో శుభ్రంగా తుడుచుకుని ఎదురుగా ఆహ్వానిస్తూ- పళ్ళెంలో కూర్చుని వున్న పసుపుముద్దని చేతిలోకి తీసుకుంది!

ముఖానికి రాసుకుంది

రూపాయి బిళ్లంత బొట్టు పెట్టింది!

అద్దంలో తన ప్రతిబింబం ఒకసారి చూసుకుని కొక్కానికి తగిలించి వున్న కదంబం- తలనిండా తురిమింది

ఇది ప్రతి సంవత్సరం చేస్తున్న చర్యే అయినా ఎందుకో ఈ ఏడు కొత్తగా వుంది ఆమెకు

మళ్ళీ కళ్ల ముందు ప్రకాశంవచ్చి నిల్చున్నాడు!

గట్టిగా తల విదిలించి గొళ్ళెం తీసింది-

బాత్ రూమ్‌లో నుండి, ఇవతలకు వస్తున్న వర్ధనమ్మను కళ్ళింత చేసుకుని చూడసాగింది రంగనాయకి

సంభ్రమంగా ఎదురొచ్చింది!

అమాంతం వర్ధనమ్మ కాళ్లని చుట్టేసింది

ఇద్దరి కళ్ళు చిత్తడి అయ్యాయి!

మీలాగే పచ్చగా- పది కాలాలు- పండు ముత్తయిదువలా వుండమని- వారి చేతుల మీదుగానే- పసుపు కుంకుమలతో- కడతేరిపోవాలని- మనస్ఫూర్తిగా దీవించండి అంతకంటే మీ నుండి నేనింకేమీ ఆశించను రంగనాయకి గొంతు గాద్గదికంగా పలికింది!

పిచ్చిదానా నీ మనసు మంచిది నీకు దేవుడు ఎప్పుడూ కీడు చెయ్యడు బాధతో నీ కంట తడిని సృష్టించడు నీచేతి క్రింద పదిమంది చల్లగా వుంటారు నీ భర్త సంగతి అంటావ్ నీ ముందు అంటున్నానని కాదు గానీ నవనీతం లాంటి హృదయం మీకు ఆయురారోగ్యాలు ప్రసాదించాలని ఆ దేవుణ్ని మనసారా కోరుకుంటున్నా ఊఁ లే ఇందాక అన్నావ్‌గా ఆకలి దంచేస్తోందని సొమ్మసిల్లి పడిపోతావ్- అంది హాస్యంగా వర్ధనమ్మ

హమ్మయ్య చాలు ఈ సంవత్సరమంతా ఈ దీవెనతో ఈ చల్లని చూపుని మనసులో పదిలంగా దాచుకుని దివ్యంగా గడిపేస్తాను వచ్చే సంవత్సరం ఇదే రోజు కోసం ఎదురు చూస్తుంటాను " అంటూ తన్మయత్వంగా, భక్తి పారవశ్యంలో తేలియాడింది కాసేపు రంగనాయకి!

వెంటనే వులిక్కిపడింది-

వర్ధనమ్మను వంటింట్లోకి తీసుకెళ్లి పీటవాల్చి, కూర్చోమన్నట్లు సైగ చేసింది రంగనాయకి!

వర్ధనమ్మ తనకు ఎదురుగా కనిపిస్తున్న పూజా మందిరంవైపు ఒక్కసారి చూసింది

రాముడు, సీత, లక్ష్మణుడు, నమ్మిన బంటు హనుమంతుడు-

వారిది ఎంత చక్కని ఐకమత్యం-

ఎంత నిర్మల, మనస్తత్వం-

అందుకే వారి కలయిక జగదైక సుందరం!

వారి ముందు తను ఈ విధంగా-

గబుక్కున చూపు త్రిప్పుకుంది వర్ధనమ్మ!

తన స్థానం ఇక్కడ- అన్నట్లు- రంగనాయకి చేతిలోని కుంకుమ- వర్ధనమ్మ నొసటన చేరింది

ఆమె ముత్తయిదువతనాన్ని మరింత పెంచింది

వర్ధనమ్మ కళ్ళు టప్ మంటూ రెండు నీటి బిందువుల్ని రాల్చాయ్-

అరె- ఏంటండీ- ఏమైంది? కళ్లల్లోగానీ కుంకుమ పడిందా? ఆదుర్దాగా అడిగింది రంగనాయకి-

'అబ్బే- కాదమ్మా నా దీవెన ఫలించలేదని "

ఆఁ- అదేవిఁటి?"

అంతే కదయితే పోయినసారి ఏమన్నాను పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు అనికదా దీవించా కానీ, నీకు నాలుగో నెల్లో అది తల్చుకుని '

గాఢంగా నిట్టూర్చింది రంగనాయకి!

నిజమే కానీ, నా అదృష్టం అలా వుంది చేసుకున్న వార్కి చేసుకున్నంతని వూరికే అన్నారా ఇద్దరు పిల్లలే- నా నొసటన రాశాడేమో ఆ భగవంతుడిలీల ఎలా వుందో

ఎలా వుందో. వేచి చూద్దాం . ఈసారైనా నా కడుపు పండి, ఒక నలుసు కలిగితే అఁ మర్చిపోయానండోయ్ తప్పకుండా మీపేరే పెట్టుకుంటాం



"అబ్బాయి పుడితేనో
వర్ధనరావ్
అహా పేరు కూడా సెలక్ట్ చేసి పెట్టావన్న మాట. ఇక పురుషోత్తంగారిదే ఆలస్యం
"ఛీ . అంటూ కిలకిలా నవ్వింది రంగనాయకి!
బరువైన వాతావరణం హాస్యంగా మారింది!
పిచ్చిపిల్లా నీ మనసులో కోరిక తప్పకుండా నెరవేరుతుంది తిరుగు లేదు '
ఇద్దరూ మాట్లాడుకుంటూ భోజనం అయిందనిపించారు!
అవునూ పిల్లలేరీ అంటే ఇందాక సమాధానం చెప్పావ్ కావేం? అంది వర్ధనమ్మ – అప్పుడే గబుక్కున గుర్తుకు రావటంతో –
అమ్మమ్మ వాళ్ళింటికి వెళ్ళారు సెలవులు కదా ఈ సంక్రాంతికి ఆ పల్లెటూళ్ళలో వుత్సవాలు బాగా జరుపుతారు పెద్ద పండుగ మాకిక్కడ మీ రాకతో ఎంత ముఖ్యమో వాళ్ళకు అక్కడ అంత ప్రాముఖ్యం. చాలా సందడిగా వుంటుంది! అయినా వచ్చేస్తార్లెండి రేపు కనుమ అయిపోగానే ఎల్లుండి ఏట్లో గొబ్బెమ్మలు కలిపేస్తారు ఆ ప్రక్క రోజు వాళ్ళ మేనమామ దిగబెడతానని రాశాడు అన్నట్లు మీ పిల్లలు కులాసాగా వున్నారుకదూ ఏవిఁటో ఎప్పుడూ తీసుకొచ్చేరు కాదు అంతలా ఘోషాలో వుంచుతున్నారా అంది సగం నిష్ఠూరం, సగం హాస్యం ధ్వనించేలా రంగనాయకి, ఆకులకు సున్నం పూస్తూ!
అప్పుడే వచ్చిన పురుషోత్తం – వక్క పలుకు నోట్లో వేసుకుంటూ – చదువుకునే పిల్లల్ని నీకుమల్లే వూర్లు తిప్పుతారా అంటూ సమాధానం చెప్పాడు!
అబ్బో! చదువులు ఒక్క పూటకే పాడయిపోతాయా నిండు ముత్తయిదువ గంపెడు పిల్లలమధ్య-వుంటే ఎంత సంతోషంగా వుంటుందో చూసేవార్కి అయినా అవన్నీ మీకేం తెల్సులెండి సంపాదన సంపాదన
ఇంకోటి కూడా తెలుసులేవోయ్ అంటూ చెవులో గుసగుస లాడుతున్న భర్త వైపు – చిరుకోపంగా చూసి
'ఛీ– పెద్దావిడ వున్నారన్న జ్ఞానం కూడా లేదు
"అవునోయ్ మనకు తల్లితో సమానం మనం చిన్న పిల్లలం కదా అప్పటికి తల్లి కోపగించుకుంటుందా పిల్లల్ని ముద్దుగా మందలిస్తుంది "
ఊఁ అవును ఇదోండి . మందలించండి... కాస్త ' అంటూ గబుక్కున మూలనున్న దుడ్డు కర్ర చేతిలోకి తీసుకుని, వర్ధనమ్మకు అందించింది రంగనాయకి!
హతోస్మి"– అంటూ చిన్న పిల్లాడిలా పెరట్లోకి

# "ఉదాత్తం"

పరుగు తీశాడు పురుషోత్తం
కాసేపు నవ్వులో – ఆ స్థలం మారు మ్రోగింది!
"వస్తానమ్మాయ్ మళ్ళీ పొద్దు పోతుంది' అంది పైకి లేస్తూ వర్ధనమ్మ
ఉండండి . బొట్టు తీస్కుని వెళ్దురుగానీ " అంటూ దేవుడి గదిలోకి వెళ్ళి అంతకు ముందే సిద్ధం చేసి వుంచిన. పళ్ళెం ఇవతలకు తెచ్చింది
అందులో ఒక జరీచీర– రవిక ముక్క– తాంబూలం– రెండు వంద రూపాయల నోట్లు పసుపు, కుంకుమ దోంకాయ పూలు
శుభలక్షణాలన్నీ ఆ పళ్ళెంలో రాజ్యమేలుతున్నాయ్
ప్రతిసారీ నీకు ఇది ఆనవాయితీ అవుతోంది కదమ్మా ఎంత కర్చు ' అంది సన్నగా నొచ్చుకుంటూ వర్ధనమ్మ
ఇవన్నీ మీ కనుకుంటున్నారా కాదు – మీ అయిదో తనానికి అసలు మీరా మాట అనకూడదు మీరొచ్చి మా యింట్లో ఈ సంవత్సరానికి సరిపడే శుభాన్ని ప్రసాదించారు మా కంతకంటే ఇంకేం కావాలి మీ చల్లని చూపు మీ నుదుట కుంకుమను మేము వరంగా భావిస్తాం అదే మాకు శ్రీరామ రక్ష-మా చేష్టలు మీకు కాస్త వెర్రితనంగా అనిపించవచ్చు – అయినా మా నమ్మకం మాది మీరు కర్చు, గట్రాల్ని-బేరీజు వెయ్యవద్దు మాకు మీ రిస్తున్న తృప్తిని మాటల్లో చెప్పలేక ఏదో మాకు కలిగిన దాంట్లో
వంగి పాదాలంటింది రంగనాయకి!
రెండు చేతుల్తో లేవనెత్తి అక్కున చేర్చుకుని
నీ కల్మషంలేని మనసే-నీకు వెలలేని ఆభరణం అది చిరకాలం నీలోనే వుండాలని కోరుకుంటున్నాను వచ్చే జన్మలోనైనా – నీ కడుపున పుడ్తాను వెళ్తానూ
ఆఁ చూశారా పప్పులో కాలేశారు వెళ్తాను అని అంటారా ఎవరైనా
'ఏదో పరాకులో వున్నాను '
"మరే– ఇంటి దగ్గర అందరూ కులాసాగా వున్నారు కదూ ఈసారి మీరీ చీర కట్టుకుని రావాలి అప్పుడు మీ జుట్టు కూడా కాస్త నెరిసి వుంటుంది ఆ తెల్లని జుట్టు మధ్య ఎఱ్ఱటి కుంకుమ నేనే పెట్టాలి
ఏదేదో చెప్పుకు పోతోంది రంగనాయకి–
'ఆఁ ఆఁ అవిడ్ని వచ్చే సంవత్సరం వరకూ వాకిట్లోనే నిల్చోబెట్టేట్టున్నావ్ నీ మాటలతో '
'మీరు మళ్ళీ రంగ ప్రవేశం చేశారూ అయినా మీది మరీ చోద్యమండి నన్ను ఆట పట్టించటానిక్కాకపోతే నేను .. అంతలా వాగుడుకాయనా "
అబ్బే నేనన్నానా ప్రక్కింటి పిన్నిగారు మొన్న ఎవరితోనో అంటుంటే విన్నా "
'ఏమని " అంది చూపుడు వేలుని గడ్డం క్రింద వుంచుకుని నాటక ఫక్కీలో – రంగనాయకి!
వర్ధనమ్మ కూడా కుతూహలంగా చూసింది పురుషోత్తం వంక– ఏం చెప్తాడా– అని!
"నాలుగో వీధిలో వుంటున్న కామాక్షికి నెల తప్పిందని . చూడ్డానికి వెళ్ళావటగా మాటల్లోపడి ఆమెకు తొమ్మిది నెలలు నిండటం కూడా మైమరచావటగా
"అహాఁ గిన్నీస్ బుక్‌లోకి ఎక్కాల్సిన జోక "
మూతి విరిచింది రంగనాయకి–
ముగ్గురూ హాయిగా నవ్వుకున్నారు!
నిష్కల్మషమైన వారి ప్రవర్తనకు మురిసిపోయింది వర్ధనమ్మ!
"వస్తానమ్మ వస్తానండి " అంటూ ఇద్దరి దగ్గరా సెలవు పుచ్చుకుని– గేటుదాటింది–
దారిలో అంతా ఒకటే ఆలోచనలు వర్ధనమ్మకు– తను చేసిన పని సబబేనా కేవలం తన అవసరం తీరటం కోసం . మరో విధంగా వెళ్ళివుంటే . తనను ఆదరించరేమో తన ముఖం కూడా చూడరేమో . ఏమో తన అవస్థని, తన కష్టాల్ని ఏకరువు పెట్టివుంటే– ఇచ్చేవాళ్ళేమో తను పొరపాటు చేసిందా పాపం చేసిందా వాళ్ళని వృథాగా అనుమానించిందా

ఊరు రెండు ఫర్లాంగులు వుందనగా బస్ దిగింది వర్ధనమ్మ తనను ఎవ్వరైనా గమనిస్తారేమోనని ఛీ అని ముఖాన వుమ్మేస్తారేమోనని నలుగురిలో దోషిగా నిలబెడుతారేమోనని శూలాల్లాంటి మాటలతో తుళ్ళపొడుస్తారేమోనని చకచక ముందుకు నడిచింది భయంగా!
పవిటను తలమీదుగా కప్పుకుంది!
ముఖం స్పష్టంగా కనిపించకుండా చేతి సంచిని అడ్డంచుకుంది– మాటి మాటికి– కళ్ళు అల్లల్లాడిస్తూ– చుట్టూ పరికిస్తూ– చెరువు దగ్గరి కెళ్ళి– 'హమ్మయ్య" అని వూపిరి పీల్చుకుని చేతి సంచిని పక్కన పెట్టింది–
చుట్టూ కలయ చూసింది!
మరోసారి స్థిమితంగా వూపిరి పీల్చుకుంది!
ఒకరిద్దరు దారినపోయే వాళ్ళు తప్ప– ఆ రహదారి అంత రద్దీగా లేదు
తనను ఎవ్వరూ చూట్టం లేదని నిర్ణయించుకున్నాక నిండుగా కప్పుకుని వున్న పవిటను తొలగించింది
మెడలోని పసుపుతాడు పచ్చగా మెరుస్తోంది–
ఉదయమే పేనినట్లు పసుపు ముద్దలా వుంది!
అరక్షణంలో ఆ పసుపుతాడు వర్ధనమ్మ మెడలో నుండి చెరువులోకి దూకింది
వర్ధనమ్మ చేతులు వణికాయ్!

## బ్రిటన్‌లో ఆంధ్ర సంఘం

బ్రిటన్‌లో ఉంటున్న ఆంధ్రులు ఆంధ్ర సంస్కృతీ చరిత్రలకు దూరం కాకుండా ఉండేందుకు ఆంధ్ర సంఘం (యు కె) శాయశక్తులా కృషి చేస్తున్నది సాంస్కృతిక కార్యక్రమాలతో బాటు తెలుగుతల్లి అనే పత్రికను శ్రీమతి యేన్ ఎన్ ములుకుట్ల సంపాదకత్వంలో నడుపుతున్నది.

శ్రీమతి కంభంపాటి సుహాసిని శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారి 'విమానం ఎక్కబోతూ'ను అన్న కథని నాటకీకరించి నిర్వహించారు శాస్త్రిగారి 'బొబ్బిలి మల్లమ్మ' రచనని శ్రీమతి శాయిలీల ప్రదర్శించారు. అలాగే శ్రీమతి సుహాసిని నాటకీకరణ, నిర్వహణలో కీ. శే చిలకమర్తి వారి 'గణపతి' ని శ్రీలంక సత్యనారాయణ ప్రదర్శించారు ఆంధ్ర నుంచి పని మీద వచ్చిన శ్రీయుతులు వై రాజేశ్వరరావు, కె నరేంద్రదర్బార రవీంద్రనాధ్, కె ఆనందకిశోర్, జె ప్రభాకరరావు, ఎమ్ లోకనాథంలు శ్రీ ఆదివిష్ణు రచించిన 'అతిథి దేవుళ్ళు వస్తున్నారు', 'నథింగ్ బట్ ది ట్రూత్' అనే నాటకాలను ప్రదర్శించారు.

ఈ ఆంధ్ర సంఘానికి శ్రీ వి. వి. రెడ్డి అధ్యక్షులుగా, శ్రీ ఎం. సి. భాస్కర్ ప్రధాన కార్యదర్శిగా తిరిగి ఇటీవల ఎన్నికయ్యారు.

## విశాఖలో ప్రభుత్వ శాఖల క్రీడోత్సవాలు

1985 ఏప్రిల్ నెలలో విశాఖ జిల్లాలో అన్ని ప్రభుత్వ శాఖల మధ్య క్రీడల పోటీలు పోలీస్ పెరేడ్ మైదానంలో ప్రారంభింప బడ్డాయి తూర్పు నౌకా దళాధికారి క్రీడల పతాకాన్ని ఆవిష్కరిస్తూ పావురాలని ఎగురవేశారు.

రెవిన్యూ, పోలీసు, నగర పాలక సంస్థ, వైద్య–ఆరోగ్యం, సహకారశాఖా, వాణిజ్య పన్నులు, ఎక్సయిజ్, అటవీ శాఖలు క్రీడల పోటీలలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

పురుషుల ఛాంపియన్ షిప్ రెవిన్యూ శాఖకు రాగా, స్త్రీల చాంపియన్ షిప్ గిరిజన సహకార సంస్థకు వచ్చింది

క్రీడోత్సవాలు అనంతరం జంతర్ మంతర్ అనే వీధి నాటిక, ధ్వన్యనుకరణ, మేజిక్, మాట్లాడేబొమ్మ మొదలగు ప్రదర్శనలు ప్రేక్షకులను చిత్రిత ప్రతిమల్ని గావించాయి. విశాఖలో ఈత కొలనులు నిర్మించి క్రీడల్లో ఉత్సాహము ఉన్న వారిని ప్రోత్సహిస్తే బాగుంటుందన్న అభిప్రాయాన్ని చాలామంది వ్యక్తం చేశారు

## చిన్న మొత్తాల పొదుపుపై కార్టూన్ల పోటీ

ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ అకాడమి వారు అం ప్ర స్మాల్ సేవింగ్స్ డిపార్టుమెంటువారి సహకారముతో చిన్న మొత్తాల పొదుపును ప్రోత్సహించే అంశాల మీద కార్టూన్ల పోటీ నిర్వహిస్తున్నారు. వివిధ తరగతుల్లో నిర్వహింపబడే ఈ పోటీలో మొత్తము 32 బహుమతులుంటాయి. ఈ పోటీలోనే మరొక భాగంగా చిన్న మొత్తాల పొదుపును ప్రోత్సహించే స్లోగన్ కాంపిటీషన్ తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ఉంటుంది. స్లోగన్ కాంపిటీషన్‌లో 14 బహుమతులుంటాయి. విజేతలకు ఆకర్షణీయమైన నగదు బహుమతులతో బాటు నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు కూడా బహూకరింపబడతాయి. బహుమతుల మొత్తం విలువ రూ. 8000/= పోటీ గడువు 25-6-1985తో ముగుస్తుంది.

కార్టూన్ల పోటీ వివరాలకు:–

కార్యదర్శి, ఆం.ప్ర. క్రోక్విల్ అకాడమి, 2-2-1109/5బి/4, బాగంబర్‌పేట, హైదరాబాదు–13 పేర స్వంత చిరునామా గల 10x5" కవరును 50 పైసల పోస్టు స్టాంపు అతికించి పంపి ఉచితముగా పొందవచ్చు. □

## "ఉదాత్తం"

కళ్ళు అవిరామంగా తమ పని తాము చేసుకుంటున్నాయి!

చెరువులోని నీటిమట్టాన్ని ఇంకా పెంచుతాం అన్నట్లు ఉరుకుతున్నాయి కన్నీళ్ళు...

తలలోని పూలు తమ పని అయిపోయినట్లు ప్రక్కనే వున్న పొదల్లోకి దూరాయి!

నుదుటి కుంకుమ అస్తమిస్తున్న సూర్యుడ్ని చేరుకుంది!

నీ ముఖం మీది పసుపు నాక్కావాలంటూ – చెరువులోని నీళ్ళు ఆత్రంగా అందుకున్నాయి.

వర్ధనమ్మకు నిన్నటి రూపం వచ్చేసింది!

అంతవరకు హత్య చేస్తున్నట్లు గజ గజలాడుతూ – నిర్వహించిందా పనులన్నీ వర్ధనమ్మ!

ఇప్పుడు ఎంతో స్థిమితంగా – తను చేసిన పాపం కడిగేసినట్లు అనిపించసాగింది –

రూపాన్ని అయితే మార్చగలిగింది గానీ – మనసులోని పాపభారాన్ని – తుడిచేయలేక పోతోంది!

ఆలోచనలు కందిరీగల్లా ముసురుకుంటున్నాయి –

వేటి మీదా ధ్యాస వుంచదలచుకోలేదు వర్ధనమ్మ. – చేతి సంచిని చంకలో వుంచుకుని యంత్రికంగా ఇల్లు చేరుకుంది!

ఎదురొచ్చిన కొడుక్కి, సంచిని, రెండి నున్న డబ్బుని అందించి – బేలగా తన వంక చూస్తున్న కూతుర్ని అమాంతం కావలించుకుని బోరుమని ఏడ్చింది –

ముఖం మీది ఇంకా పసుపు మరకల్ని – నిశితంగా గమనిస్తున్న కూతుర్కి, మరేం సమాధానం చెప్పలేక – దేవుని గదిలోకి వెళ్ళి – తలుపులు బిగించుకుంది!

అంతవరకూ - ఎంతో నిగ్రహంగా వున్న, ఆమె హృదయావేశం – ఒక్కసారిగా పొంగింది ... కళ్ళు కడవలకొద్దీ నీళ్ళని పూరిస్తున్నాయి ...

చేసిన పాపం చెప్పుకుంటే పోతుందన్నట్లు –

నిర్మలంగా నవ్వుతూ – తదేకంగా తన వంక చూస్తున్న – ఆ లీలామానుష వేషధారికి – తన హృదయ భారాన్ని నివేదించుకుంది వర్ధనమ్మ –

మోకరిల్లింది!

"మన్నించు తండ్రీ – ఏ ఇల్లాలూ చెయ్యని పాపం చేశాను ... ఈ జన్మకు నాకు నిష్కృతి లేదు ... మూడ్నెల్ల క్రిందటే పసుపుకుంకుమలకు దూరమైన నేను ... ఈ జీవితమనే నాటకంలో మళ్ళీ ముత్తయిదువగా నటించవలసి వచ్చింది ... ఏం చెయ్యమంటావ్ చెప్పు .... అడకత్తెరలో పోక చెక్కలా నలుగుతున్న నన్ను చూసి – నువ్వు పరిహసిస్తున్నావ్ కదూ. – అమృత హృదయిని రంగనాయకిని మోసపుచ్చాను. పవిత్రమైన వారి మనసుల ముందు తుచ్ఛమైన డబ్బు కోసం అర్హత లేని కొంగు పరచాను .... నన్ను క్షమించు స్వామీ ... నా పాపాన్ని పరిహారం చెయి. – ఈ దురవస్థ మరో ఇల్లాలికి రానీవ్వకు భగవాన్ ...."

తనివితీరా ఏడ్చింది వర్ధనమ్మ:

ఓదార్చే వాళ్ళు లేక – ఓదార్పు పొందాల్సిన సమయమూ కాదు ఒకరికి చెప్పుకునే బాధా కాదు! అన్నట్లు వర్ధనమ్మ పొర్లి పొర్లి ఏడ్చింది! లేచింది .. పడిపోయింది ...

మళ్ళీ లేచింది–

నిటారుగా నిల్చుంది –

కన్నీళ్ళతో దేవుడికి – మరోసారి తన తప్పిదాన్ని నివేదించుకుంది –

హృదయ భారం కాస్త తగ్గినట్లయింది –

శరీరం తేలికయింది –

తూలిపోతోంది ....

ముందుకు కూలబడింది వర్ధనమ్మ శరీరం!

దేవుని ముందు – ఉదయం పూరికి వెళ్తూ వెలిగించిన దీపపు వత్తి – చివరి దశలో రెప రెపలాడుతూ ... నూనె లేక – చేయందించేవారు లేనట్లు – దీనంగా చూస్తోంది.

నేనున్నాగా – అన్నట్లు – గాలి కెగిరిన వర్ధనమ్మ పవిట – దీపపు కాంతిని ఆత్రంగా కౌగలించుకుంది. □

## హైదరాబాద్ నోట్‌బుక్

### తెలుగువారి మరొక విజయకేతనం:—

ఇటీవల పురాతత్త్వ పరిశోధనరంగంలో తెలుగు పరిశోధకులు సాధించిన ఘన విజయాలు చరిత్ర గతినే మార్చివేశాయి. వాటిలో ప్రథమగణ్యం డాక్టర్ నేలటూరు వెంకట రమణయ్యగారి గంగాధర శిలాశాసనం. ఆది కన్నడ కవి అయిన పంపడు తెలుగుదేశం నుంచి కన్నడ దేశానికి వలస వెళ్ళాడనే వాదం, పంపని సోదరుడు జినవల్లభుడు స్వయంగా కొండమీద చెక్కించిన శాసనం వల్ల పరాస్తమైంది. ఆ పరమసత్య నిరూపణ శ్రేయస్సు డాక్టర్ వెంకట రమణయ్యగారికి లభించింది: ఆయన అర్ధ శతాబ్ది చరిత్ర పరిశోధన సార్థకమైంది. రెండవది జిల్లా పురాతత్త్వ సాంస్కృతిక పరిశోధన సంస్థ డైరెక్టర్ డాక్టర్ టి.వి.జి.శాస్త్రిగారు అమరావతి సమీపంలో ప్రాచీనతమ జైన స్తూపాన్ని కనుగొనడం. దీనితో జైన చరిత్ర గతే మారిపోయింది. డాక్టర్ శాస్త్రిగారు పురాతత్త్వ పరిశోధనలో తలపండిన ప్రామాణిక విద్వాంసులు. తమ సంస్థ బృందంతో ఇటీవల వడ్డమానులో ఒక దిబ్బను తవ్వగా ఈ ప్రాచీనతమ జైనస్తూపం వెలువడి చరిత్రకారులను ఆశ్చర్యపరిచింది. వడ్డమాను గుంటూరు జిల్లా అమరావతికి ఏడు కిలో మీటర్లలో వున్న గ్రామం. ఈ స్తూపం వెలువడడంతో ఆంధ్ర ప్రాంతంలోని విస్మృత చరిత్రను కలపడానికి అవకాశం కలిగింది. ఈ స్తూపాన్ని ఆ ప్రాంతం పాలించిన సోమకుడనే రాజు నిర్మించి వుంటాడని డాక్టర్ శాస్త్రిగారు అంటున్నారు. సోమకుడు మౌర్యుల అనంతరం క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దం వాడు. ఈ స్తూపం గ్రామంలోని పెద్దకొండ అనే గుట్టపై వుంది. ఈ పరిశోధన వల్ల ఆంధ్ర ప్రాంతంలో, ముఖ్యంగా కృష్ణాతీరంలో బౌద్ధంతో పాటు జైనం కూడ సాతవాహనులకు ముందు నుంచే వ్యాపించిందని, అమరావతీ కళ సాతవాహనులకు ముందు నుంచే వుందని రుజువయిందని శాస్త్రిగారన్నారు. వడ్డమాను గ్రామానికి ఆ పేరు జైనుల చివరి తీర్థంకరుడు వర్ధమానుని పేరువల్ల వచ్చింది. ఈ కొండ మీద లభించిన పూసలు, నాణేలు, మృణ్మయ పాత్రలు, శిల్పఖండాలు ఆశ్చర్యం కొల్పుతున్నాయని, ఇవన్నీ క్రీస్తు శకానికి ముందువేనని శాస్త్రిగారు అంటున్నారు. వడ్డమానులో తవ్వకాలు 1981 నుంచే జరుగుతున్నాయి. వాటిలో ప్రధానంగా వెలువడింది ఈ జైనస్తూపం. దీని వ్యాసం దాదాపు 14 మీటర్లు. మూడు వర్తులాల కుడ్యాలున్నాయి. కుడ్యం వెడల్పు దాదాపు మీటరుంటావు. ఈ స్తూపానికి ఉత్తర ప్రదేశ్‌లోని మథురలో వున్న కనకలిటిల స్తూపానికి వాలె పోలికలు ఉన్నాయి. కటకటాల మీది తోరణాల అలంకరణలను బట్టి మథుర స్తూపం పనితనం ఎక్కువగా వుండడాన్ని బట్టి వడ్డమాను స్తూపంలో పనితనం తక్కువ కావడాన్ని బట్టి వడ్డమాను స్తూపం భారత దేశంలో ప్రాచీనతమమైన స్తూపమని భావిస్తున్నాను — అంటారు శాస్త్రిగారు. గుట్టమీది గుహమీద రాజో సోమకస అనుబంధి- అనే ప్రాకృత భాషలోని బ్రాహ్మీ లిపి శాసనం మరొక గొప్ప చారిత్రక ప్రమాణం. క్రీస్తుకు పూర్వం 236లో అశోకుడు మరణించిన తర్వాత ఈ ప్రాంతాన్ని సోమకుడు పాలించినట్లు, ఈ స్తూపాన్ని అతడే నిర్మించినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తుందని శాస్త్రిగారంటున్నారు. ఇక్కడ కనుగొన్న మరొక శాసనం జైన తీర్థంకరుడు భద్రబాహువు శిష్యుడు గోసునిది. వీటన్నిటిని బట్టి జైనం బౌద్ధ వ్యాప్తికి ముందు మూడవ శతాబ్దాలు విరాజిల్లినదని స్పష్టమవుతుంది. క్రీస్తుశకం 3వ శతాబ్దంలో వున్న ఇక్ష్వాకు రాజయిన వీరపురుషదత్తుడు దీనిని ధ్వంసం చేసి, బౌద్ధాన్ని ప్రోత్సహించాడు. ఈ స్తూపం పైనే బౌద్ధ విహారం కట్టించాడు. జైనస్తూపాల పైభాగాన్ని పడగొట్టి బౌద్ధవిహారాలు కట్టడం అప్పటి పద్ధతి. తర్వాత బౌద్ధం సాతవాహన, ఇక్ష్వాకు, విష్ణుకుండిన వంశాల పాలనలో 1,500 సంవత్సరాలకు పైగా వర్ధిల్లిందని చరిత్ర చెబుతున్నది. సాధారణంగా కొండలు, గుట్టలు దేవతా వాసాలనే విశ్వాసం ప్రబలడం వల్ల జైనులు, బౌద్ధులు కొండల మీద, గుట్టల మీద స్తూప విహారాలు నిర్మించేవారని శాస్త్రిగారు వివరించారు. జైనులు, బౌద్ధులు సముద్ర మార్గంగా కృష్ణా తీరానికి వచ్చారని ఆయన అన్నారు. బుద్ధుడు అమరావతికి వచ్చినట్లు ఆధారా లేమీ లేవు. కాని అమరావతి సారనాథ్, బుద్ధ గయ, నలంద, మున్నగు బౌద్ధుల పవిత్ర స్థలాలతో సాటిగా పరిగణింపబడు తున్నదని శాస్త్రిగారు అన్నారు. డాక్టర్ శాస్త్రిగారి నాయకత్వంలో జిల్లా పురాతత్త్వ సాంస్కృతిక పరిశోధన సంస్థ చేసిన పరిశోధనల వల్ల తెలుగుదేశపు రాజకీయ సాంస్కృతిక రంగాలలో విస్మృత ఘట్టాలు తెలియవచ్చి, చరిత్ర సమగ్ర మవుతున్నది. ఇలాటి అద్వితీయ కృషి చేస్తున్నందుకు డాక్టర్ టి.వి.జి.శాస్త్రి గారిని, జిల్లా పురాతత్త్వ, సాంస్కృతిక పరిశోధన సంస్థను అభినందిస్తున్నాను. ఈ సంస్థ పెక్కు తాళపత్ర గ్రంథాలను సేకరించింది. వాటికి ఒక అకారాది సూచికను నేను దాదాపు పదేళ్ల కిందట సిద్ధపరచాను. దానిని ముద్రిస్తే భాషా సాహిత్య చరిత్ర పరిశోధకులకు ఎంతో ప్రయోజనం కలుగుతుంది. ఆ విషయంలో శ్రద్ధ తీసుకోవాలని శాస్త్రిగారిని కోరుతున్నాను.

**వడ్డమాను జైన స్తూపం తవ్వకాలలో ఒక దృశ్యం**



### ఉపశ్రుతి:—

మనిషిని గొప్పగా చేసేవి ఏమిటిసార్? — అనడిగాడు ఒక విద్యార్థి నన్ను. ఆయనను ఏమనుకుంటావోయి నీవు చదువుతున్న షేక్స్పియరే అన్నాడు "పౌరుషం, విద్య, సాధు స్వభావం, సద్గుణాలు, యౌవనం, స్వాతంత్ర్యం వంటివి రుచి కలిగించే సుగంధద్రవ్యాలు. ఉప్పు వంటివి. అవి మానవునికి పరిణతి కలిగిస్తాయి" అని- అన్నారు మా మాటలు వింటున్న ఒక కళాశాలా చార్యులు.

—తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna. Phones: P. B. X.: 61247, 61248 & 75667.*

# మీ పాపాయికి సిరిలాక్ ప్రేమను అందివ్వండి!



సుమారు 4వ నెల నుంచి, మీ పాపాయికి పాలతోపాటు, ఘనపదార్థాలు కూడా అవసరమవుతాయి. కాబట్టి సిరిలాక్ ప్రేమను అందించడానికి తగిన సమయం ఇదే.

**పోషకాహారపు లాభం :** ప్రతి సిరిలాక్ తో పాటు, మీ పాపాయికి కావలసిన పోషకాహారాలు—మాంసకృత్తులు-కార్బోహైడ్రేట్లు-కొవ్వు-విటమిన్లు-ఖనిజాలను సమకూరుస్తుంది. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టు సమపాళ్లలో తయారయింది.

**త్వరితగతి లాభం :** మీ పాపాయికి ఎప్పుడు కావాలంటే, అప్పుడు, సెకెన్లలో సిద్ధమవుతుంది. దీనిలో పాలు, పంచదార ఉండనే ఉన్నాయి. ఇక, మీరు, ముందు మరిగించి వుంచుకున్న నీటిలో దీన్ని కలపాలి-అంతే!

**రుచి లాభం :** మొదటి ఘన ఆహారం, కొత్త గమ్మత్తు రుచిని అనుభూతిని ఇస్తుంది. పాపాయికి దీని రుచి ఎంతో నచ్చుతుంది. ఇది, శుభారంభం కూడా. మీ పాపాయికి సమపాళ్లలో పోషకాహారాన్ని అందచేసేందుకూ, తయారీలో శ్రద్ధను పాటించేందుకూ, డబ్బా మీద సూచనలను అనుసరించండి.

**పెరుగుదల పట్టిక ఉచితం!**
మీ పాపాయికి తన స్వంత పెరుగుదల పుస్తకం కోసం రాయండి-సిరిలాక్, పోస్ట్‌బాక్స్-3
కొత్త ఢిల్లీ-110008

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
21-27, జూన్, '85